భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ కూర్మ పురాణం



వచనం : డా॥ జయంతి చక్రవర్తి

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ కూర్మ పురాణం






జిల్లెళ్ళమూడి అమ్మ

మాతృశ్రీ అనసూయాదేవి ఆశీస్సులతో...

వచనం : డాక్టర్ జయంతి చక్రవర్తి

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

ప్రచురణ



శ్రీ బాలాజీ పబ్లికేషన్స్

28-25-32/1, అరండల్‌పేట, ఏలూరురోడ్, విజయవాడ-2

సెల్ : 9441176276 / 9966675815

# శ్రీ కూర్మ పురాణం


| | | |
|---|---|---|
| వచనం | : | డాక్టర్ **జయంతి చక్రవర్తి**<br>విజయవాడ. 9390526272 |
| కాపీరైట్ | : | పబ్లిషర్స్ |
| ప్రథమ ముద్రణ | : | 2014 |
| ముఖచిత్రం | : | రమణ |
| డి.టి.పి. &<br>పేజి లే-అవుట్ | : | విద్యార్థి క్రియేషన్స్<br>విజయవాడ |
| ముద్రణ | : | శ్రీ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్<br>విజయవాడ-3 |
| ప్రచురణ | : | **శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**<br>నసురుల్లాఖాన్ వీధి<br>అరండల్‌పేట, విజయవాడ |
| వెల | : | ₹. 60 /- |




ఆర్షవిజ్ఞాన భాండాగారాలైన అష్టాదశ పురాణాలని ఆంధ్రుజాతికి అందించిన శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్ట్ వారికి, ఆ పురాణాలను అనువదించిన మహారచయితలకి సహస్రాధిక ప్రణామాలు సమర్పిస్తున్నాం.

# భగవాన్ వేదవ్యాస మహర్షి

## వ్యాసగుహ, సరస్వతీ తీరం, బదరీనాథ్



*అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో హరిః ।*
*అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ॥*

## కృతజ్ఞతలు

అష్టాదశ పురాణాలని సామాన్య జనానికి అందించాలని సంకల్పించిన శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ అధినేత **శ్రీ పుట్టగుంట వీరయ్యచౌదరి (బోస్) గారికి** ముందుగా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ గ్రంథాలకి తమ అమూల్యమైన ఆశీస్సులందించిన శ్రీ పీఠాధిపతులు పరమపూజ్య **శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామివారికి,** అస్మద్గురువర్యులు ఆర్షవిద్యాసాగర **బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారికి** సహస్రాధిక వందనాలు సమర్పిస్తున్నాను.

ప్రోత్సహించిన మిత్రులు రోహిత్ ప్రింటర్స్ అధినేత శ్రీ పుప్పాల అప్పారావు గారికి, డా॥ కానుకొల్లు బాలకృష్ణ, వలివేటి శివరామకృష్ణమూర్తి, వేదాంతం సార్వభౌమ, ఉన్నవ గణేష్‌లకి..... అలాగే ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసిన శ్రీమతి వినీల గారికి పేజి మేకింగ్ చేసిన విద్యార్థి క్రియేషన్స్ వారికి ప్రత్యేక అభినందనలు...




Sreepeetam
# 1-9-278/10/1, Lalitha Nagar, Vidyanagar, Hyderabad - 500 044.
Ph: 27076655, M: 098490 33991

# ఆశీస్సులు

డా॥ జయంతి చక్రవర్తి గారు అనేక ఆధ్యాత్మిక రచనల ద్వారా తెలుగు పాఠకులకు సుపరిచితులు. విజయవాడ కనకదుర్గ దేవస్థానం పక్షాన వెలువడుతున్న 'కనకదుర్గ ప్రభ' పత్రికకు ప్రారంభ సంపాదకులుగా ఆయన పేరు తెచ్చుకున్నారు. 'దశ మహావిద్యలు' పుస్తక రచన తరువాత డా॥చక్రవర్తి గారు అష్టాదశ పురాణాలను తెలుగు పాఠక ప్రపంచంలోకి లోతుగా తీసుకువెళ్లాలని సంకల్పించారు. ఒక్కొక్క పురాణ సారాంశాన్ని ఒక్కొక్క చిన్న పుస్తకంగా విడుదల చేయాలన్న ఆ రచయిత సంకల్పం ప్రశంసనీయం.

ఈ చిన్నిపొత్తాలు పాఠకులందరికీ ప్రయోజనకరంగా, సదుపాయకరంగా ఉంటాయి. వీటి ఉపయోగాన్ని పాఠకులందరూ అందిపుచ్చుకోవాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.



స్వామి పరిపూర్ణానంద

**జయ వత్సరం, శ్రావణ పూర్ణిమ**

**(10.8.2014)**

"ఆర్షవిద్యాసాగర", "మధురభారతి"
మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



దూరవాణి : 81061 96418

301, శ్రీ సాయి ఎన్‌క్లేవ్, అడవి శేషగిరిరావు వీధి, లక్ష్మీనగర్
సత్యనారాయణపురం, విజయవాడ-520011



తేది : 19-8-2014

# ఇది సృష్టి కథ

"అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష" అనే వెక్కిరింపు లోకంలో బాగా ప్రచారంలో ఉంది. వెక్కిరించడానికి అన్నమాటే అయినా, ఇది నిజమని మాత్రం చెప్పక తప్పదు. వేదం సృష్టితత్త్వాన్ని, సృష్టికి మానవుడికి ఉన్న సంబంధాన్ని, మానవుడికి సృష్టికర్తతో గల అనుబంధాన్ని వ్యక్తం చేసింది. వేదం ఏ ఒక్కరో రచించిన గ్రంథం కాదు. సృష్టితత్త్వాన్ని, పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవాలని ఆరాటపడిన మహర్షి సముదాయానికి అంతర్నేత్రానికి గోచరించిన ఒక దర్శనం. హృదయస్థానంలో వినిపించిన ఒక నాదం (శ్రుతి).వేదం 'అపౌరుషేయం' అని కూడా పెద్దలు గుర్తించారు. 'అపౌరుషేయం' అంటే మానవుమాత్రుడి రచన కాదు అని అర్థం.

అనాదిగా అలా దిగి వచ్చిన వేదం వ్యాసమహర్షి కాలానికి చిక్కువడిన దారాల రాశిగా ఉంటే, ఆ చిక్కును విడదీసి, వేదవిభాగ నిర్ణయంచేసి, వేదం మనకు అక్కరకు వచ్చేలా చేశాడు ఆ మహర్షి. ఆనాటి నుండి అతడికి 'వేదవ్యాసుడు' అనే పేరు వచ్చింది. సకల వేదాల సారాన్ని 555 సూత్రాలుగా "బ్రహ్మసూత్రాలు" రచించాడు. అయినా, ఆ మహర్షికి తృప్తి కలుగలేదు. వేదమనే విత్తనంలో నుంచి విశాలమైన పురాణ మహావృక్షాలను అంకురింపచేశాడు. అందుకే పురాణాలకు

"వేదోపబృంహణాలు" అని పేరు. "ఉపబృంహణం" అంటే విత్తనాలు నుంచి మొలక రావడం. విత్తనంలో ఏమి ఉన్నదో మొలకలో, మొక్కలో, చెట్టులో అదే ఉంటుంది.

వేదవాఙ్మయంలో దాగిన సృష్టితత్త్వాన్ని కథారూపంగా వివరించడానికి అష్టాదశ పురాణాలను రచించాడు వ్యాసమహర్షి. మానవాభ్యుదయం కోసం వెలువడిన ఈ పురాణ వాఙ్మయసారాన్ని సంక్షిప్తంగా సంకలనం చేసి అందిస్తే, ఈనాటి సమాజానికి శ్రేయస్సు కలుగుతుందని సంకల్పించాడు మా శిష్యమిత్రుడు డా॥ జయంతి చక్రవర్తి. తన ఓర్పు నేర్పులతో అష్టాదశ పురాణాల ఆంతర్యాన్ని వాడుకభాషలో నేటి జన సామాన్యానికి అందుబాటులోకి తెచ్చే పవిత్రమైన బాధ్యతను నెరవేర్చాడు.

మంచి సాహిత్యాన్ని మన సమాజానికి అందించే మహత్తర లక్ష్యంతో శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఈ అష్టాదశ పురాణాలని ప్రచురించటానికి ముందుకు వచ్చారు. వీరిద్వారా ఇంకా ఎన్నో చక్కని గ్రంథాలు వెలుగు చూస్తున్నాయి.

పురాణ వాఙ్మయంలోని పుణ్యకథా విశేషాలను ఈనాటి సమాజానికి పంచే కృషిలో పాలు పంచుకుంటున్న మా చక్రవర్తి, సంప్రదాయ సాహిత్యాన్ని ప్రచురించే సత్కార్యాన్ని మహాయజ్ఞంగా స్వీకరించిన ప్రచురణకర్త శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఎంతైనా అభినందనీయులు.

వీరిద్దరికీ అంతర్యామి అనంత శుభాలనూ ప్రసాదించాలని ఆశీర్వదిస్తూ, ఈ గ్రంథాలు ప్రజలకు చేరువ కాగలవని ఆకాంక్షిస్తున్నాను.

- మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



# పురాణ పురుషుడు శ్రీమన్నారాయణుడు



# విషయసూచిక





# ఉపోద్ఘాతము

అం.ఆ

**వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ ।**
**నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా ॥**

**వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

## అష్టాదశ పురాణాలు

మన భారతవాఙ్మయంలో వేదాల తరువాత అంతటి ప్రాశస్త్యాన్ని పొందిన గ్రంథాలు పురాణాలు. వేదాల్లో చెప్పిన ధర్మాల్ని కథలరూపంలో, ఆఖ్యానాల రూపంలో సామాన్యులకు సైతం అర్థమయ్యేలా తెలియచెప్పేవే పురాణాలు. అందుకే పురాణాల్ని పంచమవేదంగా కీర్తించారు. అసలు పురాణం అంటే? పురా అపినవం-పురాతనమైనప్పటికీ నూతనంగా వుండేది అని అర్థం. అలాగే 'పురా ఆనతి' అంటే ప్రాచీనకాలంలో జరిగింది అని, వాయుపురాణం పురాణశబ్దాన్ని నిర్వచిస్తే, 'పురాఏతత్ అభూత్' పూర్వం ఇలా జరిగింది అని బ్రహ్మాండ పురాణం పురాణశబ్దానికి అర్థాన్ని చెబుతుంది. వీటన్నిటినీ క్రోడీకరించి చూస్తే పురాణం అంటే పూర్వకాలంలో జరిగిన ఎన్నో విషయాల్ని వివరించి చెప్పేది అని తెలుస్తోంది.

పురాణాలు ఎన్ని-

పురాణాలు మహాపురాణాలు, ఉపపురాణాలని రెండు విధాలుగా వున్నాయి. మహాపురాణాలు 18, అలాగే ఉపపురాణాలు 18.

**బ్రహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవచ ।**
**భాగవతం నారదీయం మార్కండేయంచ కీర్తితమ్ ॥**

**ఆగ్నేయంచ భవిష్యంచ బ్రహ్మవైవర్త లింగకే ।**
**వారాహంచ తథా స్కాందం వామనం కూర్మ సంజ్ఞకమ్ ।**
**మాత్స్యం చ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్ ॥**

1.బ్రహ్మపురాణం 2.పద్మపురాణం 3.విష్ణుపురాణం 4.వాయు పురాణం 5.భాగవత పురాణం 6.నారదపురాణం 7.మార్కండేయ పురాణం

8.అగ్నిపురాణం 9.భవిష్యపురాణం 10.బ్రహ్మవైవర్త పురాణం 11.లింగపురాణం 12. వరాహ పురాణం 13.స్కాంద పురాణం 14.వామన పురాణం 15.కూర్మ పురాణం 16.మత్స్య పురాణం 17.గరుడ పురాణం 18.బ్రహ్మాండ పురాణం- ఈ పద్దెనిమిదీ మహాపురాణాలు. అలాగే 18 ఉపపురాణాలు కూడా వున్నాయి. ఈ మహాపురాణాల పేర్లని గుర్తుంచుకోవటానికి శ్లోకం కూడా వుంది.

**'మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ్ర'త్రయం 'వ' చతుష్టయం।**
**అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥**

'మ' తో మొదలయ్యేవి రెండు 1.మత్స్య 2.మార్కండేయ

'భ' తో మొదలయ్యేవి రెండు 1.భాగవత 2.భవిష్య

'బ్ర' తో మొదలయ్యేవి మూడు 1.బ్రహ్మ 2.బ్రహ్మవైవర్త 3.బ్రహ్మాండ

'వ' తో మొదలయ్యేవి నాలుగు 1.వాయు 2.విష్ణు 3.వామన 4.వరాహ

అ-అగ్ని, నా-నారద, ప-పద్మ, లిం-లింగ, గ-గరుడ, కూ-కూర్మ, స్కా-స్కాంద ఇలా మొత్తం పద్దెనిమిది పురాణాలు.

## పురాణాలు విష్ణుస్వరూపం

అష్టాదశ పురాణాలను సాక్షాత్తు విష్ణు స్వరూపంగా పోల్చారు. 18 పురాణాలని మహావిష్ణువు శరీరంలోని 18 అంగాలుగా భావిస్తారు మన ప్రాచీన ఋషులు.

1. బ్రహ్మపురాణం - శ్రీ మహావిష్ణువు శిరస్సు
2. పద్మపురాణం - శ్రీ మహావిష్ణువు హృదయం
3. విష్ణుపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిభుజం
4. వాయుపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమభుజం
5. భాగవతపురాణం - శ్రీ మహావిష్ణువు ఊరువులు
6. నారదపురాణం - శ్రీ మహావిష్ణువు నాభి
7. మార్కండేయపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిపాదం
8. అగ్నిపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమపాదం

9. భవిష్యపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిమోకాలు
10. బ్రహ్మవైవర్తపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమమోకాలు
11. లింగపురాణం - శ్రీ మహావిష్ణువు కుడి చీలమండ
12. వరాహపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమ చీలమండ
13. స్కందపురాణం - శ్రీ మహావిష్ణువు కేశాలు
14. వామనపురాణం - శ్రీ మహావిష్ణువు చర్మం
15. కూర్మపురాణం - శ్రీ మహావిష్ణువు పృష్ఠభాగం
16. మత్స్యపురాణం - శ్రీ మహావిష్ణువు మెదడు
17. గరుడపురాణం - శ్రీ మహావిష్ణువు మాంససారం
18. బ్రహ్మాండపురాణం - శ్రీ మహావిష్ణువు ఎముకలు

పురాణ లక్షణం :-

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంత రాణి చ ।**
**వంశానుచరితం చేతి పురాణం పంచ లక్షణం ॥**

పురాణానికి ఐదు లక్షణాలు ప్రధానంగా వుండాలని చెప్పారు. 1.సర్గ-అంటే ప్రపంచ సృష్టి, 2.ప్రతిసర్గ-ఈ ప్రపంచ ప్రళయం, 3.వంశం-రాజుల, ఋషుల, దేవతలకు సంబంధించిన వంశ విశేషాలు-అవతారాలు 4.వంశానుచరితం-రాజవంశాలలో, ఋషుల వంశాలలో పుట్టిన వారి జీవితచరిత్రలు, 5.మన్వంతరాలు-మనువులు, మనువు ద్వారా ఏర్పడ్డ సంతతి, ఆయా మన్వంతరాలలో జరిగిన విశేషాలు. ఈ విధంగా ప్రతిపురాణం పంచలక్షణాలతో కూడి వుంటుంది.

పురాణకర్త :-

**విష్ణోరంశో మునిర్జాత సత్యవత్యాం పరాశరాత్ ।**
**పురాణ సంహితాం దద్యే తేషాం ధర్మ విధిత్సయా ॥**

అనే ఈ ప్రమాణ శ్లోకం ప్రకారం సత్యవతీ పరాశర మహర్షి కుమారుడుగా శ్రీ మహావిష్ణు అంశంతో జన్మించిన వ్యాసుడే అష్టాదశ పురాణాల కర్త అని తెలుస్తోంది. ఈయననే కృష్ణద్వైపాయనుడు అని కూడా అంటారు. పురాణాలకు కర్త వ్యాసుడైతే వక్త సూతమహర్షి. ఈయన నైమిశారణ్యంలో శౌనకాది మహామునులకు ఈ పురాణాలన్నిటినీ ప్రబోధించాడు.

పురాణాల ప్రాచీనత :-

వేద వాఙ్మయం ఎంత విస్తృతంగా వుందో, పురాణ వాఙ్మయం కూడా అంత విస్తృతంగా వుంది. సాధారణంగా లోకంలో వేదాలు అత్యంత ప్రాచీనమైనవని చెబుతారు. అయితే ఈ శ్లోకం వేదాలకన్నా పురాణాలే ప్రాచీనమైనవని చెబుతుంది.

**పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్ ।**
**నిత్యం శబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ।**
**అనంతరంచ వక్త్రేభ్యః వేదాంతస్య వినిర్గతాః ॥**

పూర్వం బ్రహ్మ నోటి నుంచి వందకోట్ల శ్లోకాలతో ముందు పురాణాలు బయలుదేరి ఆ తరువాత వేదాలు బయలుదేరాయట. ఇలా వందకోట్ల శ్లోకాలతో చతుర్ముఖ బ్రహ్మతో చెప్పబడ్డ పురాణం మొత్తం ఒక్కటిగానే వుండేది. అల్పబుద్ధులైన మానవుల కోసం ఆ బ్రహ్మదేవుడే వ్యాసుడి రూపంలో వచ్చి ఆ కోటిశ్లోకాల పురాణాన్ని నాలుగు లక్షల శ్లోకాలలోకి కుదించి దాన్ని పద్దెనిమిది పురాణాలుగా రచించాడని స్కందపురాణం చెబుతుంది.

**పురాణమేక మేవాసీ దస్మిన్ కల్పాంతరే నృప ।**
**త్రివర్గ సాధనం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ॥**
**స్మృత్వా జగాదచ మునీన్ ప్రతి దేవశ్చతుర్ముఖః ।**
**చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా ।**
**తదష్టాదశధా కృత్వా భూర్లోకేஉ స్మిన్ ప్రభాష్యతే ॥** *(స్కంద పురాణం)*

# అష్టాదశ పురాణాల మొదటి వక్త - శ్రోత

అష్టాదశ పురాణాలను మొదటగా చెప్పిన వక్తలు వారి నుంచి మొదటిసారి విన్న శ్రోతలు ఈ క్రింద చెప్పిన విధంగా వుంటారు. అదేవిధంగా ఒక్కొక్క పురాణానికి వక్తృ శ్రోతృపరంపర వేరువేరు విధాలుగా కూడా ఉంటుంది.

| సం. పురాణం | ఏకల్ప వృత్తాంతం | వక్తృశ్రోతలు |
|---|---|---|
| 1. బ్రహ్మ పురాణాన్ని | బ్రహ్మ కల్పంలో | బ్రహ్మ మరీచి మహామునికి బోధించాడు |
| 2. పద్మ పురాణాన్ని | పద్మ కల్పంలో | స్వాయంభువమనువు బ్రహ్మకు బోధించాడు |
| 3. విష్ణు పురాణాన్ని | వరాహ కల్పంలో | పరాశరుడు బ్రహ్మకు బోధించాడు |
| 4. శివ(వాయు)పురాణాన్ని | శ్వేత కల్పంలో | శివుడు వాయువుకు బోధించాడు |
| 5. భాగవత పురాణాన్ని | సారస్వత కల్పంలో | విష్ణువు బ్రహ్మకు బోధించాడు |
| 6. నారద పురాణాన్ని | బృహత్ కల్పంలో | పూర్వ భాగాన్ని – సనకాదులు నారదునికి బోధించారు. ఉత్తరభాగాన్ని – వశిష్ఠుడు మాంధాతకు బోధించాడు |
| 7. మార్కండేయ పురాణాన్ని | శ్వేత వారాహకల్పంలో | మార్కండేయుడు జైమినికి బోధించాడు |
| 8. అగ్ని పురాణాన్ని | ఈశాన కల్పంలో | అగ్నిదేవుడు వశిష్ఠుడికి బోధించాడు |
| 9. భవిష్య పురాణాన్ని | అఘోర కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |
| 10. బ్రహ్మవైవర్త పురాణాన్ని | రథంతర కల్పంలో | సావర్ణి నారదుడికి బోధించాడు |
| 11. లింగ పురాణాన్ని | కల్పాంత కల్పంలో | పరమశివుడు నారదుడికి బోధించాడు |
| 12. వరాహ పురాణాన్ని | మనుకల్పంలో | విష్ణువు పృథ్వికి బోధించాడు |
| 13. స్కాంద పురాణాన్ని | తత్పురుషకల్పంలో | స్కందుడు భూమికి బోధించాడు |
| 14. వామన పురాణాన్ని | కూర్మ కల్పంలో | బ్రహ్మ పులస్త్య మహామునికి బోధించాడు |
| 15. కూర్మ పురాణాన్ని | లక్ష్మీ కల్పంలో | విష్ణువు పులస్త్య మహామునికి బోధించాడు |
| 16. మత్స్య పురాణాన్ని | సప్త కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 17. గరుడ పురాణాన్ని | గరుడ కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 18. బ్రహ్మాండ పురాణాన్ని | భవిష్య కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |

# పురాణాలు ఎందుకు చదవాలి?

**పురాణశ్రవణే శ్రద్ధా యస్య స్యాద్బ్రాతరస్వహమ్ ।**
**తస్య సాక్షాత్ప్రసన్నః స్యాత్ శివో విష్ణుశ్చ సానుగః ॥**

**యత్స్నాత్వా పుష్కరే తీర్థే యాగే సింథౌ చ సంగమే ।**
**తత్ఫలం ద్విగుణం తస్య శ్రద్ధయా వై శృణోతి యః ॥**

**యే పఠంతి పురాణాని శృణ్వన్తి చ సమాహితాః ।**
**ప్రత్యక్షరం లభంత్యేతే కపిలాదానజం ఫలమ్ ॥**

**అపుత్రో లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ।**
**విద్యార్థీ లభతే విద్యాం మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥**

**యే శృణ్వన్తి పురాణాని కోటిజన్మార్జితం ఖలు ।**
**పాపజాలంతు తే హిత్వా గచ్ఛన్తి హరిమందిరమ్ ॥**

పురాణాలు వినడంలో ఎవరికైతే శ్రద్ధ ఉంటుందో మరియు నిత్యము ఎవరైతే శ్రవణం చేస్తారో, అటువంటి వారి విషయంలో శివ-కేశవులు మరియు వారి గణాలు సంపూర్ణానుగ్రహం ప్రదర్శిస్తారు. పుష్కర తీర్థాల్లో, ప్రయాగ మొదలైన నదీసంగమ క్షేత్రాల్లో స్నానాలాచరిస్తే ఏవిధమైన పుణ్యం పొందగలరో దాని రెట్టింపు పుణ్యం పురాణ శ్రోతలకు లభిస్తుంది. భక్తి శ్రద్ధలతో పురాణ పఠన-శ్రవణాలు చేసేవారు కపిలగోవును దానం చేస్తే కలిగే పుణ్యరాశిని పొందగలరు. పుత్రులు లేనివారు పుత్రులను, దరిద్రులు ధనాన్ని, విద్యార్థులు విద్యను, మోక్షగాములు మోక్షాన్ని పొందగలరు. పురాణ శ్రోతలు తమ కోటి జన్మల పాపాలను దూరం చేసికొని చివర్లో శ్రీమన్నారాయణమూర్తి సాయుజ్యం పొందగలరు.

# పురాణ వైభవం

**అష్టాదశ పురాణానాం నామధేయాని యః పఠేత్ ।**
**త్రి సంధ్యాం జపతే నిత్యం సోఽశ్వమేధ ఫలం లభేత్ ॥**

ఈ అష్టాదశ మహాపురాణాల పేర్లను ఉదయ-మధ్యాహ్న-సాయంకాల సమయాల్లో ఎవరైతే పఠిస్తారో వారు అశ్వమేధ ఫలాన్ని పొందగలరని భావం.

# శ్రీ కూర్మ పురాణం



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥

అష్టాదశ పురాణాలలో పదిహేనో పురాణం శ్రీకూర్మ మహాపురాణం. 'కూర్మం పృష్ఠం సమాఖ్యాతం' అన్న మాట ప్రకారం ఈ పురాణం, పురాణ పురుషుడైన శ్రీమన్నారాయణుడి పృష్ఠ భాగంగా వర్ణించబడింది. ఈ పురాణంలో మొత్తం 17వేల శ్లోకాలున్నాయి. పూర్వార్ధం ఉత్తరార్ధాలుగా ఈ పురాణం విభాగించబడింది. పూర్వార్ధంలో 53 అధ్యాయాలు ఉండగా ఉత్తరార్ధంలో 44 అధ్యాయాలున్నాయి. కూర్మరూపంలో ఉన్న మహావిష్ణువు ఇంద్రుడి సమక్షంలో మహర్షులందరికీ ఉపదేశించిన పురాణం ఇది.

లక్ష్మీ కల్పంలో ఈ కూర్మ పురాణం 24,000 శ్లోకాలతో ఉండేది. నారద పురాణం ప్రాచీన కూర్మ పురాణం గురించి చెబుతూ - ఇందులో 1.బ్రాహ్మీ సంహిత 2.భాగవతీ సంహిత 3.సౌర సంహిత 4.వైష్ణవీ సంహిత అని నాలుగు విభాగాలున్నాయి. మొత్తం ఈ సంహితల్లో ఉన్న శ్లోకాల సంఖ్య పదిహేడువేలు. అయితే ప్రస్తుతం ఈ పురాణంలోని మొదటి బ్రాహ్మీ సంహిత తప్ప మిగిలిన సంహితలు దొరకటం లేదు.

## శ్రీ కూర్మ మహాపురాణంలో చెప్పిన విషయాలు

**పూర్వార్ధం 1-25 అధ్యాయాలు :** వీటిలో ఇంద్రద్యుమ్నుడి మోక్షప్రాప్తి, వర్ణాశ్రమ విశేషాలు, వర్ణాశ్రమ క్రమం, ప్రాకృతసర్గ, పృథివి ఉద్ధారం, సృష్టి విశేషాలు, ముఖ్యాదిసర్గ కథనం, పద్మోద్భవుడి ప్రాదుర్భావం, రుద్రసృష్టి, దేవీ అవతారాలు, దేవీ మాహాత్మ్యం, దక్షకన్యాఖ్యాతి, రాజవంశాను కీర్తనం, దక్షయజ్ఞ

విధ్వంసం, దక్షకన్యా వంశకథనం, త్రివిక్రముడి చరిత్ర, వంశాను కీర్తనం, ఋషివంశం వర్ణన, రాజవంశాల వివరాలు, ఇక్ష్వాకు వంశ చరిత్ర, సోమవంశ చరిత్ర, యదువంశ చరిత్ర, యదువంశంలో శ్రీకృష్ణుడి కీర్తి ప్రతిష్ఠలు లాంటి విషయాలు వర్ణించబడ్డాయి

**26-53 అధ్యాయాలు :** వీటిలో శంకరుడి కీర్తి వర్ణన, రాజవంశానుకీర్తనం, పార్థుడికి వ్యాసదర్శనం కలగటం, యుగవంశానుకీర్తనం, యుగధర్మ నిరూపణం, వారణాసి క్షేత్రమాహాత్మ్యం, ప్రయాగ క్షేత్రమాహాత్మ్యం, భువనవిన్యాసం, జ్యోతిస్సన్నివేశ వర్ణన, భువనకోశ వర్ణన, పర్వతాల సంఖ్య, జంబూద్వీప వర్ణన, విష్ణు మాహాత్మ్యం, వేద శాఖలు, మన్వంతరాలు వంటి విషయాలు వివరంగా చెప్పబడ్డాయి.

**ఉత్తరార్థం 1-25 అధ్యాయాలు :** వీటిలో ఈశ్వరగీత, ఋషి-వ్యాస సంవాదం, ఈశ్వర-ఋషి సంవాదం, వ్యాసమహర్షి చేసిన ధర్మోపదేశాలు, వేదజ్ఞానం ప్రాప్తించే విధానం, విప్రుల ధర్మాధ్యాయం, బ్రాహ్మణులు ఆచరించాల్సిన నిత్యకర్మలు, శ్రాద్ధ కల్పం, శ్రాద్ధానికి యోగ్యత, అయోగ్యత వివరణ, శ్రాద్ధధర్మ విశేషాలు, గృహస్థుల శ్రాద్ధ నియమాలు, బ్రాహ్మణ ధర్మాలు, గృహస్థులు ఆచరించాల్సిన ధర్మాలు వంటి విశేషాలు వివరించబడ్డాయి.

**26-44 అధ్యాయాలు :** వీటిలో దానం చేసేడప్పుడు పాటించాల్సిన నియమాలు, వానప్రస్థులు ఆచరించాల్సిన ధర్మాలు, సన్న్యాసి పాటించాల్సిన ధర్మాలు, వివిధ రకాల ప్రాయశ్చిత్త విధానాలు, కపాలమోచన తీర్థ మహిమ, పుణ్యతీర్థాలు-వాటి ప్రాశస్త్యం, ప్రళయ వర్ణన లాంటి ఎన్నో విషయాలు సవివరంగా చెప్పబడ్డాయి.

## ఇంద్రద్యుమ్నుడికి మోక్షప్రాప్తి

పూర్వం దితి కుమారులైన దానవులతో కలిసి దేవతలు అమృతాన్ని సాధించటం కోసం, మందర పర్వతాన్ని కవ్వంగా చేసి, క్షీరసముద్రాన్ని మథించారు. అలా వారు మథనం చేస్తుండగా మందర పర్వతం బరువు

ఆగలేక నీటి అడుగుకి చేరిపోయింది. అప్పుడు శ్రీహరి కూర్మావతారాన్ని ధరించి తిరిగి ఆ మందర పర్వతాన్ని పైకి లేపాడు.

ఆ విధంగా తమకి ఎంతో సాయం చేసిన శ్రీహరిని నారదాది మహర్షులు, దేవతలు కలిసి ఘనంగా స్తుతించారు. సాగర మథనం తిరిగి కొనసాగుతుండగా సముద్రం నుంచి లక్ష్మీదేవి ఆవిర్భవించింది. జగదేక సౌందర్యవతి, ఐశ్వర్యప్రదాయిన అయిన లక్ష్మీదేవిని శ్రీహరి స్వీకరించాడు. కోటి సూర్యుల తేజస్సుతో వెలిగిపోతున్న లక్ష్మీనాథుణ్ణి చూసి దేవతలంతా మోహించారు. “స్వామీ! శ్రీమన్నారాయణుడా! నీవు స్వీకరించిన ఈ దివ్యసుందరి ఎవరు?” అని ప్రశ్నించారు. వారి మాటలు విన్న శ్రీహరి చిరునవ్వుతో ఒక్కసారి లక్ష్మీదేవిని  చూసి

**లక్ష్మీ స్వరూపం :** దేవతలారా! ఈమె గొప్ప శక్తి స్వరూపిణి. నాతో సమానమైనది. పరబ్రహ్మ రూపిణి. మాయాస్వరూపిణి. ఆద్యంతాలు లేనిది. ఈ దేవి నాకు అత్యంత ప్రీతి పాత్రురాలు. ఈ దేవి వల్లే నేను సమస్త ప్రపంచాన్నీ మోహింపచేయగలుగుతున్నాను. ఈ చరాచర సృష్టినంతా నాలో లీనం చేసుకుని తిరిగి సృష్టిస్తున్నాను. ఆత్మ స్వరూపాన్ని తెలుసుకున్నవారు మాత్రమే ఈ మాయను దాటగలరు. ఈ దేవి అంశని స్వీకరించటం వల్లనే, బ్రహ్మరుద్రాది దేవతలు శక్తివంతులయ్యారు. ఈ దేవి నా సకల శక్తి స్వరూపిణి. ఈ లక్ష్మీదేవి సమస్త లోకాలకీ కారణభూతురాలు. సత్త్వరజస్తమో రూపాలనే త్రిగుణస్వరూపిణి ఈ దేవి. ప్రకృతి రూపిణి, కమలనివాసిని అయిన ఈ లక్ష్మీదేవి నాకన్నా ముందు కల్పంలోనే ప్రభవించింది. ఈ దేవి నాలుగు భుజాలు కలిగింది. శంఖ, చక్ర పద్మాలని చేతుల్లో ధరించి, పుష్పహారాన్ని మెడలో అలంకరించుకుని, కోటిసూర్యుల తేజస్సుతో వెలుగొందేది. ప్రపంచంలోని సమస్త ప్రాణుల్నీ మోహింపచేసే శక్తి ఈ దేవి సొంతం. ఈ లక్ష్మీదేవి మాయని అతిక్రమించటం దేవ దానవ మానవుల వల్ల కాదు”అని లక్ష్మీదేవి స్వరూపాన్ని దేవతలందరికీ వివరించాడు  శ్రీహరి.

శ్రీమహాలక్ష్మి వైభవాన్ని తెలుసుకున్న దేవతలు ఎంతో ఆనందించి శ్రీహరితో "ప్రభూ! మాకు కాలాంతరంలో జరిగిన ఇంద్రద్యుమ్నుడి చరిత్ర గురించి చెప్పు" అని వినయంగా కోరారు. శ్రీహరి వారికి ఇంద్రద్యుమ్నుడి చరిత్రని ఇలా చెప్పటం ప్రారంభించాడు.

దేవతలారా! పూర్వం ఇంద్రద్యుమ్నుడు అనే ఒక విప్రోత్తముడుండేవాడు. అంతకు ముందు జన్మలో అతడు ఒక రాజుగా ఉండేవాడు. అప్పుడు నేను కూర్మావతారాన్ని ధరించి ఉన్నాను. ఆ రాజు నా దగ్గరకి వచ్చి దివ్యస్తుతులతో నన్ను మెప్పించి, నా ద్వారా పురాణాలకి సంబంధించిన దివ్యగాధల్ని మునులతో సహా విన్నాడు. ఆనాడు సృష్టికర్త బ్రహ్మ, రుద్రాది దేవతలు సైతం తమ తమ అధికారాలతో సహా నా ఆధీనంలో ఉండటం చూసి, నేనే పరమదైవమని గుర్తించి నన్ను శరణు వేడుకున్నాడు.

ఆ రాజు భక్తి ప్రపత్తులకి సంతోషించిన నేను అతడితో, "రాజా! రాబోయే జన్మలో నీవు ఉన్నతమైన విప్రకులంలో జన్మిస్తావు. ఇంద్రద్యుమ్నుడనే పేరుతో విఖ్యాతి చెందే నీవు, పూర్వజన్మ స్మృతిని కూడా కలిగి ఉంటావు. సకలదేవతలకీ కూడా తెలియనిది, ఎంతో రహస్యమైనది అయిన దివ్యజ్ఞానాన్ని నీకు అందిస్తాను. ఆ జ్ఞానాన్ని నీవు పొందటం వల్ల సకల శుభాలూ కలుగుతాయి. ఎంతోకాలం నీవు జీవించి ఈ వైవస్వత మన్వంతరం కాగానే తిరిగి నన్ను చేరుకుంటావు" అని వరాన్నిచ్చాను. నా వరం ప్రకారం ఆ రాజు ఎన్నో భోగాలనుభవించి, శరీర పతనానంతరం నేను చెప్పినట్టుగా తిరిగి విప్రుల కులంలో జన్మించాడు.

విప్రజన్మనెత్తిన ఇంద్రద్యుమ్నుడు పూర్వ జన్మవాసనాప్రభావంతో, వాసుదేవ మూర్తినైన నన్నే పరమదైవంగా భావిస్తూ, పరబ్రహ్మగా సంభావిస్తూ, ఉపవాస నియమాలతో ఎంతో భక్తిగా నన్ను సేవించాడు. కొంతకాలానికి ఆ ఇంద్రద్యుమ్నుడికి నన్ను ఆశ్రయించి ఉన్న దివ్యకళ (మాయారూపిణి)తన అపూర్వమైన రూపాన్ని చూపించింది.

ఇంద్రద్యుమ్నుడు ఆ దివ్యరూపిణికి నమస్కరించి, అమ్మా నీవెవరు? నీ యధార్థ స్వరూపాన్ని నాకు తెలియచేయి తల్లీ! అని ప్రార్థించాడు. అప్పుడా

దేవి "నాయనా! నేను నారాయణుడికి ప్రీతపాత్రమైన మాయాస్వరూపిణిని, నన్ను దేవతలు, మునులు ఎవరూ చూడలేరు. నాకు నారాయణుడికి భేదం లేదు. నీవు పూజించే శ్రీహరే పరబ్రహ్మ. పరమేశ్వరుడు కూడా. సకల జీవులకీ ఆధారభూతుడైన శ్రీమన్నారాయణుణ్ణి జ్ఞాన మార్గంతోకానీ, యోగమార్గంతో కానీ, కర్మమార్గంతో కానీ ఎవరు పూజిస్తారో వారిని నేను ఏమీ చేయను.

ఓ ఇంద్రద్యుమ్నా! నీవు కర్మయోగాన్ని శ్రద్ధగా అవలంబించు. తరువాత జ్ఞానమార్గంలో ప్రవేశించి ఆది మధ్యాంతరహితుడైన శ్రీహరిని అర్చించు. తద్వారా నీవు మోక్షాన్ని పొందుతావు" అని పలికింది. దేవి మాటలు విన్న ఇంద్రద్యుమ్నుడు ఎంతో ఆనందించి అమ్మా! దయచేసి నాకు "భగవంతుడు, ఈశ్వరుడు, శాశ్వతుడు, సనాతనుడు అయిన శ్రీహరిని సులభంగా తెలుసుకునే మార్గాన్ని బోధించు" అని వినయంగా అడిగాడు. లక్ష్మీదేవి (మాయారూపిణి) చిరునవ్వుతో "నాయనా! నీకు స్వయంగా నారాయణుడే దివ్యజ్ఞానాన్ని ప్రసాదిస్తాడు అని చెప్పి ఇంద్రద్యుమ్నుణ్ణి ఒక్కసారి తాకి ఆశీర్వదించి అంతర్ధానమయ్యింది.

దేవీ సాక్షాత్కారాన్ని పొందిన ఇంద్రద్యుమ్నుడు గొప్పదైన ధ్యానయోగం ద్వారా నారాయణుడనైన నా దర్శనంకోసం ఎంతోకాలం తపస్సుచేసాడు. ఒక శుభముహూర్తంలో నేనతడికి ప్రత్యక్షమయ్యాను. ఇంద్రద్యుమ్నుడు నా దివ్యమంగళాకారాన్ని చూసి తన్మయత్వంతో పరిపరివిధాలుగా ఇలా నన్ను కీర్తించాడు.

## ఇంద్రద్యుమ్నుడు చేసిన విష్ణుస్తుతి

యజ్ఞేశాచ్యుత గోవింద మాధవానన్త కేశవ ।
కృష్ణ విష్ణో హృషీకేశ తుభ్యం విశ్వాత్మనే నమః ॥ 1
నమోఽస్తుతే పురాణాయ హరయే విశ్వమూర్తయే ।
సర్గస్థితి వినాశానాం హేతవేఽనన్తశక్తయే ॥ 2
నిర్గుణాయ నమస్తుభ్యం నిష్కలాయ నమోనమః।
పురుషాయ నమస్తేఽస్తు విశ్వరూపాయ తే నమః ॥ 3

నమస్తే వాసుదేవాయ విష్ణవే విశ్వయోనయే ।
ఆదిమధ్యాన్తహీనాయ జ్ఞానగమ్యాయ తే నమః ॥ 4

నమస్తే నిర్వికారాయ నిష్ప్రపఞ్చాయ తే నమః ।
భేదాభేద విహీనాయ నమోఽస్త్వానన్దరూపిణే ॥ 5

నమ స్తారాయ శాన్తాయ నమోఽప్రతిహతాత్మనే ।
అనన్తమూర్తయే తుభ్యమమూర్తాయ నమోనమః ॥ 6

నమస్తే పరమార్థాయ మాయాతీతాయ తే నమః ।
నమస్తే పరమేశాయ బ్రహ్మణే పరమాత్మనే ॥ 7

నమోఽస్తుతే సుసూక్ష్మాయ మహాదేవాయ తే నమః ।
నమః శివాయ శుద్ధాయ నమస్తే పరమేష్ఠినే ॥ 8

త్వయైతత్సృష్ట మఖిలం త్వమేవ పరమాగతిః ।
త్వం పితా సర్వభూతానాం త్వం మాతా పురుషోత్తమ ॥ 9

త్వమక్షరం పరం ధామ చిన్మాత్రం వ్యోమ నిష్కలమ్ ।
సర్వస్యాధార మవ్యక్త మనన్తం తమసః పరమ్ ॥ 10

ప్రపశ్యన్తి పరాత్మానం జ్ఞానదీపేన కేవలమ్ ।
ప్రపద్యే భవతో రూపం తద్విష్ణోః పరమం పదమ్ ॥ 11

*(శ్లో॥69-79,అధ్యా-1)*

దేవతలారా! ఈ విధంగా నన్ను కీర్తించిన అతడి భక్తి ప్రపత్తులకి మెచ్చి నా చేతులతో అతన్ని స్పృశించాను. నా స్పర్శ తగిలిన వెంటనే ఇంద్రద్యుమ్నుడు యథార్థమైన పరబ్రహ్మతత్త్వాన్ని తెలుసుకున్నాడు. దానితో సంతోషించిన అతడు నాతో "స్వామీ! తమరి అనుగ్రహంతో నాకు సత్యం బోధపడింది. సందేహాలన్నీ తొలగిపోయాయి. నీకు అభివందనాలు. నేనేం చేయాలో కాస్త తెలియచేయి ప్రభూ" అని వేడుకున్నాడు.

ఇంద్రద్యుమ్నా! భగవంతుడు ఎప్పుడూ భక్తి జ్ఞాన యోగాల ద్వారా సులభంగా లభిస్తాడు. ఈ పరతత్త్వాన్ని గ్రహించు. ఈ లోకం మొత్తం మాయతో

నిండివుందని తెలుసుకుని ప్రపంచంతో సంబంధ బాంధవ్యాల్ని తెంచుకుని, జీవాత్మకి పరమాత్మకి ఉన్న అభేదాన్ని గ్రహించు. అప్పుడే నీకు పరమేశ్వర సాక్షాత్కారం లభిస్తుంది. పరతత్త్వాన్ని తెలుసుకుంటేనే మోక్షం కలుగుతుంది" అని ప్రబోధించాను. అంతా విన్న ఇంద్రద్యుమ్నుడు తిరిగి నాతో "ప్రభూ! పరతత్త్వం అంటే ఏది? దానికి కారణం ఏది? నీవు ఎవరు? నీ ప్రవృత్తి ఎలాంటిది? అని ప్రశ్నించాడు.

ఇంద్రద్యుమ్నా! పరం కన్నా గొప్పదైన తత్త్వాన్నే పరతత్త్వం అంటారు. ఇది ఏకమైనది. నాశనరహితమైనది. పరబ్రహ్మస్వరూపమే పరతత్త్వం. అంటే శాశ్వతంగా ఆనందమయమైన దివ్య తేజస్సుతో, అంధకారానికి దూరమైనది ఆ పరతత్త్వం. ఆ పరతత్త్వానికి సంబంధించిన నిత్యమైన ఐశ్వర్యాన్నే 'విభూతి' అంటారు.

ఇంద్రద్యుమ్నా! సృష్టి స్థితి లయాలు నిర్వహించటమే పరబ్రహ్మనైన నా ప్రవృత్తి. ఈ విషయాన్ని మొత్తం ఒక క్రమపద్ధతిలో తెలుసుకుని నీవు కర్మయోగాన్ని శ్రద్ధగా ఆచరిస్తూ శాశ్వతుడైన పరమపురుషుణ్ణి పూజించు" అని ప్రబోధించాను.

"నారాయణా! పరమపురుషుణ్ణి ఆరాధించే ఆచారాలు ఎలా వుంటాయి? వర్ణాశ్రమ ధర్మాలు ఏవి? ఈ విశ్వం పూర్వం ఎలా ఆవిర్భవించింది? తిరిగి ఎలా లయం చేయబడుతోంది? లోకంలో ఎన్ని మన్వంతరాలున్నాయి? పవిత్రమైన వ్రతాలు, పుణ్యతీర్థాలు, జ్యోతిర్మండలాలు, వాటి స్వరూపం, ద్వీపాలు, సముద్రాల సంఖ్య, పర్వతాలు, నదీ నదాలు వీటి విశేషాలన్నీ చెప్పు" అని నన్ను ప్రార్థించాడు.

మునులారా! దేవతలారా! ఇంద్రద్యుమ్నుడు కోరిన విధంగా, అన్ని విషయాలనీ అతడికి ఈ పురాణంలో బోధించాను. అతడు కూడా నేను చెప్పిన విధానాన్ని అనుసరించి పరిశుద్ధమైన మనసుతో భార్యా పుత్రుల మీద మమకారాన్ని విడిచిపెట్టి పరబ్రహ్మనైన నన్ను త్రికరణ శుద్ధిగా ఆరాధించాడు.

తనలో ఉన్న పరమాత్మని ఈ జగత్తులో కూడా దర్శిస్తూ, నాశనరహితమైన బ్రాహ్మీ భావన పొందాడు. అంతేకాదు శ్వాసని జయించినవారు నిద్రారహితులైన మోక్షకాములు ఎలాంటి స్థితిని పొందుతారో, అతడు కూడా అలాంటి స్థితినే పొందాడు.

ఒకనాడా ఇంద్రద్యుమ్నుడు నాశనరహితమైన పరబ్రహ్మని ప్రత్యక్షంగా దర్శించాలని భావించాడు. వెంటనే తన యోగ శక్తితో ఆకాశమార్గంలో ప్రయాణించి మానసోత్తర పర్వతం దగ్గరకి చేరుకున్నాడు. సూర్యుడిలా ప్రకాశిస్తూ ఆకాశంలో ప్రయాణిస్తున్న ఆ యోగీంద్రుణ్ణి దర్శించాలని దేవతలు, గంధర్వులు, మునులు, అప్సరసలు ఎంతో తపన పడ్డారు. అలా వారంతా ఇంద్రద్యుమ్నుణ్ణి చూడాలని వెంట వస్తుండగా, అతడు సకల యోగులతో సేవించబడుతూ పదివేల సూర్యుల కాంతితో వెలుగొందుతున్న పరమ పురుష స్థానాన్ని పొందాడు. దేవతలకి కూడా ప్రవేశించ శక్యంకాని దివ్యభవనంలోకి ప్రవేశించి, సకల ప్రాణులకీ శరణ్యుడైన పరబ్రహ్మని ధ్యానించాడు.

ఆ విధంగా నాశనరహితుడైన పరబ్రహ్మని ధ్యానించగానే ఇంద్రద్యుమ్నుడి ఎదుట ఆశ్చర్యకరంగా ఒక దివ్యతేజో మండలం ఆవిర్భవించింది. ఆ మండలంలో తేజోమయుడైన ఒక పురుషుణ్ణి అతడు దర్శించాడు. నాలుగు ముఖాలతో దివ్యంగా ప్రకాశిస్తున్న ఆ పరమపురుషుణ్ణి చూసి నమస్కరించి సమీపిస్తుండగా ఆ పురుషుడే వచ్చి ఇంద్రద్యుమ్నుణ్ణి ప్రేమగా ఆలింగనం చేసుకున్నాడు.

పరమపురుషుడు ఆలింగనం చేసుకోగానే ఇంద్రద్యుమ్నుడి శరీరం నుంచి వెన్నెల వెలుగులు విరజిమ్ముతూ ఒక దివ్యతేజస్సు బైటికి వచ్చి సరాసరి అది వెళ్ళి సూర్యమండలంలోకి ప్రవేశించింది. ఆ విధంగా ఇంద్రద్యుమ్నుడు మోక్షం అనే పేరుతో వ్యవహరించే నాశనరహితమైన ఆత్మస్థానాన్ని పొందాడు.

దేవతలారా! ఇంద్రద్యుమ్నుడిలాగా, పరబ్రహ్మనైన నా దివ్యతత్త్వాన్ని తెలుసుకున్న వాడే, లక్ష్మీరూపంలో ఉన్న మాయనుంచి తప్పించుకోగలరు. కనుక మీరంతా యథార్థ జ్ఞానాన్ని తెలుసుకోండి" అని దేవతలకి ఇంద్రద్యుమ్నుడి వృత్తాంతాన్ని మహాలక్ష్మీ దేవి మాయా ప్రభావాన్ని వివరించాడు శ్రీహరి.

నారదాది మునులు దేవతలూ ఇంద్రుడితో సహా అందరూ కలిసి "దేవదేవా! నారాయణా! మాదొక కోరిక. నీవు పూర్వం ఇంద్రద్యుమ్నుడు అడిగిన విషయాలన్నీ ప్రబోధించానని చెప్పావు కదా. మాకు కూడా ఆ విషయాలన్నీ సవివరంగా తెలుసుకోవాలనుంది.దయచేసి చెప్పు" అని ప్రార్థించగా, కూర్మ రూపధారి అయిన శ్రీహరి ఇంద్రాది దేవతలందరికీ పూర్వం ఇంద్రద్యుమ్నుడికి చెప్పిన పురాణ విశేషాలన్నిటినీ తిరిగి ప్రబోధించాడు. కూర్మ రూపంలో శ్రీహరి బోధించిన కారణంగానే ఈ పురాణానికి కూర్మ పురాణం అనే పేరు వచ్చింది.

## భూమిని ఉద్ధరించటం

పూర్వం ఈ భూమండలమంతా ఒకే సముద్రంగా ఎలాంటి విభాగాలు లేకుండా, అంధకారంతో నిండిపోయింది. ఏ జీవీ ప్రాణంతో లేదు. సూర్యచంద్ర వాయువులు కూడా నశించిపోయాయి. స్థావర జంగమాలన్నీ ప్రళయంలో పూర్తిగా నాశనమైపోయాయి. ఆ సమయంలో వేయికళ్ళతో వేయి పాదాలతో బ్రహ్మదేవుడు ఆవిర్భవించాడు. అక్కడే వేయి శిరస్సులతో బంగారు రంగు శరీరంతో నారాయణుడు అనే పేరు గల పరబ్రహ్మ ఆ సముద్ర జలాలమీద శయనించి ఉన్నాడు. నారములు అంటే నీరు. ఆ నీటిని ఆశ్రయించి ఉన్నవాడు కాబట్టి ఆయనకి నారాయణుడనే పేరు వచ్చింది.

వేయి యుగాలకు సమానమైన 'రాత్రి' గడిచిన తరువాత భగవంతుడు తిరిగి సృష్టిని కొనసాగించటానికి బ్రహ్మగా అవతరిస్తాడు. అలా అవతరించిన బ్రహ్మ సృష్టి చేద్దామని భావించగా అందుకు అవసరమైన భూమి సముద్రంలో మునిగిపోయి వుంది. దాన్ని ఎలాగైనా పైకి తేవాలనుకున్న ప్రజాపతి, నీటిలో సైతం సంచరించగలిగే మనోహరమైన వరాహరూపాన్ని ధరించమని నారాయణుణ్ణి కోరాడు. అప్పుడు నారాయణుడు భూమిని ఉద్ధరించటానికి వరాహరూపాన్ని ధరించి సముద్రంలోకి ప్రవేశించి తన బలమైన కోరలతో భూమిని పైకి తెచ్చాడు. ఆ విధంగా వరాహ పురుషుడి కోరమీదున్న భూమిని చూసి దేవతలు, సిద్ధులు, మహర్షులు గొప్ప పరాక్రమాన్ని ప్రదర్శించిన శ్రీహరిని ఘనంగా ఇలా ప్రశంసించారు.

నమోఽస్త్వానన్దరూపాయ సాక్షిణే జగతాం నమః ।
అనన్తాయా ప్రమేయాయ కార్యాయ కరణాయ చ ॥ 1

నమస్తే పఞ్చభూతాయ పఞ్చభూతాత్మనే నమః ।
నమో మూలప్రకృతయే మాయారూపాయ తే నమః ॥ 2

నమోఽస్తుతే వరాహాయ నమస్తే మత్స్యరూపిణే ।
నమో యోగాధిగమ్యాయ నమః సంకర్షణాయ తే ॥ 3

నమ స్త్రిమూర్తయే తుభ్యం త్రిధామ్నే దివ్యతేజసే ।
నమః సిద్ధాయ పూజ్యాయ గుణత్రయవిభాగినే ॥ 4

నమోఽస్త్వాదిత్యరూపాయ నమస్తే పద్మయోనయే ।
నమోఽమూర్తాయ మూర్తాయ మాధవాయ నమోనమః॥ 5

త్వయైవ సృష్ట మఖిలం త్వయ్యేవ సకలం స్థితమ్ ।
పాలయైత జ్జగత్సర్వం త్రాతా త్వం శరణం గతిః ॥ 6

*(శ్లో॥16-21,అధ్యా-6)*

“దేవా! నీవు పంచ భూతాత్మకుడివి. మూల ప్రకృతి స్వరూపుడివి, మాయా స్వరూపుడివి అయిన నీకు నమస్కారం. వరాహమత్స్య రూపాలు ధరించిన నీకు నమస్కారం. నీవే రక్షకుడివి. మా అందరికీ నీవే దిక్కు.” ఈ విధంగా అందరి చేతా స్తుతించబడ్డ ఆదివరాహమూర్తి అందర్నీ అనుగ్రహించాడు.

అంతలో అనంతమైన ఆ జలరాశి పై భాగంలో భూమి ఒక పెద్ద నావలాగా లేచి నిలుచుంది. ఎంతో విశాలంగా ఎత్తు పల్లాలతో అస్తవ్యస్తంగా ఉన్న భూమిని వరాహమూర్తి తన దివ్యశక్తితో సమంచేసి దానిమీద తిరిగి పర్వతాలు స్థిరంగా నెలకొనేలా చేసాడు. అప్పుడు బ్రహ్మ తన పూర్వకల్పంలో చేసిన విధంగానే సృష్టి చేయటం ప్రారంభించాడు.

# రుద్ర సృష్టి

పూర్వం అనంతజలరాశిలో శ్రీహరి హాయిగా నిద్రపోతున్నాడు. ఆయన నాభికమలం నుంచి ఆవిర్భవించిన బ్రహ్మ కూడా విశ్రాంతిగా ఉన్నాడు. ఆ సమయంలో నిద్రపోతున్న శ్రీహరి చెవిలోని మలం నుంచి మధు-కైటభుడు అనే ఇద్దరు రాక్షసులు ఆవిర్భవించారు. పెద్ద పర్వతంలాంటి శరీరంతో, బలగర్వితులైన వారిద్దరూ బ్రహ్మ దగ్గరకొచ్చి తమతో యుద్ధం చేయమన్నారు. వారి మాటలు వినగానే, వారి ఆకారాల్ని చూడగానే బ్రహ్మదేవుడికి భయం వేసింది. వెంటనే శ్రీహరిని నిద్రలేపి ఓ విష్ణూ! వీరెవరో అసురుల్లా ఉన్నారు. నా మీదకి వస్తున్నారు. వీరిని సంహరించి నాకు రక్షణ కల్పించు అని కోరాడు.

బ్రహ్మ మాటలు వినగానే నారాయణుడు తన దివ్యశరీరం నుంచి ఇద్దరు పురుషుల్ని ఆవిర్భవింపచేసాడు. వారిద్దర్నీ ఆ రాక్షసుల్ని వధించి రండని ఆజ్ఞాపించాడు. శ్రీహరి ఆజ్ఞతో ఆ పురుషులిద్దరూ మధు కైటభులతో తలపడ్డారు. కొంతకాలం వారిమధ్య యుద్ధం కొనసాగింది. చివరికి మధువు అనే రాక్షసుణ్ణి విష్ణువు, కైటభుడనే అసురుణ్ణి జిష్ణువు జయించారు. తిరిగి వారిద్దరూ శ్రీమన్నారాయణుడిలో లీనమైపోయారు.

కొంతకాలం గడిచాక శ్రీహరి తన నాభికమలంలో ఉన్న బ్రహ్మతో, “దేవా! నేను నిన్ను భరించలేకపోతున్నాను. దయచేసి పద్మం నుంచి క్రిందకి దిగు” అని ప్రార్థించాడు. విష్ణువు కోరిక ప్రకారం బ్రహ్మ పద్మం నుంచి క్రిందికి దిగి, ఆ విష్ణువు శరీరంలోకే ప్రవేశించి ఆయనతో ఆభేదాన్ని పొంది విష్ణు కల్పితమైన నిద్రని పొందాడు. బ్రహ్మ ఆ విధంగా నారాయణ్ణి ఆవేశించాడు.

అలా చాలాకాలం నారాయణుడిలో వున్న బ్రహ్మ అక్కడ ఆత్మానందాన్ని అనుభవించి, రాత్రికాలం అంతా గడిపాడు. తిరిగి ప్రాతఃకాలం ప్రారంభం కాగానే యోగరూపంతో చతుర్ముఖ బ్రహ్మగా ఆవిర్భవించి, వైష్ణవ భావంతో తన సృష్టిని కొనసాగించాడు.

బ్రహ్మ మొదటిగా తన మనుసు నుంచి సనందుణ్ణి–సనకుణ్ణి సృష్టించాడు. తరువాత ఋభుణ్ణి సనత్కుమారుణ్ణి, సనాతనులైన పూర్వ పురుషులుగా సృష్టించాడు. వారంతా వైరాగ్య భావంతో జ్ఞానమార్గాన్ని ఆశ్రయించారు. తన పుత్రులు అలా వైరాగ్య భావంతో సృష్టిని కొనసాగించ లేకపోటంతో ఆయనకి కూడా వైరాగ్య భావం కలిగింది. ఆ ప్రభావంతో ఎలాంటి సృష్టీ చేయకుండా ఉండిపోయాడు. అది గమనించిన శ్రీహరి ఆయన దగ్గరకొచ్చి ఇలా అన్నాడు.

కుమారా! త్రిశూలాన్ని చేతిలో ధరించిన సనాతనుడు, పరమేశ్వరుణ్ణి నీవు మర్చిపోయావా! పూర్వం శంకరుడు నిన్ను పుత్ర భావాన్ని పొందమని చెప్పాడు. జ్ఞాపకం రాలేదా! అని అనగానే బ్రహ్మకి జ్ఞానోదయమైంది – వెంటనే శివుణ్ణి తన పుత్రుడిగా అవతరించమని ప్రార్థించాడు. ఫలితం లభించలేదు. ఎలాగైనా శంకరుణ్ణి పుత్రుడిగా పొందాలని, కఠోరంగా తపస్సు చేయటం ప్రారంభించాడు. అలా చాలాకాలం ఆయన తపస్సు కొనసాగింది. శివుడు ప్రత్యక్షం కాలేదు. దాంతో బ్రహ్మకి ఒక్కసారిగా ఆగ్రహం కలిగింది. కోపంతో ఆయన కళ్ళు ఎరుపెక్కాయి. ఒక్కసారిగా ఆ కళ్ళనుంచి అశ్రువులు కారి నేలమీద పడ్డాయి. అలా బ్రహ్మ కంటి నుంచి కారిన నీటి బిందువుల నుంచి వేలాదిగా భూతప్రేతాలు ఆవిర్భవించాయి. వాటన్నిటినీ చూసాక బ్రహ్మదేవుడికి ఒక్కసారిగా తన స్వ స్వరూపం గుర్తుకు వచ్చింది.

**రుద్రుడి అష్టమూర్తులు :** బ్రహ్మచేసిన తపస్సుకి కరుణించిన శివుడు ఆయనకి రుద్రుడుగా జన్మించి, ఎనిమిది రూపాలు ధరించాడు. వారి నామాలు 1.రుద్రుడు 2.భవుడు 3.శర్వుడు 4.ఈశానుడు 5.పశుపతి 6.భీముడు 7.ఉగ్రుడు 8.మహాదేవుడు వారి అష్టమూర్తులు 1.సూర్యుడు 2.జలం 3.భూమి 4.అగ్ని 5.వాయువు 6.ఆకాశం 7.యజ్ఞదీక్షితుడైన బ్రాహ్మణుడు 8.చంద్రుడు వీరే రుద్రుడి అవతారాలు. ఈ ఎనిమిది మందికీ ఎవరు భక్తిగా నమస్కరిస్తారో వారికి శివానుగ్రహం లభిస్తుంది.

రుద్రుడి అష్టమూర్తులకీ వరుసగా 1.సువర్చల 2.ఉమ 3.వికేశి 4.స్వాహా 5.శివ 6.దిక్కులు 7.దీక్ష 8.రోహిణి అనే వారు భార్యలుగా కల్పించబడ్డారు. ఈ అష్టమూర్తులకీ కుమారులుగా 1.సూర్యుడికి–శనైశ్చరుడు 2.జలానికి – శుక్రుడు 3.భూమికి–లోహితాంగుడు 4.అగ్నికి – స్కందుడు 5.వాయువుకి – మనోజవుడు 6.ఆకాశానికి – సర్గుడు 7.దీక్షితుడికి – సంతానుడు 8. చంద్రుడికి – బుధుడు పుత్రులుగా జన్మించారు.

తరువాత రుద్రుడు సృష్టిధర్మమైన కామాన్ని కూడా విడిచిపెట్టి వైరాగ్య భావంతో వుండగా బ్రహ్మదేవుడు ఆయన దగ్గరకొచ్చి సృష్టిని కొనసాగించమని కోరాడు. బ్రహ్మ కోరిక ప్రకారం నీలలోహితుడైన ఆ రుద్రుడు ప్రజల్ని సృష్టించాలని సంకల్పించాడు.వెంటనే తనతో సమానులైన కోట్లకొద్దీ రుద్రుల్ని సృష్టించాడు. జటాజూటాలతో, కోరలతో, నల్లటి కంఠంతో, త్రిశూలాన్ని ధరించి భయంకరంగా వున్నారు వారంతా.

ఆ విధంగా నీలలోహితులుగా జరామరణాలు లేని వారుగా సృష్టించబడ్డ ఆ రుద్ర గణాల్ని చూసి బ్రహ్మకి ఆందోళన కలిగింది. రుద్రుడి దగ్గరకి వెళ్ళి "నాయనా! ఇక చేసింది చాలు, రుద్ర గణాల్ని సృష్టించటం ఆపేయ్. సృష్టించాలనుకుంటే జనన మరణాలున్న జీవుల్ని సృష్టించు" అన్నాడు. అది విని రుద్రుడు "బ్రహ్మా! అలాంటి వారిని సృష్టించటం నా వల్లకాదు. వారిని నీవే సృష్టించుకో" అని జవాబిచ్చాడు.

ఇక ఆనాటి నుంచీ రుద్రుడు శుభలక్షణాలున్న జీవుల్ని సృష్టించలేదు. తను అప్పటిదాకా సృష్టించిన పుత్రులతోనే సంతృప్తిగా ఉన్నాడు. అలా స్థాణువుగా ఉండబట్టే శివుడికి స్థాణువు అనే పేరు వచ్చింది.

స్థాణుత్వం తస్యతేనాసీ ద్దేవదేవస్య శూలినః ।
జ్ఞానం వైరాగ్య మైశ్వర్యం తపః సత్యం క్షమాధృతిః ॥ 1
ద్రష్టత్వ మాత్మసంబోధో హ్యధిష్ఠాతృత్వ మేవ చ ।
అవ్యయాని దశైతాని నిత్యం తిష్ఠంతి శంకరే ॥ 2

*(శ్లో॥40–41,అధ్యా–10)*

1.జ్ఞానం 2.వైరాగ్యం 3.ఐశ్వర్యం 4.తపస్సు 5.సత్యం 6.ఓర్పు 7.ధైర్యం 8.దర్శనస్వభావం 9.ఆత్మజ్ఞానం 10.అధిష్ఠానలక్షణం అనే నాశనరహితమైన ఈ పది లక్షణాలు శంకరుడిలో ఎప్పుడూ ఉంటాయి.

ఈ విధంగా స్థాణువుగా వున్న త్రినేత్రుణ్ణి చూసిన బ్రహ్మదేవుడు ఆయన మానసపుత్రులైన అష్టరుద్రులతో సహా సంతోషం నిండిన కళ్ళతో, సర్వోత్కృష్టమైన ఈశ్వత తత్త్వాన్ని దర్శించి, రెండు చేతులూ జోడించి ఆయనకి నమస్కరిస్తూ ఇలా స్తుతించాడు.

## బ్రహ్మ చేసిన శివస్తుతి

నమస్తేస్తు మహాదేవ నమస్తే పరమేశ్వర ।
నమః శివాయ దేవాయ నమస్తే బ్రహ్మరూపిణే ।
నమోస్తుతే మహేశాయ నమః శాన్తాయ హేతవే ॥ 1

ప్రధానపురుషేశాయ యోగాధిపతయే నమః ।
నమః కాలాయ రుద్రాయ మహాగ్రాసాయ శూలినే ॥ 2

నమః పినాక హస్తాయ త్రినేత్రాయ నమో నమః।
నమస్త్రిమూర్తయే తుభ్యం బ్రహ్మణే జనకాయతే ॥ 3

బ్రహ్మవిద్యాధిపతయే బ్రహ్మవిద్యాప్రదాయినే ।
నమో వేదరహస్యాయ కాలకాలాయతే నమః ॥ 4

వేదాన్తసారసారాయ నమోవేదాత్మమూర్తయే ।
నమో బుద్ధాయ రుద్రాయ యోగినాం గురవే నమః ॥ 5

ప్రహీణశోకైర్వివిధై ర్భూతైః పరివృతాయ తే ।
నమో బ్రహ్మణ్యదేవాయ బ్రహ్మాధిపతయే నమః ॥ 6

త్ర్యమ్బకాయాది దేవాయ నమస్తే పరమేష్ఠినే ।
నమో దిగ్వాససే తుభ్యం నమో ముణ్డాయ దణ్డినే ॥ 7

అనాది మలహీనాయ జ్ఞానగమ్యాయ తే నమః ।
నమస్తారాయ తీర్థాయ నమో యోగర్ధిహేతవే ॥ 8

నమోధర్మాదిగమ్యాయ యోగగమ్యాయ తే నమః ।
నమస్తే నిష్ప్రపంచాయ నిరాభాసాయ తే నమః ॥ 9

బ్రహ్మణే విశ్వరూపాయ నమస్తే పరమాత్మనే ।
త్వయైవ సృష్ట మఖిలం త్వయ్యేవ సకలం స్థితమ్ ॥ 10

త్వయా సంహ్రియతే విశ్వం ప్రధానాద్యం జగన్మయ ।
త్వమీశ్వరో మహాదేవః పరం బ్రహ్మ మహేశ్వరః ॥ 11

పరమేష్ఠీ శివః శాన్తః పురుషో నిష్కలో హరః ।
త్వమక్షరం పరం జ్యోతి స్త్వం కాలః పరమేశ్వరః ॥ 12

*(శ్లో॥44-56,అధ్యా-10)*

"ఓ మహాదేవా! మహేశ్వరా! నీకు నమస్కారం. బ్రహ్మ రూపుడవైన నీకు నమస్కారం. యోగాత్మకుడైన పరమేశ్వరుడికి నమస్కారం. నీవు పరమేష్ఠివి, శివుడివి, శాంతస్వరూపుడివి, భేదరహితుడివి, హరుడివి, కాలస్వరూపుడివి, నాశనరహితమైన గొప్ప తేజస్సు కలిగినవాడివి". అలాంటి నీకు నమస్కారం.

ఈ విధంగా పరమేశ్వరుణ్ణి స్తుతించగానే ఆయన సంతోషించి "బ్రహ్మ! నీవు నన్ను ఒకనాడు పుత్రుడిగా జన్మించమని కోరావు. నేను నీకు జన్మించాను. నీవు కోరినట్టే రుద్రుల్ని సృష్టించాను. ఇకపై నీవే సృష్టికార్యక్రమాన్ని కొనసాగించు. బ్రహ్మ – విష్ణువు– శివుడనే ముగ్గురూ ప్రపంచ సృష్టి – స్థితి– లయాలకి కారకులు. సృష్టించే బ్రహ్మవి నీవు – రక్షించేది విష్ణువు – లయం చేసే రుద్రుణ్ణి నేను అని గ్రహించు.

ఈ శంకరుడు ఒక్కడే అయినప్పటికీ తనని తాను విభజించుకుని త్రిమూర్తులుగా ఉన్నాడు. ఈ త్రిమూర్తుల కంటే అతీతుడుగా ఉన్న త్రిమూర్త్యాత్మక శక్తిని నేనేనని తెలుసుకో! ఓ బ్రహ్మ! నీవు నన్నెప్పుడు స్మరిస్తావో అప్పుడు నీకు ప్రత్యక్షమవుతాను" అని బ్రహ్మతో పలికి తన మానసపుత్రులతో సహా అదృశ్యమయ్యాడు రుద్రుడు.

ఆ తరువాత బ్రహ్మదేవుడు పరమపురుషుడు చెప్పిన మార్గాన్ని అనుసరించి సకల జీవరాశుల్నీ సృష్టించాడు. అలాగే పూర్వకల్పంలో సృష్టించిన విధంగానే–మరీచి, భృగువు, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు క్రతువు – దక్షుడు, అత్రి, వశిష్ఠుల్ని సృష్టించాడు.

## దేవి అవతారం

ప్రజాపతి అయిన బ్రహ్మదేవుడు మరీచ్యాది మహర్షుల్ని సృష్టించిన తరువాత, తన మానసపుత్రులందరితో కలిసి తపస్సు చేయటం ప్రారంభించాడు. అలా కొంత కాలం గడిచింది. ఒకనాడు తపస్సు చేస్తున్న బ్రహ్మ ముఖం నుంచి ప్రళయకాల అగ్నితో సమానమైనవాడు, చేతిలో త్రిశూలాన్ని ధరించినవాడు, మూడు నేత్రాలతో ప్రకాశించే ఈశానుడైన మరో రుద్రుడు ఆవిర్భవించాడు.

అలా ఆవిర్భవించిన రుద్రుడు తనని తాను స్త్రీ పురుష రూపాలుగా విభజించుకున్నాడు. విభాగించబడిన పురుషరూపాన్ని తిరిగి పదకొండు రూపాలుగా మళ్ళీ విభజించాడు. ఆ పదకొండు మందినే ఏకాదశ రుద్రులంటారు. వీరంతా ముల్లోకాలకీ ప్రభువులుగా ఆయా దేవ కార్యాలలో నియమించబడ్డారు. రుద్రుడు తను విభాగించుకున్న స్త్రీరూపాన్ని కూడా 1.సాధు 2.అసాధు 3.శాంతం 4.అశాంతం అనే లక్షణాలతో నలుపు, తెలుపు వర్ణాలతో విభిన్నంగా తిరిగి విభజించాడు. ఆ స్త్రీ రూపాలే శక్తి రూపాలుగా లక్ష్మి, గౌరి, సరస్వతి ఇత్యాది నామాలతో లోకంలో విఖ్యాతి పొందాయి.

శంకరుడి స్త్రీ తత్త్వం ఏ శరీరాన్ని పొంది ఈ ప్రపంచమంతా వ్యాపించి ఉందో అది ఐశ్వర్య ప్రదమైనది. శంకరుడి(రుద్రుడి) ద్వారా విభాగించబడ్డ మొదటి స్త్రీ తిరిగి తనని తాను విభాగించుకుని మహాదేవుడి ఆదేశంతో బ్రహ్మదేవుడి దగ్గరకొచ్చింది. అప్పుడు బ్రహ్మ ఆమెతో "దేవీ! నీవు దక్షప్రజాపతికి పుత్రికగా జన్మించు" అన్నాడు. బ్రహ్మ ఆనతి ప్రకారం ఆమె దక్షుడికి పుత్రికగా జన్మించింది.

దక్షప్రజాపతి తనకి జన్మించిన పుత్రికకి 'సతీదేవి' అని పేరు పెట్టాడు. యుక్త వయస్కురాలయ్యాక బ్రహ్మ ఆ దేశం ప్రకారం తన కుమార్తెని శంకరుడికిచ్చి వివాహం చేసాడు. ఆ సతీదేవి శంకరుడితో సంసారం చేస్తూ కొంతకాలం తరువాత బ్రహ్మదేవుడి ఆజ్ఞతో తనని తాను విభజించుకుని హిమవంతుడు భార్య మేనకకి కుమార్తెగా జన్మించింది. ఆమే పార్వతీ దేవి. హిమవంతుడి పార్వతీదేవిని, ఆమె ఇష్టప్రకారం పరమేశ్వరుడికిచ్చి వివాహం చేసాడు. సకల దేవతల మేలుకోసమే హిమవంతుడు ఆ విధంగా తన కుమార్తెని శంకరుడికిచ్చాడు. అలా శంకరుణ్ణి పతిగా పొందిన పార్వతి ఆయన శరీరంలో సగభాగాన్ని శాశ్వతంగా పొంది అర్ధనారీశ్వరిగా విఖ్యాతి చెందింది.

## దేవీ మాహాత్మ్యం

పూర్వం కూర్మ రూపాన్ని ధరించిన శ్రీహరిని దేవతలందరూ దేవీ మహాత్మ్యాన్ని వైభవాన్ని వర్ణించమని కోరగా, ఆయన వారందరికీ ఈ విధంగా దేవీ వైభవాన్ని వివరించి చెప్పాడు.

దేవీ తత్త్వానికి సంబంధించి విశేషాలు పూర్వం బ్రహ్మదేవుడు మేరుపర్వతం మీద కొందరికి బోధించాడు. ఈ విజ్ఞానం రహస్యమైంది. ఈ దేవీ తత్త్వం సాంఖ్య యోగులకి ముఖ్యమైన సాంఖ్యతత్త్వం లాంటిది. అది శ్రేష్ఠమైన బ్రహ్మ విజ్ఞానం. సంసారం అనే సముద్రంలో మునిగిపోయే నావని కాపాడే సాధనం.

పరమేశ్వర సంబంధమైన ఏ శక్తి అయితే ఉన్నదో అది జ్ఞాన రూపమైనది. ఎంతో అనురాగం కలిగింది. ఆకాశం అనే సంజ్ఞ కలిగింది. ఆమే హైమావతి అని పేర్కొనబడింది. ఈ హైమావతీదేవి శివస్వరూపిణి. అంతటా వ్యాపించింది. నాశనమన్నదే లేనిది, త్రిగుణాలకి అతీతమైనది. ఏక, అనేక రూపాలు ధరించేది. ఎన్నో కోరికలు కలిగింది. జ్ఞాన స్వరూపిణి, స్వభావసిద్ధమైనది. సూర్యుడికాంతిలా స్వచ్ఛమైనది. సాటిలేనిది, ప్రభావవంతమైనది.

ఒక్కటిగా ఉండే మహేశ్వర శక్తి ఉపాధి భేదాల వల్ల ఎన్నో రూపాల్ని ధరించి పరమేశ్వరుడి సన్నిధిలోనే 'పర–అపర' అనే రూపాలతో క్రీడిస్తూ

వుంటుంది. ఈ మహేశ్వర శక్తే అన్నిటినీ చేయిస్తుంది. ఈ ప్రపమంచమంతా ఆమె చేతే నిర్మించబడింది. అసలు ఈశ్వరుడికి కార్య భావం, కారణ భావం అనేవి లేవని చెబుతారు.

ఈ దేవికి సంబంధించిన నాలుగు శక్తులున్నాయి. ఆకారభేదాన్ని బట్టి అవి విభిన్నంగా ఉంటాయి. ఈ నాలుగు శక్తుల పేర్లు 1.శాంతి 2.విద్య 3.ప్రతిష్ఠ 4.నివృత్తి. ఈ నాలుగు రకాల శక్తులతో కూడి ఉన్నందువల్లే పరమేశ్వరుడు చతుర్వ్యూహుడుగా పిలవబడుతున్నాడు. ఈ పరాశక్తి వల్లే పరమేశ్వరుడు తనని తాను నిలుపుకుంటున్నాడు. ఇలా నాలుగు శక్తులతో నాలుగు మూర్తులు ధరించిన పరమేశ్వరుడు తన నాలుగు శక్తులతో కలిసి నాలుగు వేదాల్లో నిలిచి ఉన్నాడు. ఆ దేవి ఐశ్వర్యం అనాది కాలం నుంచీ కొనసాగుతోంది. ఆమె ఎంతో గొప్పది. ఈ దేవి సమస్త భూతాలనీ ప్రవర్తిం చేస్తుంది. సర్వేశ్వరిగా పూజించబడుతుంది.

ఈ సకల ప్రపంచం ఎవరిలో అడ్డంగా, నిలువుగా విస్తరించబడి ఉందో అతడే కాలాగ్ని హరుడు, దేవదేవుడు అని వేదవాదులు ప్రశంసిస్తారు. కాలం అనేది భూతాల్ని సృష్టిస్తుంది. అదే కాలం భూతాల్ని (ప్రజల్ని) సంహరిస్తుంది కూడా. లోకంలో అన్నీ కాలానికి ఆధీనమై అంటాయి కానీ కాలం దేనికీ ఆధీనమై ఉండదు.

కాలఃసృజతి భూతాని కాలః సంహరతి ప్రజాః ।
సర్వే కాలస్య వశగా నకాలః కస్యచి ద్వశః ॥

*(శ్లో॥17,అధ్యా-12)*

పరమపురుషుడి శక్తి లోకంలో 'మాయ' అనే పేరుతో ప్రసిద్ధి చెందింది. ఆ మాయ ఎన్నో ఆకారాలు కలిగింది. అతి పురాతనమైనదైన ఈ మాయాశక్తి పరమేశ్వరుడి విశ్వరూపాన్ని ఎప్పుడూ ప్రకాశింపచేస్తుంది. పరమేశ్వరుడికున్న మరో మూడు శక్తులు ఎంతో ముఖ్యమైనవి అవి 1.జ్ఞానశక్తి 2.క్రియాశక్తి 3.ప్రాణశక్తి. ఈ శక్తులన్నీ మాయద్వారా కల్పించబడ్డాయి. ఆ మాయకి ఆది అంతం రెండూ లేవు.

**మాయా స్వరూపం :** మాయ అనేది సమస్తశక్తుల స్వరూపం. దాన్ని వారించటానికి ఎవరికీ సాధ్యంకాదు. అది నాశనం లేనిది. సర్వ శక్తులకీ అది ప్రభువులాంటిది. కాలం మాయాస్వరూపం. ఆ కాలాన్ని సృష్టించేవాడు పరమాత్మ.

కరోతి కాలః సకలం సంహరే త్కాల ఏవహి ।
కాలః స్థాపయతే విశ్వం కాలాధీన మిదం జగత్ ॥

*(శ్లో॥24,అధ్యా-12)*

ఈ సమస్తాన్నీ కాలమే చేస్తోంది. కాలమే అన్నిటినీ నశింపచేస్తుంది. ఈ కాలమే ప్రపంచాన్ని నిలుపుతుంది. ఈ ప్రపంచమంతా కాలానికి వశమైపోయింది. ఆద్యంతాలు లేనిది, అన్నిటినీ పొందినది అయిన మాయ - దేవతలకు అధిపతి, నాశనం లేనివాడు, సమస్తానికీ రాజు, కాలస్వరూపుడు, పరమేష్ఠి అయిన శివుడి సాన్నిధ్యాన్ని పొందింది. అలా శివుణ్ణి పొందిన మాయ కేవల రూప, భేద రహితంగా, మంగళరూపిణిగా అయ్యింది.

**శివ-శక్తులు :** ఒకటే శక్తి శివుడు- శక్తిమంతుడు కూడా శివుడొక్కడే అని చెప్పబడింది. ఇతర శక్తులు, శక్తిమంతులు ఆ సర్వశక్తి నుంచే ఆవిర్భవించాయి. శక్తికి శక్తిమంతుడికి పరమార్ధరూపంలో భేదాన్ని చెబుతారు. తత్త్వాన్ని విచారించే యోగులు మాత్రమే ఆ రెండింటికీ భేదాన్ని చూస్తున్నారు.

శక్తులన్నీ హిమవంతుడి పుత్రిక అయిన పార్వతీదేవి రూపాలు. శక్తిమంతుడు శివుడు. ఇదే విషయం బ్రహ్మవేత్తల ద్వారా పురాణాల్లో చెప్పబడుతోంది. శక్తి-శక్తిమంతం అనేవాటి పుట్టుకకి సంబంధించిన ఈ విషయాలన్నీ వేదాల్లో ప్రతిపాదించబడినవే. దివ్యమైనది, ఉత్తమమైనది అయిన ఈ దేవీ మాహాత్మ్యాన్ని బ్రహ్మవాదులైన ఋషులు తమ తమ వేదాంత చర్చల్లో చక్కగా నిరూపించారు.

**దేవీ పరమపదం :** దేవి నివసించే పరమపదం అత్యున్నతమైనది. దాన్ని కేవలం సర్వోన్నతమైన యోగులు మాత్రమే దర్శించగలరు.

పరాత్పరతరం తత్త్వం శాశ్వతం శివమచ్యుతమ్ ।
అనంత ప్రకృతే లీనం దేవ్యాస్తత్పరమం పదమ్ ॥

*(శ్లో॥36,అధ్యా-12)*

ఆనందరూపమైనది, నాశనం లేనిది, కేవలమైనది, భేదరహితంగా ఉండేది, పరబ్రహ్మరూపమైనది అయిన ఆ మహాదేవి ఉన్నత పదాన్ని పరమయోగులు దర్శిస్తారు. 'పరం'కన్నా గొప్పదైన పరమ తత్త్వమైనది, శాశ్వతమైనది, మంగళప్రదమైనది, అంతంలేని ప్రకృతిలో లీనమైనది ఆ దేవి పరమపదం. దేవి నివాసస్థానమైన పరమపదం ఎంతో శుభప్రదమైనది. ఎలాంటి మాలిన్యాలూ లేనిది, నిర్మలమైనది, గుణరహితమైనది, ఆత్మసాక్షాత్కారాన్ని కలిగించేది.

ఈ దేవి పరమానందాన్ని పొందేవారికి, ధాత్రి విధాత్రి కూడా అవుతోంది. దేవి ఈశ్వర సంబంధమైనది కనుక సంసారతాపాల్ని కూడా నశింపచేస్తుంది. కనుక మోక్షం పొందాలనుకునేవారు పరమేశ్వరుడి ప్రాణపత్ని, సర్వప్రాణులకీ ఆప్తురాలు, శివస్వరూపిణి అయిన పార్వతీదేవిని ఆశ్రయించాలి.

తస్మాద్విముక్తి మన్విచ్ఛన్ పార్వతీం పరమేశ్వరీం ।
ఆశ్రయేత్సర్వ భూతానామాత్మభూతాం శివాత్మికాం ॥

*(శ్లో॥39,అధ్యా-12)*

## హిమవంతుడికి పరాశక్తి దర్శనం

పూర్వం హిమవంతుడు ఎంతో గొప్ప తపస్సుచేసి పార్వతీదేవిని కుమార్తెగా పొందాడు. ఆమె తన కుమార్తే అయినప్పటికీ తన భార్యతో కలిసి ఆమెని శరణువేడాడు. హిమవంతుడు ఉదయించే సూర్యుడితో సమానంగా ప్రకాశిస్తూ, జటాజూటాలతో నాలుగు ముఖాలతో, మూడు కళ్ళుతో, ఎనిమిది చేతులతో చంద్రకళని సిగలో ధరించి మహాద్భుతంగా ప్రకాశిస్తున్న దేవిని చూసి భయపడిపోయాడు. ఆమె దివ్యతేజస్సుని తట్టుకోలేక అమ్మా! నీవెవరు? దయచేసి నాకు యథార్థాన్ని తెలియచేయి అని వినయంగా దేవిని ప్రార్థించాడు.

హిమవంతుడి మాటలు విన్న పరమేశ్వరి "పర్వత రాజా! నన్ను పరమేశ్వరుణ్ణి ఆశ్రయించి ఉన్న పరమేశ్వరిగా తెలుసుకో. మోక్షాన్ని కాంక్షించేవారు, నన్ను ఎలాంటి ఆపేక్షాలేని దానిగా, నాశనరహితురాలిగా గుర్తిస్తారు. నేను అన్ని లోకాలకీ ఆత్మీయురాలిని. అన్ని రకాలుగా శివస్వరూపిణిని, శాశ్వతమైన ఐశ్వర్యాన్ని, విజ్ఞానాన్ని కలిగినదానిని. ఈ సమస్తాన్నీ నేనే ప్రవర్తింపచేస్తాను. అనంతమైన మహిమలు కలిగినదానిని. సంసారమనే సముద్రాన్ని దాటించే నావని. నీకు దివ్యదృష్టిని ప్రసాదిస్తున్నాను. యథార్థమైన నా దివ్యరూపాన్ని దర్శించు" అని హిమవంతుడికి దివ్యదృష్టిని ప్రసాదించింది పరమేశ్వరి.

## పరాశక్తి దివ్యరూపం

కోటిసూర్య ప్రతీకాశం తేజోబింబ నిరాకులమ్ ।
జ్వాలామాలా సహస్రాఢ్యం కాలనాళ శతోపమమ్ ॥ 1

దంష్ట్రాకరాళం దుర్ధర్షం జటా మండలమండితమ్ ।
కిరీటినం గదాహస్తం శంఖచక్రధరం తథా ॥ 2

త్రిశూలవర హస్తం చ ఘోరరూపం భయానకమ్ ।
ప్రశాంతం సౌమ్యవదనం అనంతాశ్చర్యసంయుతమ్ ॥ 3

చంద్రావయవ లక్ష్మాణం చంద్రకోటి సమప్రభమ్ ।
కిరీటినం గదాహస్తం నూపురై రుపశోభితమ్ ।
శంఖచక్ర ధరం కామ్యం త్రినేత్రం కృత్తివాససమ్ ॥ 4

*(శ్లో॥52-55,అధ్యా-12)*

పరమేశ్వరి దివ్యరూపం కోటి సూర్యుల తేజస్సుతో విరాజిల్లుతోంది. ఎలాంటి వికారాలూ లేనిది. వేలాది జ్వాలలతో కూడుకొంది. వందలాది నాళికలతో సమానంగా ఉంది. భయంకరమైన కోరలతో ఎవరూ ఎదుర్కోలేనంత భీకరంగా వుంది. జటలసమూహంతో ఎవరూ చూడలేనంత భయంకరంగా ఉంది. ఆభరణాల సమూహంతో అలంకరించబడింది. ఆమె తలపై బంగారు

కిరీటం, చేతిలో గద, శంఖ, చక్రాలు, త్రిశూలం ధరించి భీతిని కలిగిస్తోంది. అంతలోనే ప్రశాంతంగా, ప్రసన్నంగా కూడా కనిపిస్తోంది. ఆ దేవి ఎంతో ఆశ్చర్యకరంగా చంద్రకళని సిగలో ధరించి, అందమైన కాళ్ళకి అందెల్ని, మెడలో దివ్యమైన పుష్పాల హారాన్ని, శరీరంపై అందమైన వస్త్రాన్ని ధరించింది. ఈ విధంగా త్రినేత్రాలతో ఆ పరమేశ్వరి, సర్వాంగ సుందరంగా హిమవంతుడికి దర్శనమిచ్చింది.

సకలాయుధగా, సకలశక్తి సమన్వితగా తనకి పరమేశ్వరి దర్శనమివ్వగానే హిమవంతుడికి ఆనందంతో నోటమాట రాలేదు. రోమాలు నిక్కబొడుచుకున్నాయి. తన్మయత్వంలో మునిగిపోయాడు. కొద్ది క్షణాల్లోనే కోలుకుని సృష్టి స్థితి లయకారిణి, శివాస్వరూపిణి అయిన పరమేశ్వరిని 1008 దివ్యనామాలతో మహావైభవంగా ఇలా స్తుతించాడు.

## ఆదిపరాశక్తి సహస్రనామ స్తోత్రం

అండస్థం చాణ్డబాహ్యస్థం బాహ్య మాభ్యన్తరం పరమ్ ।
సర్వశక్తిమయం శుభ్రం సర్వాకారం సనాతనమ్ ॥ 1

బ్రహ్మేన్ద్రోపేన్ద్రయోగీన్ద్రై ర్వంద్యమాన పదామ్బుజమ్ ।
సర్వతః పాణిపాదాన్తం సర్వతోక్షి శిరోముఖమ్ ॥ 2

సర్వమావృత్య తిష్ఠన్తీం దదర్శ పరమేశ్వరీమ్ ।
దృష్ట్వాతదీదృశం రూపం దేవ్యా మాహేశ్వరం పరమ్ ॥ 3

భయేన చ సమావిష్టః స రాజా హృష్టమానసః ।
ఆత్మన్యాధాయ చాత్మాన మోంకారం సమనుస్మరన్ ॥ 4

భయేన మష్ట సహస్రేణ తుష్టావ పరమేశ్వరీమ్ ।
శివోమా పరమాశక్తి రనన్తా నిష్కలా మలా ॥ 5

శాన్తా మాహేశ్వరి నిత్యా శాశ్వతీ పరమాక్షరా ।
అచిన్త్యా కేవలానన్త్యా శివాత్మా పరమాత్మికా ॥ 6

అనాది రవ్యయా శుద్ధా దేవాత్మా సర్వగా చలా ।
ఏకానేక విభాగస్థా మాయాతీతా సునిర్మలా ॥ 7

మహామహేశ్వరీ సత్యా మహాదేవీ నిరఞ్జనా ।
కాష్ఠా సర్వాన్తరస్థా చ చిచ్ఛక్తి రతిలాలసా ॥ 8

నన్దా సర్వాత్మికా విద్యా జ్యోతీ రూపామృతాక్షరా ।
శాన్తిః ప్రతిష్ఠా సర్వేషాం నివృత్తిరమృతప్రదా॥ 9

వ్యోమమూర్తి ర్వ్యోమలయా వ్యోమధారా చ్యుతామరా ।
అనాదినిధనా మోఘా కారణాత్మా కులాకులా ॥ 10

స్వతః ప్రథమజానాభి రమృతస్యాత్మ సంశ్రయా ।
ప్రాణేశ్వరప్రియా మాతా మహామహిష వాసినీ ॥ 11

ప్రాణేశ్వరీ ప్రాణరూపా ప్రధానపురుషేశ్వరీ ।
మహామాయా సుదుష్పూరా మూల ప్రకృతిరీశ్వరీ ॥ 12

సర్వశక్తి కలాకారా జ్యోత్స్నాదౌర్మహిమాస్మదా ।
సర్వకార్య నియన్త్రీ చ సర్వభూతేశ్వరేశ్వరీ ॥ 13

సంసారయోనిః సకలా సర్వశక్తి సముద్భవా ।
సంసారపోతా దుర్వారా దుర్నిరీక్ష్యా దురాసదా ॥ 14

ప్రాణశక్తిః ప్రాణవిద్యా యోగినీ పరమా కలా ।
మహావిభూతి దుర్ధర్షా మూలప్రకృతి సమ్భవా ॥ 15

అనాద్యనన్తవిభవా పరమా ద్యాపకర్షణీ ।
సర్గస్థిత్యన్తకరణీ సుదుర్వాచ్యా దురత్యయా ॥ 16

శబ్దయోనిః శబ్దమయీ నాదాఖ్యా నాదవిగ్రహా ।
అనాది రవ్యక్తగుణా మహానన్దా సనాతనీ ॥ 17

ఆకాశయోని ర్యోగస్థా మహాయోగీశ్వరేశ్వరీ ।
మహామాయా సుదుష్పారా మూలప్రకృతి రీశ్వరీ ॥ 18

ప్రధానపురుషాతీతా ప్రధానపురుషాత్మికా ।
పురాణా చిన్మయీ పుంసా మాదిపూరుషరూపిణీ ॥ 19

భూతాన్తరస్థా కూటస్థా మహాపురుష సంజ్ఞితా ।
జన్మమృత్యుజరాతీతా సర్వశక్తి సమన్వితా ॥ 20

వ్యాపినీ చానవచ్ఛిన్నా ప్రధానానుప్రవేశినీ ।
క్షేత్రజ్ఞశక్తి రవ్యక్త లక్షణామలవర్జితా ॥ 21

అనాదిమాయా సంభిన్నా త్రితత్త్వా ప్రకృతిగ్రహా ।
మహామయా సముత్పన్నా తామసీ పౌరుషీ ధ్రువా ॥ 22

వ్యక్తావ్యక్తాత్మికా కృష్ణా రక్తా శుక్లా ప్రసూతికా ।
అకార్యా కార్యజననీ నిత్యం ప్రసవధర్మిణీ ॥ 23

సర్గప్రలయనిర్ముక్తా సృష్టి స్థిత్యన్తధర్మిణీ ।
బ్రహ్మగర్భా చతుర్వింశా పద్మనాభాచ్యుతాత్మికా ॥ 24

వైద్యుతీ శాశ్వతీ యోని ర్జగన్మాతేశ్వర ప్రియా ।
సర్వాధారా మహారూపా సర్వైశ్వర్యసమన్వితా ॥ 25

విశ్వరూపా మహాగర్భా విశ్వేశేచ్ఛానువర్తినీ ।
మహీయసీ బ్రహ్మయోనిః మహాలక్ష్మీ సముద్భవా॥ 26

మహావిమానమధ్యస్థా మహానిద్రాత్మ హేతుకా ।
సర్వసాధారణీ సూక్ష్మా హ్యవిద్యా పారమార్థికా ॥ 27

అనన్తరూపా నన్తస్థా దేవీ పురుషమోహినీ ।
అనేకాకాకసంస్థానా కాలత్రయవివర్జితా ॥ 28

బ్రహ్మజన్మా హరేర్మూర్తి ర్బ్రహ్మ విష్ణు శివాత్మికా ।
బ్రహ్మేశవిష్ణుజననీ బ్రహ్మాఖ్యా బ్రహ్మసంశ్రయా ॥ 29

వ్యక్తా ప్రథమజా బ్రాహ్మీ మహతీ బ్రహ్మరూపిణీ ।
వైరాగ్యైశ్వర్య ధర్మాత్మా బ్రహ్మమూర్తి ర్హృదిస్థితా ॥ 30

అపాం యోనిః స్వయమ్భూతి ర్మానసీ తత్త్వసమ్భవా ।
ఈశ్వరాణీ చ శర్వాణీ శంకరార్ధశరీరిణీ ॥ 31

భవానీ చైవ రుద్రాణీ మహాలక్ష్మీ రథామ్బికా ।
మహేశ్వరసముత్పన్నా భుక్తిముక్తి ఫలప్రదా ॥ 32

సర్వేశ్వరీ సర్వవన్ద్యా నిత్యం ముదితమానసా ।
బ్రహ్మేన్ద్రోపేన్ద్రనమితా శంకరేచ్ఛానువర్తినీ ॥ 33

ఈశ్వరార్ధాసనగతా మహేశ్వర పతివ్రతా ।
సకృద్విభాతా సర్వార్తి సముద్రపరిశోషిణీ ॥ 34

పార్వతీ హిమవత్పుత్రీ  పరమానన్దదాయినీ ।
గుణాఢ్యా యోగజా యోగ్యా జ్ఞానమూర్తిర్వికాసినీ ॥ 35

సావిత్రీ కమలా లక్ష్మీః శ్రీ రనన్తోరసి స్థితా ।
సరోజనిలయా గఙ్గా యోగనిద్రా ఽసురార్దినీ ॥ 36

సరస్వతీ సర్వ విద్యా జగజ్జ్యేష్ఠా సుమంగళా ।
వాగ్దేవీ వరదా వాచ్యా కీర్తిః సర్వార్థసాధికా ॥ 37

యోగీశ్వరీ బ్రహ్మవిద్యా మహావిద్యా సుశోభనా ।
గుహ్యవిద్యాత్మవిద్యా చ ధర్మ విద్యాత్మభావితా ॥ 38

స్వాహా విశ్వమ్భరా సిద్ధిః స్వధా మేధా ధృతిః శ్రుతిః ।
నీతిః సునీతిః సుకృతి ర్మాధవీ నరవాహనీ ॥ 39

పూజ్యా విభావతీ సౌమ్యా భోగినీ భోగశాయినీ ।
శోభా చ శంకరీ లోలా మాలినీ పరమేష్ఠినీ ॥ 40

త్రైలోక్యసున్దరీ నమ్యా సున్దరీ కామచారిణీ ।
మహానుభావా సత్త్వస్థా మహామహిషమర్దినీ ॥ 41

పద్మనాభా పాపహరా విచిత్రముకుటాంగదా ।
కాన్తా చిత్రామ్బరధరా దివ్యాభరణ భూషితా ॥ 42

హంసాభ్యా వ్యోమనిలయా జగత్సృష్టివివర్ధినీ ।
నియన్త్రీ యన్త్రమధ్యస్థా నన్దినీ భద్రకాలికా ॥ 43

ఆదిత్యవర్ణా కౌబేరీ మయూర వరవాహనా ।
వృషాసనగతా గౌరీ మహాకాలీ సురార్చితా ॥ 44

అదితిర్నియతా రౌద్రా పద్మగర్భా వివాహనా ।
విరూపాక్షీ లేలిహానా మహాసురవినాశినీ ॥ 45

మహాఫలానవద్యాఙ్గీ కామరూపా విభావరీ ।
విచిత్రరత్నముకుటా ప్రణతార్తి ప్రభఞ్జనీ ॥ 46

కౌశికీ కర్షణీ రాత్రి స్త్రిదశార్తివినాశినీ ।
బహురూపా స్వరూపా చ విరూపా రూప వర్జితా ॥ 47

భక్తార్తిశమనీ భవ్యా భవతాపవినాశినీ ।
నిర్గుణా నిత్యవిభవా నిస్సారా నిరప త్రపా ॥ 48

తపస్వినీ సామగీతి ర్భవాంకనిలయాలయా ।
దీక్షా విద్యాధరీ దీప్తా మహేన్ద్ర వినిపాతినీ ॥ 49

సర్వాతిశాయినీ విశ్వా సర్వసిద్ధి ప్రదాయినీ ।
సర్వేశ్వరప్రియా భార్యా సముద్రాన్తరవాసినీ ॥ 50

అకలంకా నిరాధారా నిత్యసిద్ధా నిరామయా ।
కామధేను ర్బృహద్గర్భా ధీమతీ మోహనాశినీ ॥ 51

నిః సంకల్పా నిరాతఙ్కా వినయా వినయప్రియా ।
జ్వాలామాలా సహస్రాఢ్యా దేవదేవీ మనోమయా ॥ 52

మహాభగవతీ భర్గా వాసుదేవసముద్భవా ।
మహేన్ద్రోపేన్ద్ర భగినీ భక్తిగమ్యా పరావరా ॥ 53

జ్ఞానజ్ఞేయా జరాతీతా వేదాన్తవిషయా గతిః ।
దక్షిణా దహతీ దీర్ఘా సర్వభూతనమస్కృతా ॥ 54

యోగమయా విభాగజ్ఞా మహామోహా గరీయసీ ।
సన్ధ్యా సర్వసముద్భూతి ర్బ్రహ్మవిద్యాశ్రయాదిభిః ॥ 55
బీజాఙ్కురసముద్భూతి ర్మహాశక్తి ర్మహామణిః ।
క్షాన్తిః ప్రజ్ఞా చితిః సచ్చి న్మహాభోగీన్ద్రశాయినీ ॥ 56
వికృతిః శాఙ్కరీ శాన్తి ర్గణగన్ధర్వసేవితా ।
వైశ్వానరీ మహాశాలా మహాసేనా గుహప్రియా ॥ 57
మహారాత్రిః శివానన్దా శచీ దుఃస్వప్ననాశినీ ।
ఇజ్యా పూజ్యా జగద్ధాత్రీ దుర్విజ్ఞేయా సురూపిణీ ॥ 58
తపస్వినీ సమాధిస్థా త్రినేత్రా దివి సంస్థితా ।
గుహామ్బికా గుణోత్పత్తి ర్మహాపీఠా మరుత్సుతా ॥ 59
హ్యవ్యవాహాన్తరాగాదిః హవ్యవాహసముద్భవా ।
జగద్యోని ర్జగన్మాతా జన్మమృత్యు జరాతిగా ॥ 60
బుద్ధి ర్మహాబుద్ధిమతీ పురుషాన్తరవాసినీ ।
తరస్వినీ సమాధిస్థా త్రినేత్రా దివి సంస్థితా ॥ 61
సర్వేన్ద్రియ మనోమాతా సర్వభూతహృది స్థితా ।
సంసారతారిణీ విద్యా బ్రహ్మవాది మనోలయా ॥ 62
బ్రహ్మాణీ బృహతీ బ్రాహ్మీ బ్రహ్మభూతా భవారిణీ ।
హిరణ్మయీ మహారాత్రిః సంసారపరివర్తికా ॥ 63
సుమాలినీ సురూపా చ భావినీ హారిణీ ప్రభా ।
ఉన్మీలనీ సర్వసహా సర్వప్రత్యయసాక్షిణీ ॥ 64
సుసౌమ్యా చన్ద్రవదనా తాణ్డవాసక్తమానసా ।
సత్త్వశుద్ధికరీ శుద్ధి ర్మలత్రయ వినాశినీ ॥ 65
జగత్ప్రియా జగన్మూర్తి స్త్రిమూర్తి రమృతాశ్రయా ।
నిరాశ్రయా నిరాహారా నిరంకుశ పదోద్భవా ॥ 66

చన్ద్రహస్తా విచిత్రాఙ్గీ స్రగ్విణీ పద్మధారిణీ ।
పరావరవిధానజ్ఞా మహాపురుష పూర్వజా ॥ 67

విశ్వేశ్వరప్రియా విద్యుద్విద్యుజ్జిహ్వా జితశ్రమా ।
విద్యామయీ సహస్రాక్షీ సహస్రవదనాత్మజా ॥ 68

సహస్రరశ్మిః సత్త్వస్థా మహేశ్వరపదాశ్రయా ।
క్షాలినీ మృణ్మయీ వ్యాప్తా తైజసీ పద్మబోధికా ॥ 69

మహా మాయాశ్రయా మాన్యా మహాదేవమనోరమా ।
వ్యోమలక్ష్మీః సింహరథా చేకితానా మితప్రభా ॥ 70

వీరేశ్వరీ విమానస్థా విశోకా శోకనాశినీ ।
అనాహతా కుణ్డలినీ నలినీ పద్మభాసినీ ॥ 71

సదానన్దా సదాకీర్తిః సర్వభూతాశ్రయస్థితా ।
వాగ్దేవతా బ్రహ్మకలా కలాతీతా కలారణీ ॥ 72

బ్రహ్మశ్రీ ర్బ్రహ్మహృదయా బ్రహ్మవిష్ణుశివప్రియా ।
వ్యోమశక్తిః క్రియాశక్తి ర్జ్ఞాన శక్తిః పరాగతిః ॥ 73

క్షోభికా బన్ధికా భేద్యా భేదా భేదవివర్జితా ।
అభిన్నా భిన్న సంస్థానా వశినీ వంశహారిణీ ॥ 74

గుహ్యశక్తి ర్గుణాతీతా సర్వదా సర్వతోముఖీ ।
భగినీ భగవత్పత్నీ సకలా కాలహారిణీ ॥ 75

సర్వవిత్ సర్వతోభద్రా గుహ్యాతీతా గుహావలిః ।
ప్రక్రియా యోగమాతా చ గఙ్గా విశ్వేశ్వరేశ్వరీ ॥ 76

కలిలా కపిలా కాన్తా కమలాభా కలాన్తరా ।
పుణ్యా పుష్కరిణీ భోక్త్రీ పురన్దరపురస్సరా ॥ 77

పోషిణీ పరమైశ్వర్యభూతిదా భూతిభూషణా ।
పఞ్చబ్రహ్మసముత్పత్తిః పరమార్థార్థవిగ్రహా॥ 78

ధర్మోదయా భానుమతీ యోగిజ్ఞేయా మనోజవా ।
మనోరమా మనోరస్కా తాపసీ వేదరూపిణీ ॥ 79

వేదశక్తి ర్వేదమాతా వేదవిద్యాప్రకాశినీ ।
యోగేశ్వరేశ్వరీ మాతా మహాశక్తి ర్మనోమయీ ॥ 80

విశ్వావస్థా వియన్మూర్తి ర్విద్యున్మాలా విహాయసీ ।
కిన్నరీ సురభీ విద్యానన్దినీ నన్దివల్లభా ॥ 81

భారతీ పరమానన్దా పరాపర విభేదికా ।
సర్వప్రహరణోపేతా కామ్యా కామేశ్వరేశ్వరీ ॥ 82

అచిన్త్యా నన్తవిభవా భూలేఖా కనక ప్రభా ।
కూష్మాణ్డీ ధనరత్నాఢ్యా సుగన్ధా గన్ధదాయినీ ॥ 83

త్రివిక్రమపదోద్భూతా ధనుష్పాణిః శివోదయా ।
సుదుర్లభా ధనాధ్యక్షా ధన్యా పిఙ్గలలోచనా ॥ 84

శాన్తిః ప్రభావతీ దీప్తిః పఙ్కజాయతలోచనా ।
ఆద్యాభూః కమలోద్భూతా గవాం మాతా రణప్రియా ॥ 85

సత్క్రియా గిరిశా శుద్ధి ర్నిత్యపుష్టా నిరన్తరా ।
దుర్గా కాత్యాయనీ చణ్డీ చర్చితాఙ్గీ సువిగ్రహా ॥ 86

హిరణ్యవర్ణా జగతీ జగద్యన్త్ర ప్రవర్తికా ।
మన్దరాద్రినివాసా చ గరహా స్వర్ణమాలినీ ॥ 87

రత్నమాలా రత్నగర్భా పుష్టి ర్విశ్వప్రమాథినీ ।
పద్మనాభా పద్మనిభా నిత్యరుష్టాఽమృతోద్భవా ॥ 88

ధున్వతీ దుష్ప్రకమ్పాచ సూర్యమాతా దృషద్వతీ ।
మహేన్ద్రభగినీ సౌమ్యా వరేణ్యా వరదాయికా ॥ 89

కల్యాణీ కమలావాసా పఞ్చచూడా వరప్రదా ।
వాచ్యామరేశ్వరీ విద్యా దుర్జయా దురతి క్రమా ॥ 90

కాలరాత్రి ర్మహావేగా వీరభద్రప్రియా హితా ।
భద్రకాలీ జగన్మాతా భక్తానాం భద్రదాయినీ ॥ 91

కరాలా పింగలాకారా కామభేదా మహాస్వనా ।
యశస్వినీ యశోదా చ షడధ్వపరివర్తికా ॥ 92

శంఖినీ పద్మినీ సాంఖ్యా సాంఖ్యయోగ ప్రవర్తికా ।
చైత్రా సంవత్సరారూఢా జగత్సమ్పూరణీ ధ్వజా ॥ 93

శమ్భారిః ఖేచరీ స్వస్థా కమ్బుగ్రీవా కలిప్రియా ।
ఖగధ్వజా ఖగారూఢా వారాహీ పూగమాలినీ ॥ 94

ఐశ్వర్యపద్మనిలయా విరక్తా గరుడాసనా ।
జయన్తీ హృద్గుహాగమ్యా గహ్వరేష్ఠా గణాగ్రణీః ॥ 95

సంకల్పసిద్ధా సామ్యస్థా సర్వవిజ్ఞానదాయినీ ।
కలిః కల్కివిహన్త్రీ చ గుహ్యోపనిషదుత్తమా ॥ 96

నిష్ఠా దృష్టిః స్మృతిర్వ్యాప్తిః పుష్టి స్తుష్టిః క్రియావతీ ।
విశ్వామరేశ్వరేశానా భుక్తి ర్ముక్తిః శివామృతా ॥ 97

లోహితా సర్పమాలా చ భీషణీ వనమాలినీ ।
అనన్తశయనా నన్తా నరనారాయణోద్భవా ॥ 98

నృసింహీ దైత్యమథనీ శంఖచక్రగదాధరా ।
సంకర్షణీ సముత్పత్తి రమ్బికాపాదసంశ్రయా ॥ 99

మహాజ్వాలా మహామూర్తిః సుమూర్తిః సర్వకామధుక్ ।
శుభ్రా చ సుస్తనా గౌరీ ధర్మకామార్థమోక్షదా ॥ 100

భ్రూమధ్య నిలయా పూర్వా పురాణపురుషారణిః ।
మహావిభూతిదాఽమధ్యా సరోజనయనా సమా ॥ 101

అష్టాదశభుజా నాద్యా నీలోత్పలదళప్రభా ।
సర్వశక్త్యాసనారూఢా ధర్మాధర్మ వివర్జితా ॥ 102

వైరాగ్యజ్ఞాననిరతా నిరాలోకా నిరిన్ద్రియా ।
విచిత్రగహనాధారా శాశ్వతస్థాన వాసినీ ॥ 103

స్థానేశ్వరీ నిరానన్దా త్రిశూలవరధారిణీ ।
అశేషే దేవతామూర్తి ర్దేవతా వరదేవతా ॥ 104

గణామ్బికా గిరేః పుత్రీ నిశుమ్భవినిపాతినీ ।
అవర్ణా వర్ణరహితా త్రివర్ణా జీవ సంభవా ॥ 105

అనన్తవర్ణానన్యస్థా శంకరీ శాన్తమానసా ।
అగోత్రా గోమతీ గోప్త్రీ గుహ్యరూపా గుణోత్తరా ॥ 106

గౌర్గీర్గవ్య ప్రియా గౌగీ గణేశ్వర నమస్కృతా ।
సత్యభామా సత్యసన్ధా త్రిసన్ధ్యా సన్ధివర్జితా ॥ 107

సర్వవాదాశ్రయా సాంఖ్యా సాంఖ్యయోగ సముద్భవా ।
అసంఖ్యేయా ఽప్రమేయాఖ్యా శూన్యా శుద్ధకులోద్భవా ॥ 108

బిన్దునాద సముత్పత్తిః శమ్భువామా శశిప్రభా ।
పిశఙ్గా భేదరహితా మనోజ్ఞా మధుసూదనీ ॥ 109

మహాశ్రీః శ్రీసముత్పత్తి స్తమఃపారే ప్రతిష్ఠితా ।
త్రితత్త్వమాతా త్రివిధా సుసూక్ష్మ పదసంశ్రయా ॥ 110

శాన్తా భీతా మలాతీతా నిర్వికారా శివాశ్రయా ।
శివాఖ్యా చిత్తనిలయా శివజ్ఞానస్వరూపిణీ ॥ 111

దైత్యదానవ నిర్మాథీ కాశ్యపీ కాలకర్ణికా ।
శాస్త్రయోనిః క్రియామూర్తి శ్చతుర్వర్గ ప్రదర్శికా ॥ 112

నారాయణీ నరోత్పత్తిః కౌముదీ లిఙ్గధారిణీ ।
కాముకీ కలితా భావా పరావర విభూతిదా ॥ 113

పరాఙ్గజాతమహిమా బడబా వామలోచనా ।
సుభద్రా దేవకీ సీతా వేదవేదాఙ్గపారగా ॥ 114

మనస్వినీ మన్యుమాతా మహామన్యుసముద్భవా ।
అమన్యు రమృతాస్వాదా పురుహూతా పురుష్టుతా ॥ 115

అశోచ్యా భిన్నవిషయా హిరణ్యరజతప్రియా ।
హిరణ్యరజనీ  హైమా హేమా భరణభూషితా ॥ 116

విభ్రాజమానా దుర్జ్ఞేయా జ్యోతిష్టోమఫలప్రదా ।
మహానిద్రాసముద్భూతి రనిద్రా సత్యదేవతా ॥ 117

దీర్ఘా కకుద్మినీ హృద్యా శాన్తిదా శాన్తి వర్ధినీ ।
లక్ష్మ్యాదిశక్తి జననీ శక్తి చక్రప్రవర్తికా ॥ 118

త్రిశక్తిజననీ జన్యా షడూర్మిపరివర్జితా ।
సుధౌతా కర్మకరణీ యుగాన్తదహనాత్మికా ॥ 119

సంకర్షణీ జగద్ధాత్రీ కామయోనిః కిరీటినీ ।
బన్ద్రీ త్రైలోక్యనమితా వైష్ణవీ పరమేశ్వరీ ॥ 120

ప్రద్యుమ్నదయితా దాత్రీ  యుగ్మదృష్టి స్త్రిలోచనా ।
మదోత్కటా హంసగతిః ప్రచణ్డా చణ్డవిక్రమా ॥ 121

వృషావేశా వియన్మాతా విన్ధ్యపర్వతవాసినీ ।
హిమవన్మేరునిలయా కైలాసగిరివాసినీ ॥ 122

చాణూరహన్తృతనయా నీతిజ్ఞా కామరూపిణీ ।
వేదవిద్యావ్రతస్నాతా బ్రహ్మ శైలనివాసినీ ॥ 123

వీరభద్రప్రజా వీరా మహాకామసముద్భవా ।
విద్యాధరప్రియా సిద్ధా విద్యాధరనిరాకృతిః॥ 124

ఆప్యాయనీ హరన్తీ చ పావనీ పోషణీ కలా ।
మాతృకా మన్మథోద్భూతా వారిజా వాహనప్రియా॥ 125

కరీషిణీ సుధావాణీ వీణావాదన తత్పరా ।
సేవితా సేవికా సేవ్యా సినీవాలీ గరుత్మతీ ॥ 126

ధారాధరా వరారోహ పరావాస సహస్రదా ।
శ్రీఫలా శ్రీమతీ శ్రీశా శ్రీనివాసా శివప్రియా ॥ 127

శ్రీధరా శ్రీకరీ కల్యా శ్రీధరార్ధ శరీరిణీ ।
అనన్తదృష్టి రక్షుద్రా  ధాత్రీశా ధనదప్రియా ॥ 128

నిహన్త్రీ దైత్యసంఘానాం సింహికా సింహవాహనా ।
సువర్చలా చ సుశ్రోణీ సుకీర్తి శ్ఛిన్నసంశయా ॥ 129

రసజ్ఞా రసదా రామా లేలిహానాఽమృతస్రవా ।
నిత్యోదితా స్వయంజ్యోతి రుత్సుకామృతజీవనా ॥ 131

వజ్రదణ్డా వజ్రచిహ్నా వైదేహీ వజ్రవిగ్రహా ।
మఙ్గల్యా మఙ్గలా మాలా నిర్మలామలహారిణీ ॥ 132

గాన్ధర్వీ కరుణాచాన్ద్రీ కమ్బలాశ్వతర ప్రియా ।
సౌదామినీ జనానన్దా భ్రుకుటీకుటిలాననా ॥ 133

కర్ణికారకరా కక్షా కంసప్రాణాపహారిణీ ।
యుగన్ధరా యుగావర్తా త్రిసన్ధ్యా హర్షవర్ధనీ ॥ 134

ప్రత్యక్షదేవతా దివ్యా దివ్యగన్ధా దివఃపరా ।
శక్రాసనగతా శాక్రీ సాధ్యా చారుశరాసనా ॥ 135

ఇష్టా విశిష్టా శిష్టేష్టా శిష్టా శిష్టప్రపూజితా ।
శతరూపా శతవర్తా వినతా సురభిః సురా ॥ 136

సురేన్ద్రమాతా సుద్యుమ్నా సుషుమ్నా సూర్యసంస్థితా ।
సమీక్ష్యా సత్ప్రతిష్ఠా చ నివృత్తి ర్జ్ఞానపారగా ॥ 137

ధర్మశాస్త్రార్థ కుశలా ధర్మజ్ఞా ధర్మవాహనా ।
ధర్మాధర్మవినిర్మాత్రీ ధార్మికాణాం శివప్రదా ॥ 138

ధర్మశక్తి ర్ధర్మమయీ విధర్మా విశ్వధర్మిణీ ।
ధర్మాన్తరా ధర్మమయీ ధర్మపూర్వా ధనావహా ॥ 139

ధర్మోపదేష్ట్రీ ధర్మాత్మా ధర్మగమ్యా ధరాధరా ।
కాపాలీ శకలా మూర్తిః కలాకలితవిగ్రహా ॥ 140

సర్వశక్తి వినిర్ముక్తా సర్వశక్త్యాశ్రయాశ్రయా ।
సర్వా సర్వేశ్వరీ సూక్ష్మా సూక్ష్మజ్ఞానస్వరూపిణీ ॥ 141

ప్రధానపురుషా శేషా మహాదేవైక సాక్షిణీ ।
సదాశివా వియన్మూర్తి ర్వేదమూర్తి రమూర్తికా ॥ 142

ఏవం నామ్నాం సహస్రేణ స్తుత్వా సౌ హిమవా న్గిరిః ।
భూయః ప్రణమ్య భీతాత్మా ప్రోవాచేదం కృతాఞ్జలిః ॥ 143

*(శ్లో॥61-199,అధ్యా-12)*

ఈ విధంగా సహస్రనామ స్తోత్రంతో ఆదిపరాశక్తిని స్తుతించిన హిమవంతుడు తనివి తీరక దివ్యదృష్టి ద్వారా తాను దర్శించిన దేవి గుణగణాలన్నిటినీ ఇలా స్మరించాడు.

దేవీ! నీవు పురుషుల్లో పురుషుడివి. సకల భూతాలలో, మనస్సుల్లో ఉండేదానివి. అన్ని మార్గాల్నీ ప్రకాశింపచేసే సూర్యుడివి నీవే, వాక్కుల్లో సరస్వతివీ నీవే. అందమైన రూపం కలిగిన వారిలో లక్ష్మివి నీవు. మాయావంతులో విష్ణువువి, పతివ్రతల్లో అరుంధతివి, పక్షుల్లో గరుత్మంతుడివి, వేదసూక్తాలలో పురుష సూక్తానివి. సామవేదంలో జ్యేష్ఠ మాసానివి. జపించతగిన అన్ని మంత్రాల్లో గాయత్రివి. యజుర్వేద మంత్రాల్లో శతరుద్రీయానివి.

పర్వతాలలో అత్యున్నతమైన మేరు పర్వతానివి, సర్పాలలో నీవు ఆదిశేషుడివి. అన్నిటా నిండిన పరబ్రహ్మవి నీవు. ఈ సకల ప్రపంచం నీతోనే నిండి ఉంది. తల్లీ! నీ దివ్యరూపం ఎలాంటి వికారాలూ లేనిది. సాధారణంగా ఎవరికీ కనిపించనిది. అవయవరహితమైనది, అఖండమైనది. ఆదిమధ్యాంతాలు తెలియనిది. నాశనం లేనిది. ఆదిభూతమైనది. సత్యస్వరూపమైనది. అలాంటి నీ దివ్యరూపానికి నమస్కరిస్తున్నాను.

వేదాంత శాస్త్రాలు చదివిన వేద వేదాంగవేత్తలు ఏ దేవిని అన్ని లోకాలకీ ఉత్పత్తి కారకురాలిగా దర్శిస్తున్నారో ఆ పరమేశ్వరికి నేను నమస్కరిస్తున్నాను. ఓంకారంగా పిలువబడే ఆ దేవినే శరణువేడుకుంటున్నాను. ఈ చరాచర ప్రపంచంలోని అన్ని ప్రాణుల్లో వ్యాపించి ఉన్నదీ, పురుషుడి సంయోగ వియోగాలకి కారణమైనది, దివ్య తేజస్సుతో వెలుగొందేది, జనన మరణాలు లేనిదీ, ప్రాణం అనే పేరుతో వ్యవహరించబడేది అయిన నీ ఆదిపరాశక్తి రూపానికి నమస్కారం.

ఓ మహాదేవీ! పరమేశ్వరీ! నీకు వందనం. భగవతీ! ఈశానుడి పత్నీ! శివస్వరూపవైన నీకు నమస్కారం. నేను నీకన్నా అభిన్నుడిని, నీవే నాకు ఆధారం. నీవే నాకు దిక్కు. ఓ పరమేశ్వరీ! నిన్ను శరణు వేడుకుంటున్నాను. నాకు ప్రసన్నురాలివికా.

ఈ లోకంలో దేవ దానవ మానవ జాతుల్లో నాకన్నా ధన్యుడు మరెవరూ లేదు. ఎందుకంటే ఆదిపరాశక్తివైన నీవే నా కుమార్తెగా జన్మించావు. అమ్మా! లోకాలకి తల్లివైన నీకే తల్లి అయ్యింది నా భార్య మేనక. ఆమె జీవితం కూడా ఎంతో ధన్యం. మా ఇద్దర్నీ ఎప్పుడూ రక్షించు. కమలాలలాంటి నీ మృదువైన పాదాలకి నమస్కారం. దేవీ! ఇప్పుడు నేనేం చేయాలో చెప్పు" అని విన్నవించాడు హిమవంతుడు.

## ఆది పరాశక్తి ఉపదేశం

హిమవంతుడి ప్రార్థన విన్న దేవి ఎంతో సంతోషించింది. అతడితో "హిమవంతా! నా మాటలు శ్రద్ధగా విను. నేను చెప్పే విషయం ఈశ్వర సంబంధమైనది. బ్రహ్మవాదులైన వేదాంతుల చేత నిత్యం సేవించబడేది. అలాంటి ఉపదేశాన్ని నీకు చేస్తున్నా.

పర్వతరాజా! ఇప్పుడు ఈశ్వర సంబంధమైనది, ఆశ్చర్యకరమైనది, సకల శక్తులతో కూడుకున్నది, అంతంలేనిది, లోకాతీతమైనది అయిన ఏ దివ్య రూపాన్నైతే నీవు దర్శించావో అదే రూపం మీద శ్రద్ధ వహించి, ఆ రూపాన్నే

సదా ధ్యానించు. నీవు చేసే తపస్సు, యజ్ఞం, దానం, అన్నీ ఆ రూపాన్ని ధ్యానిస్తూనే చేయి. నీ మనసులో ఎప్పుడూ పరాశక్తి రూపాన్నే స్థిరంగా నిలుపుకో. నేను చేసిన ఈ ఉపదేశాన్ని పాటిస్తే నీకు సంసారబంధ విమోచన కలుగుతుంది. ఈ ఈశ్వర సంబంధమైన యోగాన్ని నీవు అవలంబిస్తే నిన్ను అతి త్వరలోనే తరింపచేస్తాను.

పర్వతరాజా! నేను కర్మ, భక్తి, జ్ఞానమార్గాల ద్వారానే నీకు ప్రసన్నురాలినౌతాగానీ, మరే మార్గాల ద్వారా కాను. ధర్మం వల్ల భక్తి కలుగుతుంది. భక్తివల్ల పరమాత్మ జ్ఞానం కలుగుతుంది. వేదాల చేతా, శాస్త్రాల చేతా చెప్పబడ్డ యజ్ఞాది కర్మకాండలే ధర్మం. వేదం నుంచి ధర్మం ప్రకాశిస్తుంది. అది మరే ఇతర గ్రంథాల నుంచీ ప్రకాశించదు. కనుక మోక్షాన్ని కోరుకునేవాడు నా రూపమైన వేదాల్ని ఆశ్రయించాలి. వేదం అనే పేరుతో చెప్పబడిన దివ్యశక్తి నాదే. ఆ వేదాల్ని పరిరక్షించటానికే పరమాత్మ బ్రాహ్మణ వర్ణాన్ని సృష్టించి వారిని ఆయాకర్మల్లో వినియోగించాడు. ఎవరైతే నా ధర్మాన్ని అనుష్ఠించరో వారు తామిస్రం అనే నరకానికి వెళతారు.

**వేదప్రాశస్త్యం :** పర్వతరాజా! లోకంలో వేదంకన్నా ఇతరమైనది, ధర్మశాస్త్రాన్ని ప్రబోధించే గ్రంథం మరొకటి లేదు. ఎవడు వేదాన్ని విడిచిపెట్టి ఇతర విషయాల్లో ఆసక్తితో ప్రవర్తిస్తాడో! అలాంటివాడు విప్రులతో సంభాషించటానికి పనికిరాడు. ఈ లోకంలో వేదానికి ధర్మశాస్త్రానికీ విరుద్ధమైన గ్రంథాలు ఏవైతే ఉన్నాయో అవన్నీ తమోగుణ ప్రధానమైనవి. కాపాలం, భైరవం, యామళం, వామం, అర్హతం లాంటి తంత్ర గ్రంథాలు లోకాల్ని మోహంలో పడేయటానికి ఉపకరిస్తాయి. వేదార్థం తెలిసిన పండితుల చేత ఏ వైదికకర్మలైతే చెప్పబడ్డయో ఆయా కర్మల్ని నా భక్తులైన వారు శ్రద్ధగా అనుష్ఠిస్తారు.

**ధర్మశాస్త్రం :** నాలుగు వర్ణాలవారూ! తరించబడటం కోసం నా ఆజ్ఞతో విరాట్పురుషుడైన స్వాయంభువ మనువు ధర్మశాస్త్రాన్ని రచించి మానవాళికి అందించాడు. ఆయన నోటి నుంచి గొప్పదైన ధర్మశాస్త్ర విశేషాల్ని విని లోకంలో ధర్మం వర్ధిల్లాలని భావించిన ఋషులు, మరికొన్ని ధర్మ శాస్త్రాల్ని రచించారు.

ఆ శాస్త్రాలన్నీ యుగాంత ప్రళయంలో నాశనం కాగా, తిరిగి కొత్త యుగంలో మహర్షులు వాటిని పునరుద్ధరించారు.

హిమవంతా! బ్రహ్మదేవుడి ఆ దేశంతో వ్యాసుడు అష్టాదశ పురాణాల్ని ప్రబోధించాడు. ఆ పురాణాలన్నిట్లో ధర్మం పతిష్ఠించబడింది. మిగిలిన ఉపపురాణాల్ని ఆయా మహర్షులు ప్రబోధించారు. ప్రతియుగంలో కూడా ధర్మశాస్త్రం తెలిసిన వాడే కర్తగా ఉంటాడు. శిక్ష, వ్యాకరణం, చందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం, న్యాయవిద్య అనేవి అన్ని విద్యలకీ సహకరించేవి. నాలుగు వేదాలతో కలిపి ఈ విద్యలు కూడా చెప్పబడ్డాయి. లోకాల్ని ఉద్ధరించే ధర్మం ఈ విద్యలన్నిట్లో ఉంటుంది. కనుక పరిపూర్ణమైన ప్రయత్నంతో ధర్మం కోసం వేదాన్ని ఆశ్రయించాలి. ధర్మంతో కూడిన జ్ఞానమే పరబ్రహ్మ స్వరూపాన్ని తెలియచేస్తుంది.

పర్వతరాజా! ఎవరైతే సంసారబంధాన్ని విడిచి నన్నే శరణు పొందుతారో! ఎప్పుడూ ఈశ్వర సంబంధమైన యోగం ద్వారా నన్ను సేవిస్తారో! అన్ని భూతాల మీదా దయని కలిగి ఉంటారో! ఇంద్రియ నిగ్రహంతో అసూయ లేకుండా గర్వరహితులై ఉంటారో! నాకు సంబంధించిన దివ్యజ్ఞానాన్ని బోధించటంలో ఆసక్తి కలిగిన సన్యాసులు, గృహస్థులు, వానప్రస్థులు, బ్రహ్మచారులు ఎవరైతే ఉన్నారో అలాంటి వారిని నేను ఎల్లప్పుడూ రక్షిస్తూ ఉంటాను. వారికి మాయా ప్రభావం వల్ల కలిగిన అజ్ఞానాంధకారాన్ని జ్ఞానదీపం వెలుగుతో తొలగిస్తాను.

రాజా! జ్ఞాన, భక్తి, కర్మ యోగాలలో దేనిద్వారానైనా సంసారబంధ విమోచనం కోసం పరమేశ్వరుణ్ణి శరణు పొందు. అత్యంత రహస్యమైన ఈ ఉపదేశాన్ని నీ కోసమే చెప్పాను. దీన్ని శ్రద్ధగా ఆచరించు. పూర్వం నా తండ్రి దక్షుడి చేత అవమానించబడి నా శరీరాన్ని దగ్ధం చేసుకోగా దేవతలంతా నన్ను తిరిగి జన్మించమని ప్రార్థించారు. వారి కోరికననుసరించి ధర్మాన్ని ఉద్ధరించటం కోసం మీ దంపతులకి కుమార్తెగా జన్మించాను. త్వరలో నన్ను బ్రహ్మదేవుడి ఆదేశం ప్రకారం పరమేశ్వరుడికి సమర్పించు. అలా చేయటం వల్ల

ఇంద్రాది దేవతలందరూ నిన్ను ప్రస్తుతిస్తారు. పరమేశ్వరుడు కూడా ఎంతో సంతోషిస్తాడు” అని హిమవంతుడికి పరాశక్తి ఉపదేశించింది.

సకల దేవతలకీ దేవతైన పరాశక్తి పార్వతిగా చెప్పిన ఈ ఉపదేశాన్ని విని హిమవంతుడు ఎంతో ఆనందించి ఆమెకి భక్తిగా నమస్కరించాడు. ఆమె చెప్పిన విధంగానే కర్మ, భక్తి, జ్ఞాన యోగాల ద్వారా దేవిని సేవించాడు. కాలక్రమంలో బ్రహ్మదేవుడి ఆజ్ఞానుసారం తన కుమార్తె పార్వతీదేవిని పరమేశ్వరుడికిచ్చి వివాహం చేసాడు.

ఇమం యః పఠతేధ్యాయం దేవ్యా మాహాత్మ్య కీర్తనం ।
శివస్య సన్నిధే భక్త్యా శుచిస్తద్భావ భావితః ॥ 1

నామ్నామష్టసహస్రంతు దేవ్యాయత్సముదీరితమ్ ।
జ్ఞాత్వార్కమండలగతా మావాహ్య పరమేశ్వరీమ్ ॥ 2

*(శ్లో॥312-313,అధ్యా-12)*

దేవీ మహాత్మ్యాన్ని వర్ణించే ఈ వృత్తాంతాన్ని ఎవరైతే శుచిగా శివసన్నిధిలో శ్రద్ధగా పఠిస్తాడో వాడికి దివ్యమైన యోగం ప్రాప్తిస్తుంది. అతడు సకల పాపాలనుంచీ విముక్తుడై బ్రహ్మలోకాన్ని దాటి ఆ పైనున్న దేవీలోకానికి చేరుకోగలడు. అలాగే ఆదిపరాశక్తి 1008 నామాల దివ్యస్తోత్రాన్ని పఠిస్తూ సూర్యమండలంలో ఉన్న దేవిని ఆహ్వానించి భక్తి యోగంతో పూలు పళ్ళు సమర్పించి అర్చన చేసినవాడు, అవసానకాలంలో పరబ్రహ్మని చేరుకుంటాడు. లేదా మరుజన్మలో ఉత్తమకులంలో జన్మిస్తాడు.

ఆదిపరాశక్తి సహస్రనామాలతో త్రికాలాలలో హోమం చేయాలి. అలా చేయటం వల్ల మహామారి వ్యాధులు, గ్రహసంబంధమైన దోషాలు తొలగిపోతాయి. సంపదలు కోరుకునేవాడు ఆదిపరాశక్తి స్తోత్రాన్ని గానీ, నామాల్ని గానీ ఒక సంవత్సరం పాటు ప్రతిరోజు ఉదయాన్నే నియమంగా పఠించాలి. అలాగే దేవికి ప్రక్కనే త్రినేత్రుడైన శివుడి ప్రతిమని కూడా స్థాపించి శ్రద్ధా భక్తులతో అర్చించాలి. ఇలా చేసిన వాడికి ఐహికాముష్మిక ఫలితాలు లభిస్తాయి.

# పుత్రుడికోసం శ్రీకృష్ణుడు చేసిన తపస్సు

జగన్నాథుడైన నారాయణుడు ద్వాపర యుగంలో శ్రీకృష్ణుడుగా యదువంశంలో అవతరించాడు. సాక్షాత్తు ఆయన నారాయణుడే అయినప్పటికీ లోక ధర్మాన్ని అనుసరించి పుత్ర సంతానం కోసం తపస్సు చేయాలని నిశ్చయించుకున్నాడు. ఒక శుభముహూర్తంలో తన ద్వారాకా నగరం నుంచి బయల్దేరి ఈశ్వరారాధన తత్పరులైన మునులు నివసించే ఉపమన్యుడి ఆశ్రమానికి వెళ్ళాడు. ఆ ఆశ్రమం భస్మలేపనాలు చేసుకుని రుద్రాక్ష మాలలు ధరించి, రుద్రమంత్ర జపాలు చేస్తున్న మునులతో నిండి ఉంది. ఆశ్రమం సమీపంలోనే సకల పాపాల్నీ ప్రక్షాళన చేసే గంగానది ప్రవహిస్తోంది. అలాంటి ఆశ్రమానికి చేరుకున్న కృష్ణుడు శివతపస్సంపన్నులైన మునుల్ని చూసి వారందరికీ గౌరవంగా నమస్కరించాడు. ఆ మునులు కూడా శంఖ చక్ర గదాధరుడు, ప్రపంచానికి మూలకారణుడు అయిన కృష్ణుణ్ణి చూసి మరింత గౌరవంగా ప్రతి నమస్కారాలు చేసి స్వాగత సత్కారాలందించారు.

ఉపమన్యుడి ఆశ్రమంలో ఉన్న మునులందరూ సాక్షాత్తు వాసుదేవుడే తమ వద్దకి వచ్చాడని ఎంతో ఆనందించారు. ఆశ్చర్యపోయారు. ఇది కలా! నిజమా! అని సందేహించారు. వారంతా తనకి నమస్కారాలు సమర్పిస్తుండగా చిరునవ్వుతో వాటిని స్వీకరించి సరాసరి ఉపమన్యు మహర్షి కుటీరంలోకి ప్రవేశించాడు కృష్ణుడు.

ఉపమన్యుమహర్షి కృష్ణుణ్ణి చూసి సంభ్రమాశ్చర్యాలకి లోనై ఆయనకి ఉచితాసనాన్నిసమర్పించి కుశల ప్రశ్నలు వేశాడు. "ప్రభూ! శ్రీకృష్ణా! ఇంద్రియాలకి గోచరం కానివాడివి, పరమయోగులకి సైతం కలలో కూడా కానరానివాడివి అయిన పరమాత్మవి, పరబ్రహ్మవి ఇలా నా ఆశ్రమానికి రావటం నాకెంతో ఆనందాన్ని ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. స్వామీ! తమరి రాకకి కారణం తెలుసుకోవచ్చా! అని వినయంగా అడిగాడు ఉపమన్యుడు.

పరమయోగీశ్వరుడైన ఉపమన్యుడికి నమస్కరించి, యోగశ్రేష్ఠుడైన కృష్ణుడు "మహాత్మా! నేను కరి చర్మధారి అయిన శంకరుణ్ణి దర్శించాలి

అకుంటున్నాను. నీవు భగవంతుడి దర్శనం చేయించగల సమర్థుడివి. నేను ఏం చేస్తే పరమేశ్వరుణ్ణి చూడగలను" అని అడిగాడు. స్వామీ! పరమేశ్వరుడు తీవ్రమైన భక్తితో కూడిన తపస్సు చేయటం వల్లనే దర్శనమిస్తాడు. కనుక నీవు ఈ ఆశ్రమంలో ఆయనకోసం తపస్సుచేయి. ఇక్కడ బ్రహ్మావాదులైన ఎంతో మంది మునులు శివుడి గురించి తపస్సు చేస్తుంటారు.

**ఉపమన్యుడి ఆశ్రమం :** పరమయోగి అయిన వశిష్ఠ మహర్షి ఈ ఆశ్రమంలోనే పూర్వం రుద్రుడి గురించి కఠోరమైన తపస్సు చేసి యోగవిద్యను సాధించాడు. ఇక్కడే కృష్ణ ద్వైపాయనుడైన వ్యాసుడు స్వయంగా తపస్సు చేసి పరమేశ్వర సాక్షాత్కారం పొంది ఆయన ద్వారా ఈశ్వర జ్ఞానాన్ని పొందాడు. పరమేశ్వరుడికి ప్రీతిపాత్రమైన ఈ ఆశ్రమంలోనే ఎంతోమంది పండితులు పుత్ర సంతానాన్ని పొందారు. ఇక్కడ దేవతలు మహాదేవి అయిన పార్వతిని స్తోత్రంచేస్తూ మహాదేవుణ్ణి కీర్తిస్తూ అమితమైన ఆనందాన్ని పొందుతున్నారు. గొప్పతపస్సంపన్నుడైన సావర్ణి మనువు ఇక్కడే తాను రచించిన సంహితని లోకానికి సమర్పించాడు. పురుషోత్తమా! ఈ దివ్య ప్రదేశంలోనే శాంశపాయనుడు మహాదేవుణ్ణి దర్శించి ఆయన ఆజ్ఞతో పన్నెండువేల శ్లోకాలు కలిగిన పురాణ సంహితని రచించాడు. వేద సమ్మితమైనది, మహాపుణ్యాన్ని కలిగించే వాయవీయపురాణం, పదహారువేల శ్లోకాల ఉత్తర భాగం ఇక్కడే ప్రవర్తితమైంది.

మహాయోగి యాజ్ఞవల్క్య మహర్షి ఇక్కడే తపస్సుచేసి పరమేశ్వరుడి అనుగ్రహంతో అత్యుత్తమమైన యోగశాస్త్ర గ్రంథాన్ని రచించాడు. పూర్వం భృగుమహర్షి కూడా ఈ ఆశ్రమంలోనే తపస్సుచేసి పరమేశ్వరుడి అనుగ్రహంతో యోగుల్లో గొప్పవాడైన పుత్రుణ్ణి వరంగా పొందాడు. కనుక ఓ పరంధామా! నీవు ఇక్కడే ఎంతో కఠినంగా తపస్సుచేసి ఉగ్రుడు, భయంకరుడు అయిన పరమేశ్వరుణ్ణి దర్శించు" అని ప్రబోధించి, కృష్ణుడికి జ్ఞానాన్ని, నియమాన్ని, పాశుపత యోగాన్ని ఉపదేశించాడు ఉపమన్యువు.

**శ్రీకృష్ణుడి తపస్సు :** ఆ విధంగా ఉపమన్యువు ద్వారా పాశుపతదీక్షని స్వీకరించిన కృష్ణుడు కేశ ఖండనం చేయించుకుని, నార వస్త్రాలు ధరించి, శరీరమంతా భస్మాన్ని పూసుకుని, రుద్రాక్షలు మెళ్ళో వేసుకుని, నిశ్చలంగా, శంకరుడి మీదే మనసు లగ్నంచేసి, కఠోరదీక్షతో తపస్సు చేయటం ప్రారంభించాడు. అలా కొంతకాలం గడిచాక ఒక శుభముహూర్తంలో చంద్రరేఖను ధరించి పార్వతీదేవితో సహా ఆకాశమార్గంలో నిలబడి కృష్ణుడికి దర్శనమిచ్చాడు శంకరుడు.

## శివ స్వరూపం

కిరీటినం గదినం చిత్రమాలం పినాకినం శూలినం దేవదేవమ్ ।
శార్దూలచర్మామ్బరసంవృతాఙ్గం దేవ్యా మహాదేవ మసౌ దదర్శ ॥ 1
ప్రభుం పురాణం పురుషం పురస్తా త్సనాతనం యోగిన మీశితారమ్ ।
అణోరణీయాంస మనన్తశక్తిం ప్రాణేశ్వరం శమ్భు మసౌ దదర్శ ॥ 2
పరశ్వధాసక్తకరం త్రినేత్రం నృసింహచర్మావృత భస్మగాత్రమ్ ।
సముద్గిరన్తం ప్రణవం బృహన్తం సహస్రసూర్యప్రతిమం దదర్శ ॥ 3
న యస్య దేవా పితామహోఽపి నేన్ద్రో న చాగ్నిర్వరుణో న మృత్యుః ।
ప్రభావ మద్యాపి వదన్తి రుద్రం త మాదిదేవం పురతోదదర్శ ॥ 4
తదా న్వపశ్య ద్గిరిశస్య వమే స్వాత్మాన మవ్యక్త మనన్తరూపమ్ ।
స్తువన్త మీశం బహుభి ర్వచోభిః శఙ్ఖాసిచక్రాన్వితహస్త మాద్యమ్ ॥ 5
కృతాఞ్జలిం దక్షిణతః సురేశం హంసాధిరూఢం పురుషం దదర్శ ।
స్తువాన మీశస్య పరం ప్రభావం పితామహం లోకగురుం దివిస్థమ్ ॥ 6
గణేశ్వరానర్క సహస్రకల్పా న్నన్దీశ్వరాదీ నమితప్రభావాన్ ।
త్రిలోకభర్తుః పురతోఽన్వపశ్య త్కుమారమగ్ని ప్రతిమం గణేశమ్ ॥ 7
మరీచిమత్రిం పులహం పులస్త్యం ప్రచేతసం దక్ష మథాపి కణ్వమ్ ।
పరాశరం తత్పరతో వసిష్ఠం స్వాయమ్భువం చాపి మనుం దదర్శ ॥ 8

కృష్ణుడికి దర్శనమిచ్చిన శివస్వరూపం ఇంకా ఎలా ఉందంటే! కిరీటాన్ని గదని ధరించినవాడు, చిత్రమైన మాలని, పినాకమనే ధనస్సుని, శూలాన్ని, పూల చర్మంతో కూడిన వస్త్రాన్ని ధరించినవాడు, దేవతలకు దేవుడు, అందరికీ ప్రభువు, పురాణ పురుషుడు, సనాతనుడు, యోగి, అణువు కన్నా పరమాణువైనవాడు, అనంతమైన శక్తి కలిగినవాడు, సకల ప్రాణులకీ అధిపతి, గండ్రగొడ్డలి ధరించినవాడు, మూడు కళ్ళతో ప్రకాశించేవాడు, భస్మశరీరుడు, ఓంకార నాదాన్ని చేసేవాడు, వేయిసూర్యుల కాంతితో వెలిగిపోయేవాడు, బృహద్రూపుడు, ఇంద్రాది దేవతలకి సైతం బోధపడనివాడు, మృత్యువుకి కూడా అందనివాడు అయిన పరమేశ్వరుణ్ణి దర్శించాడు.

అలాంటి పరమేశ్వరుడి ఎడమ భాగంలో, శంఖ చక్ర గదా ఖడ్గాల్ని ధరించి పరమేశ్వరుణ్ణి స్తుతిస్తున్న తన విష్ణురూపాన్ని కృష్ణుడు చూసాడు. ఆయనకి కుడివైపు అంజలి పట్టి నిల్చున్న దేవేంద్రుణ్ణి దర్శించాడు. అక్కడే హంసవాహనం మీద కూర్చున్న పితామహుడు బ్రహ్మదేవుణ్ణి, ప్రకాశించే గణేశ్వరుల్ని, నంది, కుమారస్వామి, గణపతిని శివుడి ముందు చూసాడు. అలాగే మరీచి, అత్రి, పులహ, పులస్త్య, ప్రచేతస, దక్ష, కణ్వ, పరాశర, వశిష్ఠాది మహర్షుల్ని, స్వాయంభువ మనువుని కూడా దర్శించాడు. అంతమంది మహాత్ములతో తనకు దర్శనమిచ్చిన శంకరుణ్ణి ఆనందంగా శ్రీకృష్ణుడు ఇలా స్తుతించాడు.

## కృష్ణుడు చేసిన శంకరస్తుతి

నమోస్తుతే శాశ్వత సర్వయోగ బ్రహ్మోదయస్త్వా మృషయో వదన్తి ।
తమశ్చ సత్త్వఞ్చ రజస్త్రయం చ త్వామేవ సర్వం ప్రవదన్తి సన్తః ॥ 1

త్వం బ్రహ్మ హరి రథ రుద్ర విశ్వకర్తా సంహర్తా దినకరమణ్డలాధివాస ।
ప్రాణ స్త్వం హుతవహ వాసవాదిభేద స్త్వా మేకం శరణముపైమి దేవ మేకమ్ ॥2

సాఙ్ఖ్యా స్త్వా మగుణ మథాహురేకరూపం యోగస్థం సతత ముపాసతే హృదిస్థమ్ ।
వేదాస్త్వామభి దధతీహ రుద్రమీడ్యం త్వామేకం శరణముపైమి దేవమీశమ్ ॥ 3

త్వత్పాదే కుసుమ మథాపి పత్ర మేకం దత్వాసౌ భవతి విముక్తవిశ్వబన్ధః।
సర్వాద్యం ప్రణదతి సిద్ధయోగిజుష్టం స్మృత్వా తే పదయుగలం భవత్ప్రసాదాత్ ॥ 4

యస్యా శేషవిభాగహీన మమలం హృద్యన్తరావస్థితం ।
తే త్వాం యోని మనన్త మేకమచలం సత్యం పరం సర్వగమ్ ॥ 5

స్థానం ప్రాహు రనాదిమధ్యనిధనం యస్మాదిదం జాయతే ।
నిత్యం త్వాహముపైమి సత్యవిభవం విశ్వేశ్వరం తం శివమ్ ॥ 6

ఓం నమో నీలకణ్ఠాయ త్రినేత్రాయ చ రంహసే ।
మహాదేవాయ తే నిత్య మీశానాయ నమోనమః ॥ 7

నమః పినాకినే తుభ్యం నమో ముణ్డాయ దణ్డినే ।
నమస్తే వజ్రహస్తాయ దిగ్వస్త్రాయ కపర్దినే ॥ 8

నమో భైరవనాదాయ కాలరూపాయ దంష్ట్రిణే ।
నాగయజ్ఞోపవీతాయ నమస్తే వహ్నిరేతసే ॥ 9

నమోఽస్తుతే గిరీశాయ స్వాహాకారాయ తే నమః ।
నమో ముక్తాట్టహసాయ భీమాయ చ నమోనమః ॥ 10

నమస్తే కామనాశాయ నమః కాలప్రమాథినే ।
నమో భైరవవేషాయ హరాయచ నిషఙ్గిణే ॥ 11

నమోఽస్తుతే త్ర్యమ్బకాయ నమస్తే కృత్తివాససే ।
నమోఽమ్బికాధిపతయే పశూనాం పతయే నమః ॥ 12

నమస్తే వ్యోమరూపాయ వ్యోమాధిపతయే నమః ।
నరనారీశరీరాయ సాంఖ్యయోగ ప్రవర్తినే ॥ 13

నమో భైరవనాథాయ దేవానుగత లిఙ్గినే ।
కుమారగురవే తుభ్యం దేవదేవాయ తే నమః ॥ 14

నమో యజ్ఞాధిపతయే నమస్తే బ్రహ్మచారిణే ।
మృగవ్యాధాయ మహతే బ్రహ్మాధిపతయే నమః ॥ 15

నమో హంసాయ విశ్వాయ మోహనాయ నమోనమః ।
యోగినే యోగగమ్యాయ యోగమాయాయ తే నమః ॥ 16

నమస్తే ప్రాణపాలాయ ఘణ్టానాదప్రియాయ చ ।
కపాలినే నమస్తుభ్యం జ్యోతిషాం పతయే నమః ॥ 17

నమోనమోఽస్తుతే తుభ్యం భూయ ఏవ నమోనమః ।
మహ్యం సర్వాత్మనా కామాన్ ప్రయచ్ఛ పరమేశ్వర ॥ 18

*(శ్లో॥60-76,అధ్యా-25)*

"రుద్రా! నీవు బ్రహ్మవు, శ్రీహరివి, లయకారకుడివి, సూర్యమండలాన్ని అధిష్టించినవాడివి, ప్రాణ స్వరూపుడివి, అగ్ని, ఇంద్రుడు ఇలా పలు రూపాలతో కనిపించే నీకు నమస్కారం. నీలకంఠుడు, త్రినేత్రుడు, వేగవంతుడు, మహాదేవుడు అయిన నీకు నమస్కారం. భైరవ గణాలకి అధిపతివి. దేవతలచేత పూజించబడే లింగస్వరూపుడివి. కుమారస్వామికి, గణపతికి తండ్రివి కపాలధారివి. ఓ శంకరా! నీకు మళ్ళీ మళ్ళీ నమస్కరిస్తున్నాను. నన్ను అనుగ్రహించు" అని శ్రీకృష్ణుడు పార్వతీ పరమేశ్వరుల్ని ప్రార్థించి వారికి పాదనమస్కారం చేసాడు.

శంకరుడు ఎంతో ప్రేమతో కృష్ణుణ్ణి పైకిలేపి మేఘగంభీరధ్వనితో, కృష్ణా! నీవే స్వయంగా అందరి కోరికలూ తీర్చేవాడివి కదా! ఎందుకోసం తపస్సు చేస్తున్నావు? నీవు సాక్షాత్తు నారాయణుడివి. నీవు లేకుండా ఈ జగత్తే నడవదు. కేశవా! నీవెవరో నీకు జ్ఞాపకం రావటం లేదా! నిన్ను నీవు అనంతుడిగా అప్రమేయుడిగా తెలుసుకో!" అని పలికాడు.

శివుడి మాటలు విన్న కృష్ణుడు చిరునవ్వుతో ఆ ఆదిదంపతుల్ని చూసి నమస్కరించి "శంకరా! నీ వల్లనే తీరే ఒక కోరికని అడుగుతున్నాను. అందుకోసమే నేనీ తపస్సుచేసాడు" నాకు నాతో సమానుడు, పరమ శివభక్తుడు అయిన కుమారుణ్ణి అనుగ్రహించు. ఇదే నాకు కావలసిన వరం" అని అడిగాడు. శివుడు సంతోషించి తథాస్తు అని అనుగ్రహించి ప్రేమగా కృష్ణుణ్ణి ఒక్కసారి ఆలింగనం చేసుకున్నాడు.

పరమేశ్వరుడి అర్ధాంగి పార్వతీదేవి కృష్ణుడితో ఇలా అంది" అచ్యుతా! నీవు పరమశివభక్తుడివే కాదు. నా భక్తుడివి కూడా అని గ్రహించాను. నీవు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడివే. పూర్వం దేవతల చేత ప్రార్థించబడి దేవకీ దేవికి పుత్రుడుగా జన్మించావు. ఇప్పుడు నీ ఆత్మలో మనిద్దరికీ భేదంలేదు. విజ్ఞులైన వారంతా నిన్ను నన్ను ఒక్కటిగానే భావిస్తారు. శ్రీకృష్ణా! నీకిష్టమైన వరాలు కోరుకో అని పలికింది. అందుకు సంతోషించిన కృష్ణుడు పార్వతీ పరమేశ్వరుల మీద అనన్యమైన భక్తి స్థిరంగా ఉండేలా వరాన్ని కోరుకున్నాడు.

కృష్ణుడి శివభక్తికి మెచ్చిన శంకరుడు ఆయన్ని వెంటబెట్టుకుని ఆకాశ మార్గంలో కైలాసానికి తీసుకువెళ్ళాడు. ఆ విధంగా కైలాసాన్ని చేరిన కృష్ణుణ్ణి దేవతలందరూ శంకరుణ్ణి పూజించిన విధంగానే పూజించసాగారు. శ్రీకృష్ణుడి అందచందాలు చూసి కైలాసానికి వచ్చిన దేవకాంతలు, అప్సరసలు, గంధర్వకాంతలు ఎంతో మోహాన్ని పొందారు. ఇలా కృష్ణుడు ఎంతో కాలం శివుడితో కలిసి కైలాసగిరి మీద విహరించాడు.

ఇక్కడ ద్వారకానగరంలో కృష్ణుడు కనిపించి చాలాకాలం గడిచిపోవటంతో అందరూ ఎంతో భయపడ్డారు. అప్పుడు గరుత్మంతుడు కృష్ణుణ్ణి వెతుకుతూ హిమాలయాలకి వచ్చాడు. అక్కడున్న ఉపమన్యు మహర్షి ఆశ్రమానికి వెళ్ళి చూడగా అక్కడ కృష్ణుడు కనిపించలేదు. చేసేదేంలేక ఆయనకి నమస్కరించి ద్వారకా పట్టణానికి తిరిగి వచ్చాడు. అదే సమయంలో కృష్ణుడు ద్వారకలో లేడన్న విషయం గ్రహించి భయంకరులైన రాక్షసులు నగరం మీదకి దాడిచేసారు. వారందర్నీ అమిత బలపరాక్రమవంతుడైన గరుత్మంతుడు ఎదుర్కొని వాళ్ళందర్నీ సంహరించి, ద్వారకానగరాన్ని కాపాడాడు. కొద్దికాలం గడిచాక నారదమహర్షి కైలాసంలో విహరిస్తున్న కృష్ణుణ్ణి దర్శించి సరాసరి ద్వారకా నగరానికొచ్చాడు. అప్పుడు ద్వారకా ప్రజలు ఎంతో ఆత్రంగా దేవర్షీ! మా కృష్ణుడు ఎక్కడున్నాడు? అని ప్రశ్నించగా "ప్రజలారా! భగవంతుడైన కృష్ణుడు కైలాసశిఖరం మీద ఆనందంగా విహరిస్తున్నాడు. నేనాయన్ని చూసే ఇక్కడికొస్తున్నానని" చెప్పాడు.

నారదుడి మాట విన్న వెంటనే గరుత్మంతుడు ఆగమేఘాల మీద కైలాసగిరిని చేరుకున్నాడు. అక్కడ నవరత్నాలతో అలంకరించబడ్డ దివ్య సింహాసనంలో పరమేశ్వరుడి పక్కనే కూర్చుని దర్శనమిచ్చాడు కృష్ణుడు. గరుత్మంతుడు లోపలికి వెళ్ళి పరమేశ్వరుడికి నమస్కరించి, పక్కనే కృష్ణుడి దగ్గరకి వెళ్ళి ఆయనతో ద్వారకాపుర ప్రజలు చెందుతున్న ఆందోళన గురించి వివరించాడు. అది విన్న కృష్ణుడు పార్వతీ పరమేశ్వరుల దగ్గర అనుమతి తీసుకుని తిరిగి ద్వారకకి వచ్చాడు.

ద్వారకా నగరం కృష్ణుడి రాకతో కళకళ లాడింది. ప్రజలంతా ఆయనకి మంగళహారతులు పట్టారు. స్వాగతగీతాలాలపించారు. జయ జయ ధ్వానాలు చేసారు. ఆనందంలో మరి కొందరు నృత్యాలు చేసారు. కొంతకాలానికి పార్వతీ పరమేశ్వరుల అనుగ్రహంతో శ్రీకృష్ణుడికి సాంబుడనే పుత్రుడు జన్మించాడు. జాంబవతికి జన్మించిన సాంబుడు శ్రీకృష్ణుడితో సమానమైనవాడు. పరమేశ్వరుడు భక్తుడుగా విఖ్యాతి పొందాడు.

## వారణాసీ మాహాత్మ్యం

ఒకనాడు నారాయణాంశ సంభూతుడైన వ్యాస మహర్షి తన శిష్య పరివారంతో కలిసి అతిముక్త క్షేత్రంగా ప్రసిద్ధి చెందిన వారణాసి క్షేత్రానికి వచ్చాడు. అక్కడి గంగానదిలో స్నానంచేసి విశ్వేశ్వరుణ్ణి పూజించాడు. వ్యాసమహర్షి వారణాసికి వచ్చాడని తెలుసుకున్న అక్కడి మునులు ఆయన దగ్గరకొచ్చి ఎంతో గౌరవంగా పూజించారు. వారంతా ఓ వ్యాసమహర్షీ! కొంతమంది దానాన్ని, మరికొంతమంది అహింసని, వేదాధ్యయనాన్ని, ఇంద్రియ నిగ్రహాన్ని ఉత్తమ ధర్మంగా చెబుతారు. ఇంకొందరు తీర్థయాత్ర చేయటమే ఉత్తమ ధర్మమంటారు? వీటిలో ఏది ఆచరణ సాధ్యం? దయచేసి మాకు చెప్పండి అని ప్రార్థించారు.

ఋషుల ప్రార్థన విన్న వ్యాసుడు వారితో "ముని పుంగవులారా! పూర్వం ఇదే విషయాన్ని పార్వతీదేవి పరమేశ్వరుణ్ణి అడగగా ఆయన యుక్తమైన

సమాధానాన్ని చెప్పాడు. అదే మీకు నేను చెబుతాను. ఒకనాడు పార్వతీదేవి శివుణ్ణి చేరి "నాథా! లోకంలో మానవులు నిన్ను సులభంగా ఎలా దర్శించగలరు? సాంఖ్యయోగం, తపస్సు, ధ్యానం ఇలాంటివన్నీ కష్టసాధ్యాలు కదా! ఇవికాక వేరే ఇతర ఉపాయాలున్నాయా? అని అడిగింది. అప్పుడాయన దేవీ! నన్ను దర్శించే మార్గాల్లో సులభమైనది తీర్థయాత్ర. భూలోకంలో నేను శాశ్వతంగా కొలువుండే అవిముక్త వారణాసీక్షేత్రాన్ని దర్శించిన వాడికి నేను ముక్తిని ప్రసాదిస్తాను" అని వారణాసీ మాహాత్మ్యం గురించి ఇలా చెప్పటం ప్రారంభించాడు.

వారణాసీ క్షేత్రం మహిమాన్విత దివ్యక్షేత్రం. ఇది పరమేశ్వరుడి నివాస స్థానం. సకల ప్రాణుల్నీ సంసార తాపాల నుంచి ఈ తీర్థం రక్షిస్తుంది. దేవీ! నా భక్తులు వారణాసిలో గొప్ప వ్రతాన్ని, నియమాన్ని పాటిస్తూ జీవిస్తున్నారు. సకల తీర్థాల కన్నా గొప్పది, ఉత్తమమైనది, జ్ఞానాల్లో ఉత్తమజ్ఞానప్రదాయకమైనది ఈ అవిముక్త క్షేత్రం. ఇదంటే నాకు చాలా ఇష్టం. భూలోకంలో ఉన్న ఎన్నో దివ్య తీర్థాలు, పుణ్యస్థలాలు, ఆకాశంలో ఉన్నవి, భూలోకంలో ఉన్నవి అన్నీ వారణాసిలో ఉన్నాయి. ఈ క్షేత్రం శ్మశాన రూపమైనది. అందుకే దీన్ని మహాశ్మశానం అని కూడా అంటారు.

దేవీ! ఈ అవిముక్త క్షేత్రంలోనే నేను కాలస్వరూపుడిగా ఉండి ప్రళయం సంభవించినప్పుడు అన్నిలోకాల్నీ లయం చేస్తుంటాను. ఈ దివ్య స్థలం అన్ని తత్త్వాలకీ ఆధారం. నా భక్తులు ఎక్కడికి వెళ్ళినా చివరికి నన్నే చేరుకుంటారు.

దత్తం జప్తం హుతం చేష్టం తపస్తవం కృతం చయత్ ।
ధ్యానమధ్యయనం జ్ఞాన సర్వం తత్రాక్షయం భవేత్ ॥
జన్మాంతరసహస్రేషు యత్పాపం పూర్వ సంచితమ్ ।
అవిముక్తే ప్రవిష్టస్య తత్సర్వం వ్రజతిక్షయమ్ ॥

*(శ్లో॥29-30, అధ్యా-31)*

పుణ్యప్రదమైన వారణాసిలో చేసిన దానం, జపం, హోమం, తపస్సు, ఇతరపుణ్యకర్మలు, చదువు, విజ్ఞానం అన్నీ నాశరహితాలై ఉంటాయి. పూర్వం

వేల జన్మల్లో చేసిన పాపాలన్నీ అవిముక్త క్షేత్రంలోకి ప్రవేశించినవారికి పూర్తిగా నశించి పోతాయి.

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, వర్ణ సంకరం ద్వారా పుట్టినవారు, స్త్రీలు, మ్లేచ్ఛులు ఇతర జాతీయులు, పాపాత్ములు, క్రిమికీటకాలు, పక్షులు, మృగాలు ఈ అవిముక్త క్షేత్రంలో ప్రాణాలు విడిచి పెట్టగానే వారు నా దివ్యలోకాన్ని చేరుకుంటారు. పవిత్రమైన వారణాసిలో ఎంతటి పాపాత్ముడు మరణించినా అతడు నరకానికి వెళ్ళడు. అక్కడ మరణించిన వారందరికీ ఈశ్వరానుగ్రహం ఉంటుంది.

మోక్షం ఎంతో కష్టమైనదని, సంసార దుఃఖం చాలా భయంకరమైనదని తెలుసుకున్న మానవుడు, తన కాళ్ళని ఖండించుకొనైనా సరే వారణాసిలోనే నివసించాలి. దేవీ! లోకంలో అందరికీ తపస్సుచేయటం సాధ్యపడదు. చేయలేరు కూడా. అలాంటి వారిని తరింపచేసేదే ఈ కాశీపట్టణం. నా అనుగ్రహం ఉన్నవారే ఈ రహస్యాన్ని తెలుసుకోగలరు. పండితులు కానివారు, నా మాయలో చిక్కుకున్నవారు ఈ సత్యాన్ని తెలుసుకోలేరు. తమోగుణంతో నిండిన అజ్ఞానులు నా అవిముక్త క్షేత్రాన్ని దర్శించలేరు. అలాంటి పాపాత్ములు మలమూత్రాలతో కూడిన జన్మ పరంపరలో చిక్కుకుంటారు.

దేవీ! ఎవడైతే ఎన్నో ఆటంకాలు సంభవించినప్పటికీ వాటన్నిటినీ అధిగమించి వారణాసిని చేరుకుంటాడో అలాంటివాడు దుఃఖమన్నదే లేని పరమపదాన్ని చేరుకుంటాడు. జరామరణ వ్యాధుల బాధలే లేని శివసాయుజ్యాన్ని పొందుతాడు. పాండిత్యం చేత, దానం చేతా, తపోయజ్ఞాల చేతా లభించని ముక్తి, అవిముక్త క్షేత్రంలో నివసించటం వల్ల లభిస్తుంది. రోగులకి, పాపులకి, బాధితులకి, శాపగ్రస్తులకి,కర్మపీడితులకీ గమ్యస్థానం వారణాసి. అవిముక్త క్షేత్రం గొప్ప జ్ఞానరూపమైనదే కాదు. తత్త్వస్వరూపమైనది కూడా.

దేవీ! ఎవరైతే నిష్ఠగా దీక్ష వహించి ఈ అవిముక్త క్షేత్రంలో నివసిస్తారో వారికి గొప్పదైన ఆత్మజ్ఞానాన్ని కలిగించి వారికి మోక్షాన్ని ప్రసాదిస్తాను.

ప్రయాగ క్షేత్రం, నైమిశారణ్యం, శ్రీశైలం, హిమాలయం, కేదారం, భద్రకర్ణం, గయ, పుష్కరం, కురుక్షేత్రం, రుద్రకోటి నర్మదానది, హాటకేశ్వరం, శాలగ్రామం, పుష్పాగ్రం, వంశం, కోకాముఖక్షేత్రం, ప్రభాస తీర్థం అనేవి ముల్లోకాల్లో ప్రసిద్ధి పొందిన దివ్యక్షేత్రాలు. కాశీలో మరణించినవారు మోక్షాన్ని పొందిన విధంగానే పై క్షేత్రాల్లో మరణించిన వారు కూడా మోక్షాన్ని పొందుతారు.

వారణాసి దివ్యక్షేత్రంలో మూడు మార్గాల్లో ప్రవహించే గంగానది ఉంది. ఆ గంగలో స్నానం చేసిన వారికి పూర్వజన్మ పాపాలన్నీ నశించిపోతాయి. గంగాతీరంలో జపం, తపం, శ్రాద్ధం విశేషంగా పుణ్యప్రదాలు. విశేషంగా వారణాసి దివ్యక్షేత్రంలో నివసించే మానవుడు పాపాత్ముడైనప్పటికీ, అధర్మపరుడైనప్పటికీ తనతోపాటు మూడు వంశాల వారిని తరింపచేస్తాడు. ఎవరైతే వారణాసిలో వున్న మహాదేవుణ్ణి స్తుతిస్తారో, పూజిస్తారో వారు సాక్షాత్తు గణేశ్వరులవుతారు. వారణాసిలో నివసించినవారికి ఒక్క జన్మలోనే మోక్షం సిద్ధిస్తుంది. అవిముక్త క్షేత్రం చేరినవాడు మరో తపోవనానికి వెళ్ళనవసరం లేదు. దేవీ! నా చేత ఎప్పటికీ విడవబడనది కాబట్టే దానికి అవిముక్త క్షేత్రం అనే పేరు వచ్చింది.

ఏవి అవిముక్త స్థలాలుగా దేవతలతో చెప్పబడ్డాయో! వాటన్నిటికన్నా వారణాసి క్షేత్రం గొప్పది. ఎందుకంటే అక్కడ సాక్షాత్తు మహాదేవుడనై నేనే స్వయంగా నివసిస్తున్నాను.

వ్యాచష్టేతారకం బ్రహ్మతద్దైవ హ్యావిముక్తకం ।
యత్తత్పరతరం తత్త్వమవిముక్త మితిస్మృతమ్ ॥

*(శ్లో॥61,అధ్యా-31)*

శరీరం పతనమైపోయాక నాశరహితమైన ఏ దివ్యక్షేత్రంలో జీవుడికి ఈశ్వరుడు తారక మంత్రాన్ని ఉపదేశిస్తాడో అలాంటి అవిముక్త క్షేత్రం అన్నిటికన్నా ఉత్తమమైనదని చెప్పబడుతోంది.

కనుబొమల మధ్యలో, నాభి మధ్య భాగంలో, హృదయంలో, శిరస్సు మీద, సూర్యమండలంలో ఉన్న విధంగానే అవిముక్త క్షేత్రంలో కూడా పరతత్త్వం

నిలిచి వుంది. 'వరుణ' 'అసి' అనే రెండు నదుల మధ్య వారణాసి పట్టణముంది. వారణాసి కన్నా గొప్పక్షేత్రం ఇంతకు ముందులేదు. ఇకపై ఉండబోదు.

భగవంతుడైన నారాయణుడితో పాటు యక్షులు, గంధర్వులు, నాగులు, రాక్షసులు, తదితర దేవతలందరూ నన్ను ఎప్పుడూ సేవిస్తుంటారు. దేవదేవుడైన పితామహుడు బ్రహ్మ కూడా అక్కడ నివసిస్తున్నాడు. వారణాసీ క్షేత్రం పరమ పవిత్రమైనది. అందువల్ల అక్కడ శరీరంతో కానీ, మనసుతోకానీ, మాటతో కానీ పాపం చేయకూడదు.

యథానారాయణః శ్రేష్ఠో దేవానాం పురుషోత్తమః ।
యథేశ్వరాణాం గిరిశః స్థానానాం చైతదుత్తమమ్ ॥

*(శ్లో॥ 71, అధ్యా-31)*

దేవతలందరిలో పురషోత్తముడైన నారాయణుడు ఎలా గొప్పవాడో, ప్రభువులందరిలోకీ పరమేశ్వరుడైన నేను ఎలా గొప్పవాడినో, అలాగే అన్ని స్థానాల కన్నా అవిముక్త క్షేత్రం ప్రశస్తమైనది. ఎవరైతే పూర్వజన్మలో రుద్రుణ్ణి అనగా నన్ను పూజిస్తారో, వారే నా దివ్యనివాసమైన అవిముక్త క్షేత్రమహిమని తెలుసుకుంటారు. ఎవరి బుద్ధి కలిప్రభావంతో కలుషితమై ఉంటుందో అలాంటివారు అవిముక్తాన్ని చూడలేరు. కాల స్వరూపుడైన పరమేశ్వరుణ్ణి నిరంతరం ధ్యానించేవారే ఈ వారణాసి నగరాన్ని చేరుకోగలరు.

దేవీ! ఈ నగరంలో నివసించేవారు చేసే పాపాలన్నిటినీ పరమేశ్వరుడనైన నేను నశింపచేస్తాను. మోక్షాన్ని కోరుకుని, నన్ను సేవించాలని ఈ క్షేత్రానికి వచ్చిన వారికి, వచ్చి ఇక్కడ మరణించిన వారికి తిరిగి జన్మ అనేదే లేదు. అందువల్ల అన్ని రకాల ప్రయత్నాలూ చేసి వారణాసిలో నివసించాలి.

ఋషులారా! ఈ విధంగా పరమేశ్వరుడు పార్వతీదేవికి తీర్థాలన్నిటిలోకీ ఉత్తమమైనది అవిముక్త క్షేత్రమని, ఆ క్షేత్రాన్ని దర్శించి అక్కడ నివసించినవాడికి కఠోరమైన నియమాలతో, యజ్ఞయాగాలతో, తపస్సులతో లభించేమోక్షం అనాయసంగా లభిస్తుందని తెలియచేసాడు" అని చెప్పి వ్యాసుడు వాళ్ళందరి సత్కారాలూ స్వీకరించి వారణాసి నగరంలో సంచారానికి బయలుదేరాడు.

# వ్యాసుడు దర్శించిన వారణాసి

**ఓంకార లింగం :** వ్యాసమహర్షి తన శిష్యులందరితో కలిసి ముందుగా ఓంకార లింగాన్ని దర్శించటానికి వెళ్ళాడు. పరమపవిత్రమైన ఓంకార లింగానికి అభిషేకం, అర్చన చేసి ఆ లింగమహాత్మ్యాన్ని తన శిష్యులకి ఇలా వివరించాడు.

ఇదం తద్విమలం లింగమోంకారం నామ శోభనమ్ ।
అస్యస్మరణ మాత్రేణ ముచ్యతే సర్వపాతకైః ॥ 1
అత్ర తత్పరమం జ్ఞానం పంచాయతన ముత్తమమ్ ।
అర్చితం మునిభిర్నిత్యం వారణాస్యాం విమోక్షణమ్ ॥ 2
అత్ర సాక్షాన్మహాదేవః పంచాయతన విగ్రహః ।
రమతే భగవాన్ రుద్రో జంతూనామపవర్గదః ॥ 3

*(శ్లో॥3-5,అధ్యా-32)*

నిర్మలమైన ఈ శివలింగం ఓంకారం అనే పేరుతో ఉంది. ఇది మంగళకరమైన లింగం. మానవుడు దీన్ని స్మరించటం చేతనే అన్ని పాపాలనుంచీ విముక్తి పొందుతాడు. ఇక్కడే పంచాయతన విగ్రహ రూపుడుగా పరమేశ్వరుడు, మహాదేవుడైన రుద్రుడు, జీవులకి మోక్షాన్నిస్తూ విహరిస్తుంటాడు. వారణాసిలో ఈ ఓంకార లింగం ఉన్నచోటు పరమపవిత్రమైనది. పరమజ్ఞానరూపం, మోక్షదాయకమైన ఈ ఓంకార లింగం, నిత్యం మునులచేత పూజించబడుతూ ఉంటుంది.

పశుపతికి సంబంధించిన జ్ఞానం ఏదైతే పంచార్థం అని చెప్పబడుతుందో, నిర్మలమైన ఆ లింగమే ఓంకార లింగంగా నెలకొంది. బ్రహ్మదేవుడు మొదలైన దేవతలకి ఆశ్రయభూతంగా ఉన్నది, ఓంకారం చేత ప్రతిపాదించబడుతున్న ఈ లింగమే పంచాయతన లింగంగా ఖ్యాతి పొందింది.

సంస్మరే ద్దైవేశ్వరం లింగం పంచాయతన ముత్తమమ్ ।
దేహంతే తత్పరం జ్యోతిరానందం విశతే పునః ॥

*(శ్లో॥9,అధ్యా-32)*

ఈశ్వర సంబంధమైనది, నాశన రహితమైనది అయిన ఈ పంచాయతన ఓంకార లింగాన్ని మానవుడు తన ప్రాణం పోయే సమయంలో స్మరించాలి. అలా చేస్తేనే తేజోరూపమైన అతడి ఆత్మ ఆనందరూపుడైన పరమాత్మలో విలీనమౌతుంది. ఈ ఓంకార క్షేత్రంలోనే పూర్వం దేవర్షులు, మహర్షులు, సిద్ధులు, బ్రహ్మర్షులు ఈశానదేవుడైన రుద్రుణ్ణి పూజించి ఉత్తమ గతుల్ని పొందారు. మత్స్యోదరి అనే నది ఒడ్డున ఎంతో రహస్యమైన ఈ ఓంకార క్షేత్రం నెలకొంది.

"శిష్యులారా! పవిత్రమైన ఈ ఓంకారేశ్వర లింగాన్ని, అలాగే మధ్యమేశ్వర లింగాన్ని, కపర్ధీశ్వరలింగాన్ని తప్పకుండా అందరూ దర్శించాలి. వారణాసిలో ఉన్న ఈ లింగాలన్నీ ఎంతో రహస్యమైనవి. శివుడి అనుగ్రహం లేకుండా వీటిని ఎవరూ చూడలేరు" అని చెప్పి వ్యాస మహర్షి కృత్తివాసేశ్వర లింగాన్ని దర్శించటానికి బయల్దేరాడు

**కృత్తివాసేశ్వర లింగం :** వ్యాసుడు కృత్తివాసేశ్వర శివలింగాన్ని దర్శించి స్వామికి అభిషేకార్చనలు ఘనంగా జరిపాడు. తరువాత తన శిష్యులందరికీ కృత్తివాసేశ్వరుడి మహిమని ఇలా చెప్పటం ప్రారంభించాడు.

శిష్యులారా! పూర్వం ఒక రాక్షసుడు ఏనుగు రూపాన్ని ధరించి, ఆ ప్రాంతంలోనే సంచరించేవాడు. నిత్యం ఇక్కడ శివపూజ చేసుకోవటానికి వచ్చే బ్రాహ్మణుల్ని చంపటం ప్రారంభించాడు. అప్పుడు శివుడు బ్రాహ్మణులందర్నీ కాపాడటం కోసం ఈ లింగం నుంచి ఆవిర్భవించి, గజరూపంలో ఉన్న ఆ రాక్షసుణ్ణి తన శూలంతో వధించాడు. తరువాత ఆ ఏనుగు చర్మాన్నే తనకి వస్త్రంగా చేసుకున్నాడు. అందుకే ఆయనకి కృత్తివాసేశ్వరుడనే పేరు వచ్చింది.

ఇక్కడ పూర్వం ఎందరో మునులు తపస్సుచేసి సిద్ధి పొందారు. సశరీరంగా పరమపదాన్ని చేరుకున్నారు. విద్య – అవిద్యలకి ఈశ్వరులైన శివరూపం ధరించిన రుద్రులు అందరూ ఈ కృత్తివాసేశ్వర లింగాన్ని ఎప్పుడూ

పరివేష్ఠించి ఉంటారు. కలియుగం అధర్మ పరమైందని గ్రహించిన జ్ఞానులు ఎప్పుడూ ఈ కృత్తివాసేశ్వరుణ్ణి విడిచి వెళ్ళరు.

జన్మాంతర సహస్రేణ మోక్షోఽన్యత్రాప్యతే నవా ।
ఏకేన జన్మనా మోక్షః కృత్తివాసేతు లభ్యతే ॥

*(శ్లో॥22,అధ్యా-32)*

ఇతర పుణ్యస్థలాల్లో వేలకొద్దీ జన్మలు ఎత్తినప్పటికీ మోక్షం లభిస్తుందో లేదో తెలీదు. కానీ, ఈ కృత్తివాస తీర్థంలో నివసించిన వారికి ఒక్క జన్మతోనే మోక్షం లభిస్తుంది. ఈ స్థలం సమస్త సిద్ధులకీ నిలయం. నిరంతరం ఈ కృత్తివాస క్షేత్రాన్ని మహాదేవుడు రక్షిస్తూ ఉంటాడు. ప్రతియుగంలో ఇంద్రియనిగ్రహం కలిగిన వేద పండితులు శతరుద్రీయాన్ని పఠిస్తూ కృత్తివాసేశ్వరుణ్ణి పూజిస్తారు.

**కపర్దీశ్వర లింగం :** కృత్తివాసేశ్వరుణ్ణి దర్శించిన తరువాత వ్యాసముని శిష్యులతో కలిసి కపర్దీశ్వర లింగాన్ని దర్శించటానికి వెళ్ళాడు. ఆ లింగానికి సమీపంలో ఉన్న పిశాచమోచనం అనే తీర్థంలో స్నానం చేసి, పితృదేవతలకి తర్పణాలు విడిచి, అక్కడే కొలువైన కపర్దీశ్వరుణ్ణి పూజించాడు.

ఆ తీర్థం సమీపంలో వ్యాసుడి శిష్యులందరూ ఒక అద్భుతాన్ని దర్శించారు. కపర్దీశ్వర లింగం దగ్గర ఒక ఆడజింక ప్రదక్షిణాలు చేస్తోంది. అప్పుడొక పులి దాన్ని తిందామని అక్కడికి వచ్చింది. జింక పులిని చూసి తప్పించుకోవాలని పరుగెత్తబోయి పులి చేతికి చిక్కింది. చేత చిక్కిన జింకని ఆ వ్యాఘ్రం గోళ్ళతో చీల్చి చంపేసింది. ఈ దృశ్యాన్ని ఆశ్చర్యంగా చూస్తున్న మునులందర్నీ ఒక్కసారిగా చూసి కంగారుపడి ఆ జింకని వదిలేసి పారిపోయింది.

అప్పుడే ఒక అద్భుతం జరిగింది. కపర్దీశ్వర లింగం ముందు మరణించిన ఆ జింక వెంటనే ఆకాశంలో సూర్యుడిలా గొప్ప కాంతితో ప్రకాశించింది. ఆ జింక మూడు కళ్ళతో, నల్లని మెడతో, చంద్రకళతో కూడిన తలతో, ఒక వృషభాన్ని ఎక్కి అదే ఆకారంతో ఉన్న మరో పురుషుడితో కనిపించింది. అదే సమయంలో ఆకాశం నుంచి దేవతలు జింక మీద పూలవాన కురిపించారు. తరువాత జింక చుట్టూ వెలిగిన జ్వాల గణేశ్వర రూపాన్ని పొంది అదృశ్యమైంది.

అక్కడున్న మునులంతా ఈ అద్భుత దృశ్యాన్ని చూసి ఆశ్చర్యపోయారు. వెంటనే వ్యాసమహర్షి దగ్గరకొచ్చి "మహర్షీ! ఏమిటీ అద్భుతం. ఈకపర్ధీశ్వర స్వామి మాహాత్మ్యం ఏమిటి? దయచేసి వివరించండి" అని కోరాడు. వ్యాసుడు వారికి కపర్ధీశ్వర మహిమని ఇలా వివరించటం ప్రారంభించాడు.

శిష్యులారా! మునీశ్వరులారా! కపర్ధీశ్వర లింగం చాలా మహిమాన్వితమైనది. కపర్దీశ్వరుడి స్మరణతోనే సకల పాపాలూ నశిస్తాయి. కామక్రోధాది అరిషడ్వర్గాలు మానవుల్ని పట్టి పీడించవు. సమస్త విఘ్నాలూ కపర్ధీశ్వరుణ్ణి సేవించటంతోనే తొలగిపోతాయి. కనుక అందరూ కపర్దీశ్వరుణ్ణి దర్శించాలి.

ఇదందేవస్య తల్లింగం కపర్దీశ్వర ముత్తమమ్ ।
పూజతవ్యం ప్రయత్నేన స్తోతవ్యం వైదికైః స్తవైః ॥ 1
ధ్యాయతామత్ర నియతం యోగినాం శాస్త్ర వేతసాం ।
జాయతే యోగ సిద్ధిశ్చ షణ్మాసేనన సంశయః ॥ 2

*(శ్లో॥12-13,అధ్యా-33)*

ఈ ఉత్తమమైన కపర్దీశ్వర లింగం ప్రయత్న పూర్వకంగా పూజించ తగింది. వైదిక స్తోత్రాలతో ఈ స్వామిని నిత్యం అభిషేకించాలి. ప్రశాంతమైన చిత్తంతో ఏకాగ్రతతో ఈ లింగాన్ని ధ్యానించే యోగులకి కేవలం ఆరునెలల కాలంలోనే యోగసిద్ధి లభిస్తుంది. ఇందులో ఎలాంటి సందేహం లేదు.

బ్రహ్మహత్యాది పాపాని వినస్యస్తస్య పూజనాత్ ।
పిశాచమోచనే కుండే స్నాతస్యాత్ర సమీపతః ॥

*(శ్లో॥14,అధ్యా-32)*

**శంకుకర్ణ వృత్తాంతం :** కపర్దీశ్వర లింగాన్ని పూజించిన వారికి బ్రహ్మహత్యాది దోషాలు తొలగిపోతాయి. ఇక్కడే వున్న పిశాచమోచన తీర్థంలో స్నానం చేసినా పాపాలు నశిస్తాయి. పూర్వం ఈ క్షేత్రంలోనే శంకుకర్ణుడనే ప్రసిద్ధుడైన ముని నివసించి కపర్ధీశ్వరుణ్ణి పూజించాడు.

ఆయన నిత్యం రుద్ర స్వరూపమైన ఓంకారాన్ని జపిస్తూ పూలు పళ్ళతో స్వామిని అర్చించి నమస్కార ప్రదక్షిణాలు చేసేవాడు. ఆ విధంగా శంకుకర్ణుడు యోగసాధన చేస్తూ దీక్షగా అక్కడ నివసిస్తున్న సమయంలో, బాగా బక్కచిక్కిపోయి ఆకలితో అలమటిస్తున్న ఒక ప్రేతం వచ్చింది. ఆ ప్రేతాన్ని చూసి ఆయన ఎంతో జాలిపడ్డాడు. ప్రేమగా దానితో "ప్రేతమా నీవెవరు? ఎక్కణ్ణుంచి వచ్చావు? ఎందుకొచ్చావు? అని ప్రశ్నించాడు. అప్పుడా పిశాచం దీనంగా తన వృత్తాంతాన్నిలా చెప్పటం ప్రారంభించింది.

మహర్షీ! పూర్వం నేను ఎన్నో సంపదలు కలిగిన బ్రాహ్మణుణ్ణి. అయితే ధనమదంతో ఎవరికీ ఎలాంటి దానాలూ ధర్మాలూ చేయలేదు. అతిథుల్ని ఆదరించలేదు. ఏ ఒక్క పుణ్యకార్యాన్ని నేను చేయలేదు. అయితే ఒకనాడు నేను పవిత్రపుణ్యక్షేత్రమైన వారణాసికి వెళ్ళి వృషభవాహనుడైన విశ్వేశ్వరుణ్ని దర్శించి నమస్కరించి ఆయన్ని పూజించాను. తరువాత కొంతకాలం గడిచాక నాకు మరణం సంభవించింది. అయితే వారణాసి విశ్వేశ్వరుణ్ణి ఒక్కసారి పూజించిన కారణంగా నేను నరకానికి వెళ్ళలేదు.

మహాత్మా! నేను నరకానికి వెళ్ళనప్పటికీ చేసిన పాపాల ఫలితంగా పిశాచ రూపంలోనే ఇలా ఉండిపోయాను. దీనివల్ల నేను ఆకలితో అలమటిస్తూ, దాహంతో బాధపడుతూ దిక్కుతోచక తిరుగుతున్నాను. మహాత్మా! నాకీ పిశాచజన్మనుంచి విముక్తి కలిగించే మార్గాన్ని బోధించండి. మీరే నాకు దిక్కు అని శరణువేడుకున్నాడు. పిశాచం దీన చరిత్ర విన్న శంకుకర్ణుడికి మనసు చలించిపోయింది.

ఓ పిశాచమా! లోకంలో నీలాంటి గొప్పవాడు, పుణ్యాత్ముడు మరొకడు లేడు. ఎందుకంటే నీవు పూర్వజన్మలో ప్రపంచానికధీశ్వరుడైన పరమేశ్వరుణ్ణి స్వయంగా స్పృశించి, పూజించావు. అదీ వారణాసిలోని విశ్వేశ్వరుణ్ణి. పూర్వజన్మలో నీవు చేసిన ఆ పుణ్య ఫలితంగానే తిరిగి ఇదే క్షేత్రానికి వచ్చావు. నీకేం భయంలేదు. ప్రశాంతంగా కపర్దీశ్వరుణ్ణి స్మరించి ఈ పుష్కరిణిలో స్నానంచేయి. తత్ఫలితంగా నీకీ పిశాచ జన్మనుంచి విముక్తి కలుగుతుంది" అని ప్రబోధించాడు.

శంకుకర్ణుడి ఆదేశం ప్రకారం ఆ పిశాచం భక్తి శ్రద్ధలతో కపర్దీశ్వరుణ్ని స్మరిస్తూ పుష్కరిణిలో స్నానం చేశాడు. ఆశ్చర్యకరంగా ఆ పుష్కరిణిలో స్నానం చేయగానే పిశాచానికి పిశాచరూపం తొలగిపోయి, దివ్య శరీరం ప్రాప్తించింది. తనకీ దివ్యరూపం రావటానికి కారకుడైన శంకు కర్ణుడికి నమస్కరించి దేవతలు పంపిన దివ్య విమానంలో అతడు దివ్యలోకాలకి వెళ్ళిపోయాడు.

పిశాచ రూపం నుంచి ఆ అభాగ్యుడికి విముక్తి లభించినందుకు శంకుకర్ణుడికి ఎంతో ఆనందం కలిగింది. ఈ మహిమకి కారకుడైన కపర్దీశ్వరుణ్ణి ఇలా ఘనంగా కీర్తించాడు.

## కపర్దీశ్వర స్తుతి

నమామి నిత్యం పరతః పరస్తా ద్గోప్తార మేకం పురుషం పురాణమ్ ।
వ్రజామి యోగేశ్వర మీశితార మాదిత్య మగ్నిం కలిలాధిరూఢమ్ ॥ 1

త్వాం బ్రహ్మపారం హృది సన్నివిష్టం హిరణ్మయం యోగిన మాదిహీనమ్ ।
వ్రజామి రుద్రం శరణం దివిస్థం మహామునిం బ్రహ్మపరం పవిత్రమ్ ॥ 2

సహస్రపాదాక్షిశిరోఽభియుక్తం సహస్రబాహుం తమసః పరస్తాత్ ।
త్వాం బ్రహ్మపారం ప్రణమామి శమ్భుం హిరణ్యగర్భాధిపతిం త్రినేత్రమ్ ॥ 3

యతః ప్రసూతి ర్జగతో వినాశో యేనా హృతంసర్వమిదం శివేన ।
తం బ్రహ్మపారం భగవన్త మీశం ప్రణమ్య నిత్యం శరణం ప్రపద్యే ॥ 4

అలిఙ్గ మాలోకవిహీనరూపం స్వయంప్రభుం చిత్పతిమైకరూపమ్ ।
తం బ్రహ్మపారం పరమేశ్వరం త్వాం నమస్కరిష్యే న యతోఽన్యదస్తి ॥ 5

యం యోగిన స్త్యక్తసబీజయోగా ల్లబ్ధ్వా సమాధిం పరమాత్మభూతాః ।
పశ్యన్తి దేవం ప్రణతోఽస్మి నిత్యం తద్బ్రహ్మపారం భవతఃస్వరూపమ్ ॥ 6

న యత్ర నామాని విశేషతృప్తి ర్న సందృశే తిష్టతి యత్స్వరూపమ్ ।
తం బ్రహ్మపారం ప్రణతోఽస్మి నిత్యం స్వయం భువం త్వాం శరణం ప్రపద్యే ॥ 7

యద్వేద వేదాభిరతావిదేహం సబ్రహ్మవిజ్ఞాన మభేద మేకమ్ ।
పశ్యన్త్యనేకం భవతః స్వరూపం తద్బ్రహ్మపారం ప్రణమామి నిత్యమ్ ॥ 8

యతః ప్రధానం పురుషః పురాణో వివర్తతే యం ప్రణమన్తి దేవాః ।
నమామి తం జ్యోతిషి సంనివిష్టం కాలం బృహన్తం భవతః స్వరూపమ్ ॥ 9
వ్రజామి నిత్యం శరణం మహేశమ్ స్థాణుం ప్రపద్యే గిరిశం పురాణమ్ ।
శివం ప్రపద్యే హర మిన్దుమౌళిం పినాకినం త్వాం శరణం ప్రజామి ॥ 10

*(శ్లో॥36-45)*

"పరంకన్నా పరమైనవాడివి, రక్షకుడివి, పురాణపురుషుడివి, యోగులకి ప్రభువువి, సర్వశ్రేష్ఠుడివి, అయిన దేవి కపర్దీశ్వరా నీకు నమస్కారం. ఎవరి నుంచి ప్రధాన తత్త్వం ఈ పురాణ పురుషుడు పరిణామం చెందుతున్నాడో, సకల దేవతలూ ఎవరికి నిత్యం నమస్కరిస్తారో అలాంటి నీ దివ్యరూపానికి నమస్కరిస్తున్నాను".

శంకుకర్ణుడు ఈ విధంగా శంకరుణ్ణి కపర్ధీశ్వరుడిగా భావించి దివ్యంగా స్తుతించాడు. తరువాత ఓంకారాన్ని ఉచ్చరిస్తూ అలాగే నేలమీద పడిపోయాడు. ఆ క్షణంలోనే ప్రళయ కాలంలోని కోటి అగ్నుల కాంతితో ఒక తేజో లింగం అక్కడ ఆవిర్భవించింది. ప్రాణాలు కోల్పోయిన శంకుకర్ణుడి జీవాత్మ ఆ తేజో లింగంలోకి ప్రవేశించింది.

ఋషులారా! ఇదీ కపర్దీశ్వరుడి చరిత్ర. శంకుకర్ణుడి వృత్తాంతం, పిశాచమోచన సరోవర మాహాత్మ్యం, సకల పాపాలనీ హరించే ఈ కపర్దీశ్వరుడి వృత్తాంతాన్ని పఠించిన వారికి, విన్నవారికి శివానుగ్రహం సంపూర్ణంగా లభిస్తుంది.

శంకుకర్ణుడు చేసిన ఈ కపర్దీశ్వర స్తుతిని ఎవరైతే ఉదయం - మధ్యాహ్నం పఠిస్తారో వారు యోగసిద్ధిని పొందుతారు.

ఈ విధంగా వ్యాసమహర్షి కపర్ధీశ్వరుణ్ణి పూజిస్తూ ఆ లింగం సమీపంలోనే చాలాకాలం నివసించాడు. ఆ తరువాత అక్కణ్ణుంచి శిష్య సమేతంగా బయలుదేరి మధ్యమేశ్వర దర్శనానికి వెళ్ళాడు.

**మధ్యమేశ్వరుడు :** మధ్యమేశ్వర లింగం సన్నిధికి వచ్చిన వ్యాసుడు సమీపంలోనే ఉన్న గంగలో స్నానంచేసి దేవ, ఋషి, పితృతర్పణాలు విడిచాడు. తరువాత మధ్యమేశ్వరుడి మందిరంలోకి ప్రవేశించి విధివిధానంగా ఆ లింగానికి అభిషేకార్చనలు జరిపాడు. ఆ సమయంలో అక్కడికి భస్మంతో పూయబడ్డ శరీరాలతో కొంతమంది పాశుపతులు వచ్చారు. వారిలో కొందరు ఓంకారాన్ని జపిస్తూ, వేదాధ్యయనం చేయటం మీద శ్రద్ధ కలిగివున్నారు. కొందరు కౌపీనాన్ని (గోచి)మాత్రమే ధరించగా మరికొందరు దిగంబరంగా ఉన్నారు. అందరూ ఇంద్రియ నిగ్రహం కలిగినవారే.

వచ్చిన పాశుపతులు మధ్యమేశ్వరుణ్ణి అర్చించి, అక్కడ శిష్యసమేతుడై ఉన్న వ్యాసమహర్షిని చూసి నమస్కరించి "స్వామీ! తమరెవరు? ఎక్కణ్ణుంచి వచ్చారు? అని వినయంగా ప్రశ్నించగా, అది విన్న వ్యాసశిష్యులు వారికి వ్యాసమహర్షి గొప్పతనాన్ని వివరించారు. తరువాత తమ శిష్యులందరికీ మధ్యమేశ్వరుడి మాహాత్మ్యాన్ని ఇలా వివరించాడు వ్యాసమహర్షి

శిష్యులారా! ఈ దివ్య ప్రదేశంలో పరమేశ్వరుడు తన రుద్రగణాలతో, పార్వతీదేవితో నిత్యం విహరిస్తూ ఉంటాడు. ఇదే ప్రదేశంలో పూర్వం శ్రీకృష్ణుడు పాశుపత గణాలతో కలిసి ఒక సంవత్సర కాలం నివసించాడు. పాశుపతవ్రతాన్ని అవలంబించిన కృష్ణుడు భస్మాన్ని వంటినిండా పూసుకుని బ్రహ్మచర్యదీక్షతో మధ్యమేశ్వర లింగాన్ని పూజించాడు. తరువాత కాలంలో కృష్ణుడి ద్వారా ఎంతో మంది పాశుపతవ్రతాన్ని ఉపదేశం పొంది శ్రద్ధగా ఆచరించి మధ్యమేశ్వర దర్శనాన్ని పొందారు.

శ్రీకృష్ణుడు చేసిన పూజకి ఎంతో సంతోషించిన మధ్యమేశ్వరుడు ఆయనకి దర్శనమిచ్చి వరాల్ని అనుగ్రహించాడు. అంతేకాదు " నా భక్తులైన వాళ్ళు శాస్త్ర పద్ధతిలో గోవిందుణ్ణి కూడా పూజిస్తే, వారికి సంపూర్ణమైన ఈశ్వర జ్ఞానం కలుగుతుంది" అని ప్రకటించాడు కూడా.

మహర్షులారా! గంగానదిలో పవిత్రంగా స్నానం చేసి, మధ్యమేశ్వరుణ్ణి శ్రద్ధా భక్తులతో పూజించినవారు ధన్యులు. ఇది దివ్యక్షేత్రం. ఇక్కడ చేసే దానం, తపస్సు, శ్రాద్ధ కర్మ, పిండప్రదానం చేయటం అనేవి చేసిన వారి వంశంలో ఏడుతరాల వారిని పునీతుల్ని చేస్తాయి. కనుక మధ్యమేశ్వరలింగ దర్శనం సకల పాపహరం అని గ్రహించండి"

ఈ విధంగా శిష్యులకి ప్రబోధించిన వ్యాసమహర్షి కొద్దికాలం అక్కడే నివసించి వారణాసిలో ఉన్న ఇతర దివ్య తీర్థాల్ని దర్శించటానికి బయలుదేరాడు.

## వ్యాసుడు దర్శించిన కాశీలోని తీర్థాలు

వ్యాసమహర్షి జైమిని మొదలైన శిష్యుల్ని వెంటబెట్టుకుని వారణాసి, దాని సమీపంలో వున్న ఎన్నో దివ్యతీర్థాల్ని దర్శించాడు. అవి –

1.ప్రయాగతీర్థం 2.విశ్వరూపతీర్థం 3.కాలతీర్థం 4.ఆకాశ తీర్థం 5.అనుషమతీర్థం 6.స్వర్లీన తీర్థం 7.గౌరీతీర్థం 8.ప్రాజాపత్య తీర్థం 9.స్వర్గద్వార తీర్థం 10.జంబుకేశ్వర తీర్థం 11.గయాతీర్థం 12.వారాహ తీర్థం 13.నాగతీర్థం 14.సోమతీర్థం 15.నారాయణ తీర్థం 16.వాయు తీర్థం 17.జ్ఞానతీర్థం 18.వారాహ తీర్థం 19.యమతీర్థం 20.సంవర్తక తీర్థం 21.అగ్నితీర్థం 22.కాలకేశ్వర తీర్థం 23.సూర్యతీర్థం 24.పర్వత తీర్థం 25.మణికర్ణికా తీర్థం 26.ఘటోత్కచ తీర్థం 27.శ్రీ తీర్థం 28.పితామహతీర్థం 29.గంగాతీర్థం 30.కపిలతీర్థం 31.సోమేశ్వర తీర్థం 32.బ్రహ్మ తీర్థం 33.భూతేశ్వర తీర్థం

34.ధర్మసముద్భవ తీర్థం 35.గంధర్వతీర్థం 36.వాహ్నేయ తీర్థం 37.హోమతీర్థం 38.చంద్రతీర్థం 39.చిత్రాంగదేశ్వర తీర్థం 40.విద్యాధరేశ్వర తీర్థం 41.కేదార క్షేత్రం (తీర్థం) 42.కాలంజర తీర్థం 43.సారస్వత తీర్థం 44.ప్రభాస తీర్థం 45.ఖేటకర్ణ తీర్థం 46.హరతీర్థం 47.లౌకిక తీర్థం 48.హిమాలయ తీర్థం 49.హిరణ్యగర్భ తీర్థం 50.గోప్రఖ్య తీర్థం 51.వృషధ్వజ తీర్థం 52.ఉపశాంతతీర్థం 53.శివతీర్థం 54.వ్యాఘ్రేశ్వర తీర్థం 55.త్రిలోచన తీర్థం 56.లోలార్క తీర్థం 57.ఉత్తర తీర్థం 58.కపాలమోచన తీర్థం 59.శుక్రేశ్వర తీర్థం 60.ఆనందపుర తీర్థం

ఈ విధంగా అసంఖ్యాకమైన దివ్య తీర్థాల్ని దర్శించి, ఈ తీర్థాలన్నిటిలో శిష్యసమేతంగా పుణ్యస్నానాలు చేసాడు వ్యాసమహర్షి. తనతో వచ్చిన శిష్యులందర్నీ సమావేశపరిచి "శిష్యులారా! ఇంతవరకూ నాతో అన్ని తీర్థాలకీ క్షేత్రాలకీ వచ్చారు. ఇకపై మీరు మీ ఇష్టం వచ్చిన ప్రదేశాలకి వెళ్ళిపోవచ్చు. ఎందుకంటే నేను ఈ వారణాసిలోనే ఉందామనుకుంటున్నాను" అని చెప్పి అందర్నీ పంపించేశాడు. తాను అక్కడే నివసిస్తూ ఇంద్రియనిగ్రహంతో, ప్రశాంత చిత్తంతో మూడు లోకాల్లో గంగాస్నానాన్ని ఆచరించి, నిత్యం శివారాధన చేసి, భిక్షద్వారా లభించిన ఆహారాన్ని మాత్రమే స్వీకరిస్తూ కాలం గడపసాగాడు.

## వ్యాసుడి గర్వభంగం

వారణాసిలో స్థిర నివాసం ఏర్పర్చుకుని నియమబద్ధంగా జీవిస్తున్న వ్యాసుడు ఒకనాడు నిత్యానుష్ఠానాలు ముగించుకుని భిక్షాటనకి బయలుదేరాడు. అయితే ప్రారబ్ధవశాన ఆయనకి ఆ రోజు ఎంత తిరిగినా ఎక్కడా భిక్ష లభించలేదు. దానితో ఆయనకి సహనం నశించింది. ఆకలి ఆగ్రహంగా మారింది. వెంటనే చేయెత్తి ఓ కాశీనగర విప్రులారా! ప్రజలారా! ఇక్కడ నివసించే మీ అందరికీ పుణ్యలోకాలు ప్రాప్తించకుండా ఉండుగాక! అని సంకల్పించాడు. ఇక శాపాన్ని ఇవ్వబోయేంతలో జగన్మాత పార్వతీదేవి వెంటనే అక్కడ మానవ స్త్రీరూపంలో ప్రత్యక్షమయ్యింది. వ్యాసుడి దగ్గరకొచ్చి "మహాత్మా! నీకంత ఆగ్రహం ఎందుకయ్యా! ఈ కాశీనగరాన్ని నీవు శపించకూడదు. శాంతించు. ఇదిగో భిక్ష స్వీకరించు" అని పలికి ఆయనకి భిక్షనిచ్చింది. వ్యాసుడు భిక్షని స్వీకరించిన తరువాత నిజరూపాన్ని ధరించి "వ్యాసా! నీవు కోపస్వభావిగా మారి ఇంద్రియ నిగ్రహాన్ని కోల్పోయావు. ఆగ్రహంతో సాక్షాత్తు పరమేశ్వరుడు కొలువుండే కాశీనగరాన్ని శపించబోయావు. ఇక నీవు ఈ క్షేత్రంలో ఉండటానికి అర్హుడివి కావు. ఇక్కణ్ణుంచి వెంటనే వెళ్ళిపో" అని ఆజ్ఞాపించింది.

పార్వతీదేవి మాటలు విన్నాక వ్యాసుడికి జ్ఞానోదయం కలిగింది. కాశీని శపించబోయి తానెంత తప్పు చేశాడో అర్థమయ్యింది. వెంటనే అమ్మవారి

కాళ్ళమీద పడి "అమ్మా! నన్ను క్షమించు. అవివేకంతో ఇంత తప్పుచేశాను. కనీసం చతుర్దశి, అష్టమి తిథుల్లోనైనా కాశీనగరంలోకి ప్రవేశించేందుకు అనుమతినివ్వమ్మా" అని వేడుకోగా, దేవి సరేనని అంగీకరించింది.

ఈ విధంగా ప్రారబ్ధవశాన అమ్మవారిచేత శపించబడ్డ వ్యాసమహర్షి వారణాసి నగరానికి ఇవతల గంగకి అవతలి ఒడ్డున తన నివాసాన్ని ఏర్పర్చుకుని, ప్రతి అష్టమి, చతుర్దశి తిథుల్లో కాశీ చేరి విశ్వేశ్వరుణ్ణి విశాలాక్షిని సేవించసాగాడు.

పరమ పవిత్రమైన ఈ అవిముక్త క్షేత్రమాహాత్మ్యాన్ని చదివినవాడు, విన్నవాడు, వినిపించేవాడు ఉత్తమ గతిని పొందుతాడు.

## బ్రహ్మ విష్ణువులు చేసిన లింగస్తవం

ఒకనాడు ప్రపంచమంతా ప్రళయంలో మునిగిపోయి అంతా ఒకే సముద్రంగా ఏర్పడింది. ఆ అనంత జలరాశిలో శ్రీమన్నారాయణుడు శేషపాన్పు మీద హాయిగా శయనించాడు. అదే సమయంలో బ్రహ్మ చతుర్ముఖ దివ్య తేజస్సుతో వెలిగిపోతూ శయనించిన నారాయణుడి దగ్గరకొచ్చి ఆయన్ని తట్టి లేపాడు. నిద్రలేచిన శ్రీహరితో ఎవరు నీవు? ఇక్కడిలా ఎందుకు పడుకున్నావు? అని మాయామోహితుడై ప్రశ్నించాడు. అప్పుడు శ్రీహరి శాంతంగా "నేను నారాయణుడిని. ఈ సృష్టిని మొత్తం చేసింది నేనే. వీటిని సృష్టించి, పోషించి తిరిగి నాలోనే లయం చేసుకుంటాను. నేను ఆదిపురుషుణ్ణి అని" సమాధానం చెప్పాడు.

శ్రీహరి మాటలు విన్న బ్రహ్మకి కోపం వచ్చింది. ఓయీ! నారాయణా! నీవు కాదు నేనే ఆదిపురుషుణ్ణి. ఈ సకల ప్రపంచాన్నీ సృష్టించేది కూడా నేనే అని వాదించాడు. ఇలా వారిద్దరూ పరస్పరం నేను గొప్పంటే, కాదు నేనే గొప్పని వాదన కొనసాగిస్తున్నారు. ఎవరూ వెనక్కి తగ్గటంలేదు.

సరిగ్గా అప్పుడే వారిద్దరి మధ్యా దివ్యతేజస్సుతో వెలిగిపోతూ ఒక తేజో లింగం ఆవిర్భవించింది. దాని తుది మొదలు ఏ మాత్రం కనబడడం లేదు.

మహాజ్వాలలతో ప్రకాశించే ఆ లింగాన్ని చూసి బ్రహ్మ విష్ణువులిద్దరూ ఎంతో ఆశ్చర్యపోయారు. ఆ లింగం ఆద్యంతాలు తెలుసుకోవాలని నిర్ణయించుకున్న వారు, తమ మధ్య ఏర్పడిన వివాదాన్ని పక్కనపెట్టి బ్రహ్మ ఆకాశం వైపు, విష్ణువు పాతాళం వైపు ప్రయాణించారు. అలా ఎంత వెతికినా వాళ్ళిద్దరికి లింగం ఆద్యంతాలు తెలియలేదు. ఇద్దరూ తిరిగి పూర్వం తాము న్న ప్రదేశానికి వచ్చారు.

శివుడి తేజో లింగం అలాగే జాజ్జ్వల్యంగా ప్రకాశిస్తూనే ఉంది. ఒక్కసారిగా ఆ లింగాన్ని సంపూర్ణంగా దర్శించిన వాళ్ళిద్దరూ భయంతో, భక్తితో ఇలా ఆ లింగాన్ని స్తుతించారు.

అనాదిమూల సంసారరోగవైద్యాయ శమ్భవే ।
నమః శివాయ శాన్తాయ బ్రహ్మణే లిఙ్గమూర్తయే ॥ 1

ప్రళయార్ణవసంస్థాయ ప్రళయోద్భూతి హేతవే ।
నమః శివాయ శాన్తాయ బ్రహ్మణే లిఙ్గమూర్తయే ॥ 2

జ్వాలామాలాప్రతీకాయ జ్వలనస్తృమ్భరూపిణే ।
నమః శివాయ శాన్తాయ బ్రహ్మణే లిఙ్గమూర్తయే ॥ 3

ఆదిమధ్యాన్తహీనాయ స్వభావామలదీప్తయే ।
నమః శివాయ శాన్తాయ బ్రహ్మణే లిఙ్గమూర్తయే ॥ 4

ప్రధాన పురుషేశాయ వ్యోమరూపాయ వేధసే ।
నమః శివాయ శాన్తాయ బ్రహ్మణే లిఙ్గమూర్తయే ॥ 5

నిర్వికారాయ సత్యాయ నిత్యాయ తులతేజసే ।
వేదాన్తసారరూపాయ కాలరూపాయ తే నమః ॥ 6

నమః శివాయ శాన్తాయ బ్రహ్మణే లిఙ్గ మూర్తయే ।
ఏవం సంస్తూయమానస్తు వ్యక్తో భూత్వా మహేశ్వరః ॥ 7

భాతి దేవో మహాయోగీ సూర్యకోటి సమప్రభః ।
వక్త్రకోటి సహస్రేణ గ్రసమాన ఇవామ్బరమ్ ॥ 8

సహస్రహస్తచరణః సూర్యసోమాగ్నిలోచనః ।
పినాకపాణి ర్భగవాన్ కృత్తివాసా స్త్రిశూలధృక్ ॥ 9
వ్యాళయజ్ఞోపవీతశ్చ మేఘదున్దుభి నిఃస్వనః ।
అథోవా చ మహాదేవః ప్రీతోఽహం సురసత్తమౌ ॥ 10

*(శ్లో॥80-89,అధ్యా-26)*

ఈ విధంగా హరి-బ్రహ్మలు చేసిన స్తుతికి సంతోషించిన మహాదేవుడు వారికి సాక్షాత్కరించి 'బ్రహ్మ విష్ణువులారా! నా తేజో లింగం చూసి భయపడకండి. మీరిద్దరూ సనాతనులు. మీరిద్దరూ నా నుంచే జన్మించారు. బ్రహ్మదేవా! నీవు సృష్టికార్యక్రమాన్ని కొనసాగించు. విష్ణుదేవా! నీవు విశ్వాన్ని పాలించు, పోషించు. నేను రుద్రుడి రూపంలో ప్రళయ కాలంలో సృష్టినంతా లయం చేస్తా" అని చెప్పి వారిని ఆశీర్వదించి పంపాడు.

## ఈశ్వర గీత

పూర్వం సనత్కుమారుడు, సనకుడు, సనందనుడు, అంగిరుడు, భృగువు, కణాదుడు, కపిలుడు, గర్గుడు, వామదేవుడు, శుక్రుడు, వశిష్ఠుడు- వీరంతా ఇంద్రియ నిగ్రహంతో, అందరూ కలిసి నిశ్చలమైన మనసుతో పవిత్రమైన బదరికాశ్రమంలో కఠోరమైన తపస్సు చేసారు.

వారి తపస్సు పూర్తయిన తరువాత ధర్ముడి పుత్రుడైన నారాయణుణ్ణి- నరుడితో సహా దర్శించారు. సకల శాస్త్ర కోవిదుడు, మహా తపస్వి అయిన నారాయణ మునిని, వేదాల నుంచి పుట్టిన దివ్యవాక్కులతో ఘనంగా స్తుతించారు. సర్వజ్ఞుడైన ఆ నారాయణ ముని వారి స్తోత్రాలు విని మహర్షులారా! మీరంతా ఎందుకు తపస్సు చేస్తున్నారు? అని ప్రశ్నించాడు.

ఋషులందరూ ముక్త కంఠంతో ప్రభూ! మేమంతా బ్రహ్మజ్ఞానం తెలుసుకోవాలనుకుంటున్నాం. నీవు స్వయంగా నారాయణాంశతో జన్మించిన అవతార పురుషుడివి. అవ్యక్తమైన పురాణ పురుషుడివి కూడా. పరమరహస్యమైన బ్రహ్మజ్ఞానం నీకు సంపూర్ణంగా తెలుసు. నీవు తప్ప మాకు ఆ జ్ఞానాన్ని బోధించే వాడెవరూ లేరు. కనుక మా సందేహాలన్నీ నీవే తీర్చాలి" అని ప్రార్థించారు.

నారాయణమునీ! ఈ సమస్తానికీ ఏది కారణం? ఎవడు ఎప్పుడు సంసారబద్ధుడై ఉంటాడు? ఆత్మ ఏది? ముక్తి అంటే ఏమిటి? సంసారానికి నిమిత్తం ఏది? అసలు సంసారం అంటే ఏమిటి? ఈ సమస్తాన్నీ దర్శించే ఈశానుడు ఎవరు? అన్నిటికన్నా ఉత్తమమైన ధర్మం ఏది? ఈ ప్రశ్నలన్నిటికీ మాకు సరైన సమాధానాలు చెప్పు స్వామీ? అని ప్రార్థించారు.

ఈ విధంగా ప్రశ్నించిన ఋషులందరూ తమ తపస్సుని విడిచిపెట్టి శంఖ చక్ర గదా బాణాలతో ఉన్న శ్రీమనారాయణుణ్ణి, ఆ నారాయణ మునిలో దర్శించారు. అంతలోనే తలమీద చంద్రకళని ధరించిన మహాదేవుడు దివ్యతేజస్సుతో వెలిగిపోతూ వారిముందు సాక్షాత్కరించాడు. త్రిలోచనుడైన శంకరుడు సాక్షాత్కరించగానే వారంతా ఎంతో సంతోషించి ఆయన్నిలా ఘనంగా స్తుతించారు.

జయేశ్వర మహాదేవ జయభూతపతే శివ ।
జయ శేషమునీశాన తపసాఽభిప్రపూజిత ॥ 1

సహస్రమూర్తే విశ్వాత్మన్ జగద్యంత్ర ప్రవర్తక ।
జయానంత జగజ్జన్మత్రాణ సంహారకారక ॥ 2

సహస్రచరణేశాన శంభో యోగీంద్ర వందిత ।
జయాంబికాపతే దేవ నమస్తే పరమేశ్వర ॥ 3

*(శ్లో॥33-35,అధ్యా-1,ఉ.ఖం)*

"ఈశ్వరా! మహాదేవా! సకల భూతాలకీ అధిపతీ శివా! నీకు జయం. తపస్సుచేత పూజించబడేవాడా! సమస్తానికీ ఈశ్వరా! నీకు జయం. సృష్టిస్థితి లయకారకుడా! నాశనం లేనివాడా! నీకు జయం. అనంతమైన పాదాలు కలవాడా! యోగులందరిచేతా నమస్కరించబడేవాడా! అంబికాపతీ నీకు నమస్కారం"

ఈ విధంగా ఋషులందరి చేతా స్తుతించబడ్డ శంకరుడు అక్కడే ఉన్న నారాయణుణ్ణి ప్రేమతో కౌగిలించుకుని 'నారాయణా! ఈ మునులంతా

ఇక్కడికి ఎందుకొచ్చారు. వీరికి నాతో ఏం ప్రయోజనముంది? అని ప్రశ్నించగా, నారాయణుడు చిరునవ్వుతో "శంకరా! ఈ మహర్షులందరూ పాపాలు నశించినవారు, వీరికి ఆత్మజ్ఞానం తెలుసుకోవాలనే కోరిక వుంది. అందుకే ఇక్కడికి వచ్చారు. నన్ను చెప్పమని ప్రార్థించారు. అంతలోనే సరైన సమయానికి నీవిక్కడికొచ్చావు. నాకు చాలా సంతోషంగా ఉంది. ఆత్మజ్ఞానాన్ని బోధించగల సమర్థుడివి నీ ఒక్కడివే. నీవు ఆత్మజ్ఞానాన్ని బోధిస్తే వీరితో పాటు నేను కూడా వింటాను" అని అన్నాడు.

అంతలో ఆకాశం నుంచి మంగళకరమైన ఒక దివ్యసింహాసనం క్రిందికి దిగి వచ్చింది. పరమేశ్వరుడు దానిమీద ఆసీనుడయ్యాడు. నారాయణుడు కూడా ఆయన ప్రక్కనే కూర్చున్నాడు. మహర్షులందరూ వారిద్దరి ముందు సావధానులై కూర్చున్నారు. పరమేశ్వరుడు వారందర్నీ చూసి "ఋషులారా! తపస్వులారా! ఎంతో గొప్పదైన ఆత్మజ్ఞానాన్ని చెబుతున్నా. ప్రశాంతంగా స్థిరచిత్తంతో వినండి అని ఇలా చెప్పటం ప్రారంభించాడు.

## ఈశ్వరుడు చెప్పిన ఆత్మజ్ఞానం

ఆత్మాయం కేవలః స్వచ్ఛః శుద్ధః సూక్ష్మః సనాతనః ।
అస్తి సర్వాంతరః సాక్షాచ్చిన్మాత్ర స్తమసః పరః ॥

*(శ్లో॥4,అధ్యా-1,ఉ.ఖం)*

మహర్షులారా! ఆత్మ కేవలం శుద్ధమైనది, నిర్మలమైనది, సూక్ష్మం, సనాతనమైనది కూడా. అది జ్ఞానమాత్రమై అంధకారానికి అతీతమై, అన్నిటి అంతర్భాగాలలో వ్యాపించి ఉంది.

★ ఆత్మనుంచే ప్రపంచం జన్మిస్తుంది. తిరిగి దానిలోనే అది లయమైపోతుంది.

★ మాయామయుడైన పురుషుడు మాయచేత బద్ధుడై వివిధ రకాల శరీరాల్ని (ప్రాణుల్ని) సృష్టిస్తాడు.

★ ఆ పురుషుడు సంసారంలో చిక్కుకోడు. ఆ ఆత్మపురుషుడు భూమి, గాలి, నీరు, నిప్పు, జలం, వీటిలో ఏదీకాడు.

★ ఇతడు ప్రాణరూపుడు కాడు. మనసు, అవ్యక్తం, శబ్దం, స్పర్శం కూడా కాదు.

★ ఆత్మ కర్త కాదు, వాక్కు కాదు పాణిపాదాలు, గుద, యోనులు, కర్త, భోక్త, ప్రకృతి, పురుషుడు, మాయ, ప్రాణం ఇవేవీ కాదు.

★ ప్రపంచానికి ఆత్మకి సంబంధం ఐక్యమైనది కాదు.

★ లోకంలో ఎండ, నీడ ఎలా విభిన్నంగా ఉంటాయో అలాగే ప్రకృతి – పురుషుడు కూడా భిన్నమైనవారే.

★ ముక్తులైన మునులు మాత్రమే యథార్థమైన ఆత్మసాక్షాత్కారాన్ని పొందుతారు.

★ ఆత్మ అనేది వికార రహితమైనది. ద్వంద్వాలు లేనిది, ఆనంద రూపమైనది, నాశనరహితమైనది.

★ నేనే కర్తను, సుఖ దుఃఖాలు కలిగిన వాడిని, చిన్నవాడిని, పెద్దవాడిని అనే బుద్ధిని మానవులు ఆత్మలో ఆరోపించుకుని ప్రవర్తిస్తారు.

★ వేదవేత్తలు ఆత్మని ప్రకృతికి అతీతమైనది, అక్షరాత్మకమైనది, అంతటా వ్యాపించి ఉన్నది అని చెబుతారు.

★ రాగం, ద్వేషం లాంటి దోషాలన్నీ భ్రాంతివల్ల ఏర్పడ్డాయి.

★ పుణ్యపాపరూపమైన కర్మలే జీవులకి పెద్ద దోషం.

★ ఈ కర్మల వల్లే జీవులకి ఇన్ని రకాల శరీరాలు కలుగుతున్నాయి.

★ కూటస్థుడైన పరమపురుషుడు ఎప్పుడు గుహ్యంగానే ఉంటాడు. ఎప్పుడూ దోషరహితంగానే ఉంటాడు.

★ మునులు అద్వైతతత్త్వాన్నే పరమార్థమని చెప్తారు.

★ మాయ ఎప్పుడూ జీవుణ్ణి ఆశ్రయించి ఉంటుంది.

★ పొగతో సంబంధం వల్ల ఆకాశం ఎలా మలినం కాదో అలాగే మనసులో పుట్టిన కామక్రోధాది దుర్గుణాల వల్ల లోపలున్న ఆత్మ మలినం కాదు.

★ స్ఫటికశిల ఏవిధంగా తన కాంతితో ప్రకాశిస్తుందో అలాగే నిర్మలమైన ఆత్మకూడా స్వతః సిద్ధంగానే ప్రకాశిస్తుంది.

★ కూటస్థపురుషుడు (ఆత్మ) సహజంగా నిర్గుణుడు, చైతన్యస్వరూపుడు, సర్వవ్యాపకుడు కూడా.

★ ఆత్మ అక్షరమైనది, శుద్ధమైనది, నిత్యమైనది, నాశనరహితమైనది. అంతటా నిండి ఉన్నది.

★ శ్రద్ధ కలిగిన యోగికి స్వయంగా సిద్ధి లభిస్తుంది.

★ ఎవడు సమస్త జీవుల్నీ తనలోనే దర్శిస్తాడో, సమస్త జీవుల్లో తనని చూస్తాడో అప్పుడే అతడికి బ్రహ్మసాయుజ్యం కలుగుతుంది.

★ మానవుడు ఎప్పుడైతే ఆత్మస్వరూపాన్ని కేవలం పరమార్థ రూపంగా తెలుసుకుంటాడో అప్పుడే మాయామయమైన ఈ సమస్త ప్రపంచం నిర్వృతిని పొందుతుంది.

★ లోకంలో నదీ నదాలన్నీ ఎలా సముద్రంతో ఏకత్వాన్ని పొందుతున్నాయో అలాగే ఆత్మకూడా నిష్కలమైన అక్షర పరబ్రహ్మలో విలీనమై దానితో అభేదాన్ని పొందుతుంది.

★ ఈ లోకంలో విజ్ఞానం ఒకటే సత్యం. ప్రపంచంకానీ, స్థితి కానీ కాదు.

★ ప్రపంచంలో విజ్ఞానం అజ్ఞానంచేత కప్పబడి మోహాన్ని పొందుతుంది.

★ విజ్ఞానం అనేది సహజసిద్ధంగా నిర్మలం, సూక్ష్మం, వికల్ప శూన్యం, నాశనరహితమైనదిగా ఉంటుంది.

★ యోగం వల్ల జ్ఞానం కలుగుతుంది. జ్ఞానం వల్ల యోగం ప్రవర్తిస్తుంది.

★ యోగం – జ్ఞానం ఈ రెండూ ఉన్నవారికి లోకంలో పొందరానిదేదీ వుండదు.

★ యోగులు దేన్ని పొందుతారో దానినే సాంఖ్యులు కూడా పొందుతారు.

★ సాంఖ్యం–యోగం ఈ రెండిటినీ ఎవడు సమానంగా చూస్తాడో వాడు నిజంగా తత్త్వాన్ని ఎరిగినవాడు.

ఋషులారా! ఆత్మస్వరూపుడనైన నేను అవ్యక్తుడిని, మాయా స్వరూపుడనైన పరమేశ్వరుణ్ణి. నేను అన్ని వేదాలలో కీర్తించబడ్డ వాణ్ణి, సర్వాత్మకుడిని, అంతటా ముఖాలు కలిగినవాణ్ణి, సర్వరూపుడిని, సమస్త గంధాలు

కలిగినవాడిని, జరామరణాలు లేని వాడిని. సర్వాంతర్యామిని, సనాతనుణ్ణి, పాణి పాదాలు (కాళ్ళు–చేతులు) లేనివాణ్ణి, వేగంగా వెళ్ళేవాడిని, అన్నిటినీ గ్రహించేవాడిని, అందరి హృదయాలలో ఉండేవాడిని.

కళ్ళు లేకున్నా నేను చూస్తున్నాను. చెవులు లేకపోయినా వింటున్నాను. ఈ సమస్తాన్నీ నేను తెలుసుకోగలుగుతున్నాను. అయితే నన్నెవరూ తెలుసుకోలేరు. నిజమైన తత్త్వాన్ని గ్రహించిన వాళ్ళు నన్ను ఒక మహాపురుషుడుగా కీర్తిస్తారు. అలాగే సూక్ష్మ దర్శి అయిన ఆత్మకి నేనే కారణం అని ఋషులు భావిస్తున్నారు. బ్రహ్మవాదులైన మహర్షులారా! దేవతలు కూడా ఏ నా మాయ వల్ల మోహితులై నిజమైన తత్త్వాన్ని తెలుసుకోలేకపోతున్నారో, అలాంటి బ్రహ్మవిద్యని గురించి మీకు చెబుతాను శ్రద్ధగా వినండి.

## బ్రహ్మ విద్య

★ విశ్వరూపిణి అయిన నా మాయని (శివమాయ) ఎవరైతే అతిక్రమిస్తారో వారు శుద్ధమైన మోక్ష పదవిని పొంది నా సాయుజ్యాన్ని పొందుతారు.

★ అవ్యక్త తత్త్వం నుంచి కాలం పుట్టింది. దానితోపాటే ప్రధానం, ప్రధాన పురుషుడు కూడా పుట్టారు. వారివల్లనే ఈ సమస్త ప్రపంచం పుట్టింది. అందుకే ఈ బ్రహ్మాండమంతా బ్రహ్మ మయమని చెప్పబడుతోంది.

★ బ్రహ్మం అనేది అన్ని వైపులకీ చేతులతో, కాళ్ళతో వ్యాపించింది. దానికి అంతా కళ్ళు, తల, ముఖం వున్నాయి. అది అన్నివైపులా వినగలదు. అది మొత్తాన్ని ఆవరించి ఉంటుంది.

★ బ్రహ్మం అనేది ఇంద్రియాల గుణాల ఆభాస కలిగింది. అన్ని ఇంద్రియాల నుంచీ విడువబడింది. అన్నిటికీ అది ఆధారమైనది, అంతం అనేదే లేనిది. వ్యక్తం కానిది, భేదం లేనిది.

★ ప్రమాణాలకి అతీతంగా గోచరించేది, వికల్ప శూన్యమైనది, అన్నిటికీ ఆధారమైనది, గొప్పది. అమృత రూపమైనది బ్రహ్మ స్వరూపం.

★ బ్రహ్మం అనేది భిన్నం కానిది, భిన్నమైనది, శాశ్వతమైనది, స్థిరమైనది, ప్రత్యేకంగా ఏ గుణం లేనిది అని జ్ఞానం కలిగిన పండితులు తెలుసుకుంటారు.

★ ఋషులారా! సమస్త భూతాలకీ అంతరాత్మరూపుణ్ణి నేనే. నేనే బ్రహ్మని, జీవుల బాహ్యాంభ్యంతర రూపుణ్ణి. అలాంటి నేనే ఈ ప్రపంచమంతా బ్రహ్మంగా నిండి వున్నాను. శాంతస్వభావం గల జ్ఞానిని, పరమేశ్వరుణ్ణి. స్థావరజంగమాత్మకమైన ఈ విశ్వం, సమస్త ప్రాణులూ నాలోనే వున్నాయి. అలాంటి నన్ను వేదవేత్తలు మాత్రమే తెలుసుకోగలరు.

★ బ్రహ్మతత్త్వం ప్రధానం - పురుషరూపం అని చెప్పబడింది. ఈ రెండిటి సంయోగం వల్ల పుట్టిందే కాలం.

★ ప్రధానం–పురుషుడు–కాలం అనే ఈ మూడూ ఆద్యంత రహితం, అవ్యకతత్త్వం అనే దాన్లో నిలిచి ఉన్నాయి.

★ మహత్తత్త్వం నుంచి సమస్తలోకాల్నీ సృష్టించే ప్రకృతి ఏదైతే వుందో అది అన్ని ప్రాణుల్నీ మోహింపచేస్తుంది.

★ ప్రకృతిలో ఉండే జీవుడైన పురుషుడు ప్రకృతి గుణాల్ని అనుభవిస్తూ, అహంకారం నుంచి విముక్తి పొందాడు కాబట్టి అతడు 25వ తత్త్వంగా చెప్పబడతాడు.

★ ఈ ప్రకృతి మొదటి వికారం 'మహత్తు' అని చెప్పబడింది

★ తెలుసుకొనే శక్తి కలిగి ఉండటం వల్ల దాన్నుంచి అహంకారం ఏర్పడింది.

★ మహద్రూపంలో ఉండే ఆత్మ ఒక్కటే, దాన్నే అహంకారం అని చెబుతారు. తత్త్వవేత్తలు ఆత్మనే జీవుడని, ఆంతరాత్మ అని పేర్కొంటారు.

★ ఆత్మవల్లనే తన్మయమైన సంసారం జీవుడికి కలుగుతోంది.

★ కాలం అనేది భూతాన్ని సృష్టిస్తుంది. అదే కాలం అన్నిటినీ సంహరిస్తుంది. అన్నీ కాలానికి వశమైపోయేవే. అయితే కాలం మాత్రం దేనికీ వశంకాదు.

★ ఋషులారా! అన్ని ఇంద్రియాలకన్నా మనసు గొప్పదని పండితులు చెబుతారు. ఆ మనస్సు కంటే అహంకారం. దానికంటే మహత్తత్త్వం గొప్పది అని కూడా కొందరంటారు.

★ ఈ మహత్తత్త్వం కన్నా గొప్పది అవ్యక్తం. దానికన్నా గొప్పవాడు పురుషుడు. అలాంటి పురుషుడి వల్ల ప్రాణం (జీవుడు) ఏర్పడుతుంది. ఈ లోకం మొత్తం ప్రాణానిది అనగా జీవుడిది.

★ ప్రాణంకన్నా గొప్పది ఆకాశం. ఆ ఆకాశానికి అతీతమైనది అగ్ని. అగ్ని ఈశ్వరరూపం.

ఋషులారా! నేనే ఈశ్వర రూపుణ్ణి. నేనే నాశన రహితుడైన బ్రహ్మను. పరమశాంతిని కలిగినవాణ్ణి. ఈ జగత్తంతా మాయకి అతీతమైంది. నాకన్నా పరమైన ప్రాణి లేదు. నన్ను తెలుసుకుంటే చాలు మీకు ముక్తి లభిస్తుంది. ఈ ప్రపంచంలో ఏదీ నిత్యం కాదని మీరు తెలుసుకోండి. అవ్యక్తుడిని, ఆకాశరూపుణ్ణి అయిన నన్ను విడిచిన నిత్యమైనదేదీ లోకంలో లేదు. నేనే సమస్త విశ్వాన్నీ సృష్టించి తిరిగి దాన్ని సంహరిస్తుంటాను.

మాయీ మాయామయోదేవః కాలేన సహసంగతః ।
మత్సన్నిధావేష కాలః కరోతి సకలం జగత్ ॥
నియోజయత్యనంతాత్మా హ్యేతద్వేదానుశాసనం ॥

*(శ్లో॥23,అధ్యా-4,ఉ.ఖం)*

మహర్షులారా! తపోధనులారా! మాయామయుడు మాయను కలిగినవాడు అయిన ఈశ్వరుడు కాలంతో కలవగా, ఆ కాలం నా సన్నిధిలో సకలలోకాల్నీ సృష్టిస్తుంది. అనంతాత్మ స్వరూపుడైన పరమాత్మ ఈ సమస్తాన్నీ నియమిస్తాడు. ఇది వేదాల్లో చెప్పబడ్డ అనుశాసనం.

## శివుడే చెప్పిన ఈశ్వర తత్త్వం

★ బ్రహ్మవిదులారా! నేను వివిధరకాల తపస్సుల చేత, దానాల చేత, యజ్ఞాల చేత తెలుసుకోవటానికి శక్యుణ్ణి కాను. కేవలం శ్రేష్ఠమైన భక్తి ద్వారా మాత్రమే నన్ను తెలుసుకోగలరు.

★ నేను సమస్త భూతాలలో, లోపలా బైటా వ్యాపించి ఉంటాను. సర్వసాక్షినైన నన్ను ఈ లోకం సరిగ్గా గుర్తించలేదు.

★ ఈ సమస్త సృష్టి ఎవరిలోపల నిండి ఉంటుందో, ఎవరు గొప్పగా లయం చేస్తాడో అలాంటి ధాతను, విధాతను కాలస్వరూపుడను అగ్నిని, అన్నివైపులా ముఖాలు కలిగిన వాడిని నేనే

★ మునులు, మహర్షులు, బ్రహ్మర్షులు, బ్రహ్మాదిదేవతలు, మనువులు, మహిమాన్వితులుగా ప్రసిద్ధి చెందినవారు నన్ను దర్శించలేరు.

ధ్యాయంతి యోగినో దేవం భూతాధిపతిమీశ్వరమ్ ।

★ వేదాలు ఎప్పుడూ నన్ను ఒక్కణ్ణే పరమేశ్వరుడిగా వర్ణిస్తాయి. విప్రులు వేద విహిత యజ్ఞాలతో నన్ను పూజిస్తారు.

★ పితామహుడైన బ్రహ్మ సమస్తలోకాలూ నన్ను చూడలేవు. యోగులు, భూతాధిపతినైన నన్నే ధ్యానిస్తారు.

★ నేనే సకల హవిస్సుల్నీ భుజించే భోక్తను. సకల యజ్ఞాలకీ ఫలాల్ని ప్రసాదించేవాడిని.

★ సర్వదేవతల్నీ శరీరంగా కలిగినవాడిని, సర్వవ్యాపకుడిని, సర్వత్రా వ్యాపించినవాడిని నేనే.

★ వేదవాదులు, ధర్మ స్వరూపులు అయిన పండితులు నన్ను దర్శించ గలుగుతున్నారు.

★ ఎవరు నన్ను ఎప్పుడు సేవించాలనుకుంటారో అప్పుడు వారికి నేను అందుబాటులో ఉంటాను

★ ధర్మాత్ములైన బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యులు కూడా నన్ను పూజిస్తారు. వారి అనంతమైన కోరికల్ని నేను తీరుస్తాను.

★ శూద్రాది వర్ణాలవారు కూడా తమ తమ ధర్మాన్ని అవలంబించి భక్తి శ్రద్ధలతో నన్ను సేవిస్తే, వారికి కూడా కాలాంతంలో ముక్తి లభిస్తుంది.

★ నా భక్తులైన వారు ఎప్పుడూ నశించరు. వారందరికి పాపాలు తొలగిపోతాయి. నా భక్తుడికి ఎప్పటికీ నాశనం కలగదని పూర్వమే నేను ప్రతిజ్ఞ చేసాను.

★ నా భక్తుణ్ణి నిందించినవాడు నన్ను నిందించినట్టే నా భక్తుణ్ణి. ఆరాధించినవాడు నన్ను ఆరాధించినట్టే.

పత్రంపుష్పం ఫలం తోయం మదారాధనాకారణాత్ ।
యోమే దదాతి సతతం స మే భక్తః ప్రియోమమ ॥
అహంహి జగతా మాదే బ్రహ్మాణం పరమేష్ఠినమ్ ।
విదధే దత్తవాన్వేదానశేషా నాత్మనిఃసృతాన్ ॥
అహమేవ సర్వేషాం యోగినాం గురురవ్యయః ।
ధార్మికానాం చ గోప్తాహం నిహంతా వేదవిద్విషాం ॥

*(శ్లో॥14-16,అధ్యా-4,ఉ)*

ఎవరు పూలు, పళ్ళు, ఆకులు, నీళ్ళు వీటిలో ఏవైనా, నా పూజకోసం సమర్పిస్తారో అలాంటి వారు నాకు ప్రియమైన భక్తులు. ప్రపంచానికి పరమేష్ఠి అయిన బ్రహ్మని నేనే సృష్టించాను. నా నుంచి ఉద్భవించిన వేదాల్ని అతడికి అప్పగించాను. నేనే ఈ సమస్త యోగులకీ గురువుని. ధర్మాన్ని కాపాడేవాడిని కూడా నేనే. సకల శత్రువుల్ని సంహరించేదీ (అరిషడ్వర్గాలు)నేనే. ఈ లోకంలో యోగులకి సంసార బంధాల్ని తొలగించేవాడిని, సంసార బంధాలకి కారకుణ్ణి, ఎలాంటి సంసారబంధాలూ లేనివాడిని నేనే.

★ ఈ చరాచర సృష్టిని సృజించేవాడిని, రక్షించేవాడిని నేనే.
★ మాయ అనేది నా శక్తి. ఈ మాయే అన్ని లోకాల్నీ మోహింపచేస్తుంది.
★ నా పరాశక్తి విద్య అని కీర్తించబడుతోంది. నేను యోగుల హృదయాలలో నివసిస్తూ మాయని నశింపచేస్తున్నాను.
★ అన్నిరకాల శక్తుల్నీ ప్రవర్తింపచేసేదీ, నివర్తింపచేసేదీ నేనే.
★ అన్ని శక్తులకీ ఆధారమైనవాడిని, అమృతానికి స్థానమైనవాడిని నేనే.
★ అన్నిటిలో ఉన్న ఒకే శక్తి ఈ ప్రపంచాన్ని నిర్మిస్తోంది. ఆ శక్తి బ్రహ్మ స్వరూపాన్ని ధరించి, నా స్వరూపంతో నన్నాశ్రయించి పనిచేస్తుంది.
★ నాలో ఉన్న మరో విశాలమైన శక్తి నారాయణుడి రూపంలో ఈ లోకాన్ని పాలిస్తూ ఉంటుంది.

★ నాలో ఉన్న మూడోశక్తి ఈ సమస్తవిశ్వాన్నీ ప్రళయకాలంలో లయం చేస్తుంది. అది తమోగుణ ప్రధానమైన రుద్రుడి రూపంలో వుంటుంది.

★ కొందరు నన్ను ధ్యానమార్గంలో దర్శిస్తారు. మరికొందరు జ్ఞాన, కర్మ, భక్తి మార్గాలు అనుసరించి నా అనుగ్రహాన్ని పొందుతారు.

★ అన్ని మార్గాలకన్నా జ్ఞాన మార్గం ద్వారా నన్ను ఆరాధించేవాడే నాకు అత్యంత ఇష్టుడు.

★ విష్ణు భక్తులు సైతం నన్ను ఆరాధించినట్లైతే వారు నా అనుగ్రహాన్ని సంపూర్ణంగా పొంది తిరిగి జన్మించరు.

ఓ మునీశ్వరులారా! ప్రధానపురుషుడి రూపంగా వున్న ఈ విశ్వం మొత్తం నా ద్వారానే వ్యాపింపచేయబడింది. నాలోనే ఈ విశ్వమంతా నిలిచి ఉంది. ఈ విశ్వం సమస్తం నా చేతనే ప్రేరేపించబడుతోంది. సమస్తలోకాలకీ నేనే ప్రేరణ కలిగించేవాడినని ఎవరు తెలుసుకుంటారో వారు అమృత స్వరూపులవుతారు. కాల స్వరూపుడనైన నేనే ఇదంతా చేస్తున్నాను.

యోఽహం సంప్రోచ్యతే యోగీమయీ శాస్త్రేషు సూరిభిః ।
యోగీశ్వరోఽసౌ భగవాన్ మహాయోగేశ్వరః స్వయం ॥

*(శ్లో॥30,అధ్యా-4,ఉ)*

వివిధ శాస్త్రాల చేతా, పండితోత్తములచేతా, యోగిగా కీర్తించబడే నేను, భగవంతుడైన మహాయోగీశ్వరుణ్ణి. పండితులు నన్ను పరమాత్మ అని, పరబ్రహ్మ అని వ్యవహరిస్తారు. ఎవరైతే నన్ను మహాయోగీశ్వరుడుగా తెలుసుకుంటారో వారు నిర్వికల్పయోగాన్ని పొందుతారు. యోగులందరికీ ప్రేరకుణ్ణైన నేను పరమానందాన్ని పొందినప్పుడు ఆనంద తాండవం చేస్తాను. ఎంతో రహస్యమైనది, అన్ని వేదాలలో నిర్ధారింపబడినది అయిన ఈ జ్ఞానం నిర్మలమైన మనసు కలిగిన ధర్మస్వభావులకి, అహితాగ్నులైన వారికి మాత్రమే ఉపదేశించ తగింది.

## శివ తాండవం

యోగేశ్వరుడైన శంకరుడు తనతత్వాన్ని ఋషులకీ మునులకీ బోధించిన తరువాత, ఆనంద తన్మయత్వంతో తన విభూతిని ప్రదర్శిస్తూ నృత్యం చేసాడు. అదే ఆనందతాండవం. పరమేశ్వరుడు ఆ విధంగా ఆకాశంలో నృత్యం చేస్తుంటే శ్రీమహావిష్ణువుతో సహా దేవతలు, జితేంద్రియులైన యోగులు, సిద్ధులు ఎంతో ఆనందంతో ఆ నృత్యాన్ని దర్శించారు. ఈ సకల ప్రపంచం ఎవరి సంకల్పంతో ప్రవర్తిస్తుందో అలాంటి పరమేశ్వరుడు ఆ విధంగా ఆనందతాండవం చేస్తూ బ్రహ్మాది దేవతలకి దర్శనమిచ్చాడు. ఎవరి పాద పద్మాల్ని స్మరించటం ద్వారా సకల భూతాలూ అజ్ఞానం వల్ల కలిగే భయాల్ని పోగొట్టుకుంటారో అలాంటి సకలభూతేశ్వరుడు ఆనంద తాండవాన్ని వారంతా దర్శించగలిగారు.

నిద్రను విడిచిపెట్టి, ప్రాణాయామాన్ని ఆచరించి, ఇంద్రియ నిగ్రహాన్ని పెంపొందించుకున్న భక్తులు మాత్రమే జ్యోతి స్వరూపుడైన మహాయోగీశ్వరుణ్ణి దర్శించగలరు. అలాంటి భక్తవత్సలుడైన శివుడు ప్రసన్నుడైతే జీవులందర్నీ అజ్ఞానం నుంచి బైటపడేస్తాడు. ఈ విషయాన్ని గ్రహించిన మునులు, ఋషులు, దేవతలు ఆనందతాండవం చేస్తు పరమేశ్వరుడి విశ్వరూపాన్ని చూసారు. ఆ మహాదేవుడి దివ్యరూపం ఎలా ఉందంటే!

## శివుడి విశ్వరూపం

సహస్రశిరసం దేవం సహస్రచరణాకృతిమ్ ।
సహస్రబాహుం జటిలం చంద్రార్థకృతశేఖరమ్ ॥ 1

వసానం చర్మ వైయ్యాఘ్రం శూలాసక్తమహాకరమ్ ।
దండపాణిం త్రయీనేత్రం సూర్యసోమాగ్నిలోచనమ్ ॥ 2

బ్రహ్మాండం తేజసా స్వేన సర్వమావృత్య చ స్థితమ్ ।
దంష్ట్రాకరాళం దుర్ధర్షం సూర్యకోటి సమప్రభమ్ ॥ 3

అణ్డస్థం చాణ్డబాహ్యస్థం బ్రాహ్మ మభ్యంతరం పరమ్ ।
సృజన్త మనలజ్వాలం దహంత మఖిలం జగత్ ।
నృత్యన్తం దదృశుః దేవం విశ్వకర్మాణ మీశ్వరమ్ ॥ 4

మహాదేవం మహాయోగం దేవానామపి దైవతమ్ ।
పశూనాం పతి మీశానం జ్యోతిషాం జ్యోతి రవ్యయమ్ ॥ 5

పినాకినం విశాలాక్షం భేషజం భవరోగిణాం ।
కాలాత్మానం కాలకాలం దేవదేవం మహేశ్వరమ్ ॥ 6

ఉమాపతిం విరూపాక్షం యోగానందమయం పరమ్ ।
జ్ఞానవైరాగ్యనిలయం జ్ఞానయోగం సనాతనమ్ ॥ 7

శాశ్వతైశ్వర్యవిభవం ధర్మాధారం దురాసదమ్ ।
మహేన్ద్రోపేన్ద్రనమితం మహర్షిగణవందితమ్ ॥ 8

ఆధారం సర్వశక్తీనాం మహాయోగేశ్వరేశ్వరమ్ ।
యోగినాం పరమం బ్రహ్మ యోగినం యోగవన్దితమ్ ।
యోగినాం హృది తిష్ఠన్తం యోగమాయాసమావృతమ్ ॥ 9

క్షణేన జగతో యోనిం నారాయణ మనామయం ।
ఈశ్వరే ణైకతాపన్న మపశ్యన్ బ్రహ్మవాదినః ॥ 10

*(శ్లో॥8-17,అధ్యా-5)*

ఆ పరమ రుద్రుడు వేయి శిరస్సులు, వేయి చేతులు కలవాడు జటాధారి. అర్ధచంద్రుని శిరమున ఆభరణముగా కలవాడు, వ్యాఘ్ర చర్మమును ధరించేవాడు. పొడవైన చేతిలో శూలము ధరించువాడు. దండపాణి, వేదత్రయమును నేత్రములుగా కలవాడు. సూర్య చంద్రాగ్నులు నేత్రములుగా కలవాడు. సకల బ్రహ్మాండమును తన తేజస్సుతో అధిష్ఠించి వున్నవాడు, దంష్ట్రలతో భయంకరమైన వక్త్రము గలవాడు. ఇతరులచే ఓడించబడనివాడు కోటి సూర్యులతో సమానమైన కాంతిగలవాడు. అగ్ని జ్వాలలను సృష్టించి అఖిల జగత్తును దహించేవాడు. సకల జగత్తును సృజించేవాడైన ఈశ్వరుని నృత్యం చేస్తుండగా చూసారు. ఈ పరమేశ్వరుడు మహాదేవుడు, మహాయోగస్వరూపుడు, దేవతలకు కూడ దేవత, పశుపతి, నిఖిల జగచ్ఛాసకుడు, ఆనందరూపుడు, జ్యోతి స్వరూపుడు, నాశము లేనివాడు, ధనువును ధరించినవాడు, విశాలనేత్రుడు, సంసార వ్యాధిగ్రస్తులకు

దివ్యౌషధము. కాలస్వరూపుడు, యమునికి యముడు, దేవదేవుడు, మహేశ్వరుడు, ఉమాపతి, విశాలనేత్రుడు, యోగరూపుడు, పరమానందరూపుడు, జ్ఞాన వైరాగ్యనిలయుడు, జ్ఞానయోగమును శరీరముగా కలవాడు, సనాతనుడు. ఉత్పత్తి నాశములు లేని ఐశ్వర్య వైభవములు కలవాడు. ధర్మమునకు ఆధారభూతుడు. అందరానివాడు. మహేంద్ర ఉపేంద్రాదులతో, మహర్షి గణములతో నమస్కరించబడేవాడు. యోగుల హృదయాలలో నివసించేవాడు. యోగమాయచే ఆవరించబడి ఉన్నవాడు. జగత్కారణభూతుడు.

అటువంటి మహాదేవుడి విశ్వరూపంలో ఆద్యంతాలు లేని శ్రీమహావిష్ణువు అందరూ చూస్తుండగా ఐక్యమైపోయాడు. ఆ విధంగా నారాయణుణ్ణి తనలో నింపుకున్న పరమేశ్వరుణ్ణి చూసి, బ్రహ్మావాదులంతా తమ జీవితాలు ఎంతో ధన్యమయ్యాయని భావించారు.

సనత్కుమారుడు, సనకుడు, భృగువు, సనాతనుడు, సనందుడు, రుద్రుడు, అంగిరసుడు, వామదేవుడు, శుక్రుడు, అత్రి, కపిల, మరీచ్యాది మహర్షులందరూ నారాయణుణ్ణి ఎడమభాగంలో ధరించిన పరమేశ్వరుడికి శిరసు వంచి నమస్కరించి ఆయన దివ్యమంగళాకారాన్ని తమ మనసుల్లో నిలుపుకుని పరిపూర్ణమైన ఆనందంతో, వేదమయమైన వాక్కులతో ఇలా కీర్తించారు.

## మహర్షులు చేసిన శివుడి విశ్వరూప స్తుతి

త్వా మేక మీశం పురుషం పురాణం ప్రాణేశ్వరం రుద్ర మనన్తయోగమ్ ।
నమామ సర్వే హృది సంనివిష్టం ప్రచేతసం బ్రహ్మమయం పవిత్రమ్ ॥ 1

త్వాం పశ్యంతి మునయో బ్రహ్మ యోనిం దాన్తాః శాన్తాః విమలం రుక్మవర్ణమ్ ।
ధ్యాత్వాత్మస్థమచలం స్వే శరీరే కవిం పరేభ్యః పరమం తత్పరం చ ॥ 2

త్వత్తః ప్రసూతా జగతః ప్రసూతిః సర్వాత్మభూ స్త్వం పరమాణుభూతః ।
అణో రణీయాన్ మహతో మహీయాం స్త్వామేవ సర్వం ప్రవదన్తి సన్తః ॥ 3

హిరణ్యగర్భో జగదంతరాత్మా త్వత్తో౽ధి జాతః పురుషః పురాణః ।
సంజాయమానో భవతా విసృష్టో యథావిధానం సకలం ససర్జ ॥ 4

త్వత్తో వేదాః సకలాః సమ్ప్రసూతా స్త్వయ్యే వాన్తే సంస్థితిం తే లభంతే ।
పశ్యామ స్త్వాం జగతో హేతుభూతం నృత్యన్తం స్వే హృదయే సంనివిష్టమ్ ॥ 5

త్వయైవ వేదం భ్రామ్యతే బ్రహ్మచక్రమ్ మాయావీ త్వం జగతా మేకనాథః ।
నమామ స్త్వాం శరణం సమ్ప్రపన్నా యోగాత్మానం పరమాకాశమధ్యే ॥ 6

నృత్యన్తం తే మహీమానం స్మరామః సర్వాత్మానం బహుధా సంనివిష్టం ।
బ్రహ్మానంద మనుభూయానుభూయ ॥ 7

ఓంకార స్తే వాచకో ముక్తిబీజం త్వ మక్షరం ప్రకృతౌ గూఢరూపమ్ ।
తత్త్వాం సత్యం ప్రవద న్తీహ సన్తః స్వయం ప్రభం భవతో యత్ప్రకాశం ॥ 8

స్తువంతి త్వాం సతతం సర్వవేదాః నమన్తి త్వా మృషయః క్షీణదోషాః ।
శాంతాత్మానః సత్యసంధా వరిష్టం విశన్తి త్వాం యతయో బ్రహ్మనిష్ఠాః ॥ 9

ఏకో వేదో బహుశాఖో హ్యనన్త స్త్వా మేవైకం బోధయం త్యేకరూపమ్ ।
వేద్యం త్వాం శరణం యే ప్రపన్నా స్తేషాం శాన్తిః శాశ్వతీ నేతరేషామ్ ॥ 10

భవా నీశో౽నాదిమాం స్తేజోరాశి ర్బ్రహ్మా విశ్వం పరమేష్ఠీ వరిష్ఠః ।
స్వాత్మానంద మనుభూయా ధిశేతే స్వయం జ్యోతి రచలో నిత్యముక్తః ॥ 11

ఏకో రుద్రస్త్వం కరోషీహ విశ్వం త్వం పాలయ స్యఖిలం విశ్వరూపః ।
త్వ మేవాన్తే నిలయం విన్దతీదం నమామ స్త్వాం శరణం సమ్ప్రపన్నాః ॥ 12

త్వా మేక మాహుః కవి మేకరుద్రం ప్రాణం బృహన్తం హరి మగ్ని మీశం ।
ఇంద్రం మృత్యు మనిలం చేకితానం ధాతార మాదిత్య మనేకరూపమ్ ॥ 13

త్వ మక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
త్వ మవ్యయః శాశ్వతధర్మగోప్తా సనాతన స్త్వం పురుషోత్తమో౽సి ॥ 14

త్వ మేవ విష్ణు శ్చతురానన స్త్వం త్వమేవ రుద్రో భగవా నధీశః।
త్వం విశ్వనాభిః ప్రకృతిః ప్రతిష్ఠా సర్వేశ్వర స్త్వం పరమేశ్వరో ౽సి॥ 15

త్వా మే క మాహుః పురుషం పురాణ మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।
చిన్మాత్ర మవ్యక్త మచింత్యరూపమ్ ఖం బ్రహ్మశూన్యం ప్రకృతిం నిర్గుణం చ ॥ 16
యదంతరా సర్వమిదం విభాతి య దవ్యయం నిర్మల మేకరూపమ్ ।
కి మప్య చిన్త్యం తవ రూప మేతత్ తదన్తరా య త్ప్రతిభాతి తత్త్వమ్ ॥ 17
యోగేశ్వరం రుద్ర మనంతశక్తిం పరాయణం బహుతనుం పవిత్రమ్ ।
నమామ సర్వే శరణార్థిన స్త్వాం ప్రసీద భూతాధిపతే మహేశ ॥ 18
త్వత్పాదపద్మస్మరణా దశేషసంసారబీజం విలయం ప్రయాతి ।
మనో నియమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయామో వయ మేక మీశమ్ ॥ 19
నమో భవాయాస్తు భవోద్భవాయ కాలాయ సర్వాయ హరాయ తుభ్యమ్ ।
నమోస్తు రుద్రాయ కపర్దినే తే నమోఽగ్నయే దేవ నమః శివాయ ॥ 20

*(శ్లో॥22-41,అధ్యా-5,ఉ)*

"పరమేశ్వరా! తమరొక్కరే ఈశ్వరులు-పురాణ పురుషులు, ప్రాణేశ్వరులు, అనంతయోగస్వరూపులు. సకల జగత్తుకీ చైతన్యం ప్రసాదించేవారు. అలాంటి మీకు నమస్కరిస్తున్నాం. సంసారరూపుడు, సంసారాన్ని సృష్టించేవాడు, సర్వరూపుడు, కాలస్వరూపుడు అయిన పరమేశ్వరుడికి నమస్కారం" అని మునులు చేసిన స్తోత్రం విని జటాజూటధారి అయిన పరమేశ్వరుడు తన విశాల విశ్వరూపాన్ని ఉపసంహరించి తిరిగి యథారూపాన్ని ధరించాడు. అప్పుడు మహర్షులంతా ఆయనకి నమస్కరించి మహేదేవా! నీ వల్ల ఈశ్వర జ్ఞానాన్ని ఆత్మతత్త్వాన్ని తెలుసుకున్నాం. దయచేసి మాకు పరమేశ్వరుడవైన నీ యథార్థ ప్రభావాన్ని గురించి చెప్పు" అని ప్రార్థించారు.

## పరమేశ్వరుడి యథార్థ ప్రభావం

మహర్షులారా! ఇప్పుడు మీరంతా దర్శించిన నా విశ్వరూపం కేవలమైనది. నా మాయ ఎంతటిదో తెలియచేయటానికి దీన్ని మీకు చూపించాను. ఈ సృష్టిలోని అన్ని వస్తువుల్లో సర్వాంతర్యామిగా నేనుంటాను. ఈ జగత్తునంతా నేను ఒకే అంశతో సృష్టిస్తాను. తిరిగి దాన్ని ఒకే అంశంతో లయం చేస్తాను.

ఈ సృష్టి ప్రారంభంలో నేను ప్రకృతి–పురుషుల్ని ప్రేరేపిస్తాను. ఇలా నాచేత ప్రేరేపించబడ్డ ప్రకృతి – పురుషులు పరస్పరం సంయోగం చెందటం వల్ల ఈ ప్రపంచం ఆవిర్భవిస్తోంది. ప్రకృతి నుంచి మహత్తత్త్వం, ఆ మహాత్తత్త్వం నుంచి అహంకారం ఇలా క్రమంగా అన్నీ ఆవిర్భవిస్తాయి. నా దివ్య తేజస్సే జగత్తురూపంలో విస్తరిస్తుంది. ఈ సకల జగత్తునీ సృష్టించటానికి కారణభూతుడైన హిరణ్యగర్భుడైన మార్తాండాడుడు (సూర్యుడు) కూడా నా శరీరం నుంచి పుట్టినవాడే.

ఈ కల్పం ప్రారంభంలో కాల స్వరూపుడైన సూర్య భగవానుడికి సనాతనమైన జ్ఞానయోగం ద్వారా నా నుంచి వెలువడ్డ నాలుగువేదాల్ని ఆయనకిచ్చాను. ఆ విధంగా నా నుంచి వేదాలు స్వీకరించిన హిరణ్యగర్భుడు నా ద్వారా ప్రేరేపించబడి, చతుర్ముఖ బ్రహ్మగా మారి, లోకాలన్నిటినీ సృష్టిస్తున్నాడు. ఇక సృష్టించిన లోకాల్ని పాలించే నారాయణుడు కూడా, నా నుంచి ఆవిర్భవించినవాడే. సకల ప్రాణుల్నీ లయంచేసే రుద్రుడు కూడా నా ఆజ్ఞతోనే ప్రవర్తిస్తాడు. అగ్ని హోత్రుడు కూడా నా ఆజ్ఞతోనే హవ్యాన్ని దేవతలకి, కవ్యాన్ని పితృదేవతలకి అందిస్తాడు. రాత్రి పగలు జీవులు భుజించే ఆహారాన్ని నేనే వైశ్వానరుడనే పేరుతో జీర్ణం చేస్తాను. సకల జీవులకీ ఆధారుడైన వరుణుడు కూడా ఈశ్వరాజ్ఞతోనే జగత్తునంతా జీవింపచేస్తున్నాడు. నా ఆజ్ఞతోనే వాయుదేవుడు జీవుల శరీరాల్లో నిలబడి, వారి ప్రాణాల్ని నిలుపుతున్నాడు. మానవులందర్నీ జీవింపచేస్తూ దేవతలకి అమృతాన్నందించే చంద్రుడు కూడా, నా ఆజ్ఞతోనే ప్రవర్తిస్తున్నాడు.

మహర్షులారా! తన దివ్యకాంతితో లోకాలన్నిటినీ ప్రకాశింపచేస్తూ భూమికి వర్షాన్ని అందించే సూర్యభగవానుడు, ముల్లోకాలనీ పరిపాలించే దేవేంద్రుడు నా ఆజ్ఞతోనే ప్రవర్తిస్తున్నారు. పాపుల్ని శాసించే యమధర్మరాజు నా ఆజ్ఞనే పాలిస్తున్నాడు. అలాగే సకలధనాధ్యక్షుడైన కుబేరుడు ఈశ్వరాజ్ఞతోనే అందిరికీ ధనాన్ని ప్రసాదిస్తున్నాడు. సకల రాక్షస గణాలకీ అధిపతి అయిన నిర్ఋతి నా ఆజ్ఞనే సదా పాలిస్తున్నాడు.

భూతభేతాళాది గణాలకి నాయకుడైన ఈశానుడు, అంగిరసుడి శిష్యుడు రుద్రగణాల్లో అగ్రగణ్యుడు అయిన వామదేవుడు నా ఆజ్ఞతోనే సంచరిస్తున్నారు. అలాగే సకల విఘ్నకారకుడు, సకలలోక వంద్యుడు అయిన విఘ్నేశ్వరుడు కూడా నా ఆజ్ఞతోనే ధర్మాన్ని కాపాడుతున్నాడు. బ్రహ్మవేత్త, దేవతల సేనాని అయిన కుమారస్వామి కూడా సర్వేశ్వరుడి ఆజ్ఞతో తన కార్య కలాపాలు కొనసాగిస్తున్నాడు. అదేవిధంగా ప్రజాపతులు, మరీచ్యాది మహర్షులు కూడా పరమాత్మనైన నా ఆజ్ఞతోనే లోకాలన్నిటినీ సృష్టిస్తున్నారు.

శ్రీహరి ప్రియపత్ని అయిన లక్ష్మీదేవి, సకల జీవులకీ జ్ఞానాన్ని ప్రసాదించే సరస్వతీదేవి, జీవులందర్నీ ఘోరమైన నరకం నుంచి తప్పించే సావిత్రీదేవి, బ్రహ్మవిద్యా దాయిని అయిన పార్వతీదేవి నా ఆజ్ఞానుసారం వర్తించేవారే. సకల దేవతల చేతా పూజించబడే ఆదిశేషుడు నా ఆజ్ఞతోనే అన్ని లోకాల్నీ తన తలమీద ధరిస్తున్నాడు.

ప్రళయాగ్నిగా సముద్రాల్లో వుండే బడబానలం నా ఆజ్ఞతోనే సముద్రంలోని జలాల్ని త్రాగుతుంది. ఎంతో తేజోవంతులైన పద్నాలుగు మంది మనువులు ఈశ్వరాజ్ఞతోనే లోకాల్ని పాలిస్తున్నారు. ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, ఏకాదశ రుద్రులు, సప్తమరుత్తులు, అశ్వినీదేవతలు, వీరంతా నా ఆజ్ఞలతోనే తమ కార్యకలాపాలు కొనసాగిస్తున్నారు. వీరితో పాటు, గరుడ, గంధర్వ, ఋక్ష, సిద్ధ, సాధ్య, చరణ, యక్ష, రాక్షస, పిశాచగణాలు కూడా ఈశ్వరుడి శాసనాన్ని అనుసరించేవారే. అలాగే కల, కాష్ఠ, ముహూర్త, నిమేష, దిన, రాత్రి, ఋతు, పక్ష, మాసాలన్నీ పరమేశ్వరుడి శాసనంతో సంచరిస్తున్నాయి.

నాలుగు యుగాలు, పద్నాలుగు మన్వంతరాలు నా ఆజ్ఞతోనే నడుస్తున్నాయి. నాలుగు విధాల ప్రాణులు, స్థావర జంగమాలు పరమాత్మ ఆజ్ఞతోనే ప్రవర్తిస్తున్నాయి. పాతాళాది సకలలోకాలు, అఖిల బ్రహ్మాండాలు, సృష్టించబోయే బ్రహ్మాండాలు అన్నీ ఈశ్వరాజ్ఞని శిరసావహిస్తున్నవే.

భూమి, నీరు, నిప్పు, వాయువు, ఆకాశం, మనసు, బుద్ధి, తామసాహంకారం, ఆదిప్రకృతి ఇవన్నీ ఈశ్వరుడనైన నా ఆజ్ఞతోనే ప్రవర్తిస్తున్నాయి. ఈ సకల జగత్తుకీ కారణభూతమైనది, సకల జీవుల్నీ మోహింపచేసేది అయిన మాయ కూడా ఎప్పుడూ ఈశ్వరాజ్ఞతోనే నడుస్తుంది. జీవుల శరీరంలో ఉండే ఆత్మస్వరూపుడైన పరమపురుషుడు కూడా ఈశ్వరాజ్ఞతోనే అన్ని కార్యాలూ నిర్వహించగలుగుతాడు. అందరి మోహాల్నీ తొలగించి పరమపదానికి దారిచూపే విద్యకూడా పరమేశ్వరుడి ఆజ్ఞని అనుసరించే ప్రవర్తిస్తుంది. ఇంతగా చెప్పటం ఎందుకు? ఈ చరాచర జగత్తు మొత్తం నా శక్తి స్వరూపమే. ఇదంతా నాతో ప్రేరేపించబడి, చివరికి నాలోనే లీనమైపోతుంది.

అహం హి భగవానీశః స్వయం జ్యోతిః సనాతనః ।
పరమాత్మా పరంబ్రహ్మ మత్తో హ్యన్యన్నవిద్యతే ॥
ఇత్యేతత్ పరమంజ్ఞానం యుష్మాకం కథితం మయా ।
జ్ఞాత్వా విముచ్యతే జన్తుర్జన్మసంసార బంధనాత్ ॥

*(శ్లో॥51-52,అధ్యా-7)*

ఋషులారా! నేను పరమాత్మని, ఈశ్వరుణ్ణి, స్వయంప్రకాశుణ్ణి, సనాతనుణ్ణి, పరబ్రహ్మని, నాకన్నా భిన్నంగా నేను కానిదేదీ లేదు. ఇది పరమజ్ఞానం. దీన్ని మీకు సవివరంగా తెలియచేసాను. శ్రద్ధతో ఈ జ్ఞానాన్ని పొందినవాడు జన్మ, సంసారబంధాల నుంచి విముక్తి పొందుతాడు. నా చేత చెప్పబడ్డ ఈ పరమాత్మ ప్రభావాన్ని తెలుసుకున్నవాడు సంసారంలో చిక్కుకోడు. ఈ విధంగా పరమేశ్వరుడు ఋషులకి తన యథార్థ భావాన్ని తెలియచేసాడు.

## అన్నిటా ఈశ్వరుడు

ఆదిదేవుడైన పరమేశ్వరుడు సర్వాంతర్యామి. ఈ చరాచర సృష్టిలో ఉన్న అన్ని పదార్థాలలో ఆయన కొలువైవున్నాడు. ఆ పరమేశ్వరుడు బ్రహ్మజ్ఞానుల్లో – చతుర్ముఖ బ్రహ్మగా, మాయావుల్లో శ్రీహరిగా, యోగుల్లో – శంభుడిగా, స్త్రీలలో – పార్వతీదేవిగా, ఆదిత్యులలో – విష్ణువుగా, వసువుల్లో – పావకుడుగా,

ఎగిరే పక్షుల్లో – గండభేరుండంగా, గజేంద్రుల్లో – ఐరావతంగా, శస్త్రధారుల్లో – శ్రీరాముడుగా, ఋషుల్లో – వశిష్ఠ మహర్షిగా, దేవతల్లో – దేవేంద్రుడిగా, శిల్పుల్లో – విశ్వకర్మగా, దైత్యుల్లో – ప్రహ్లాదుడుగా, మహర్షుల్లో – వ్యాసుడుగా, గణాలలో – వినాయకుడిగా, వీరుల్లో – వీరభద్రుడిగా, సిద్ధుల్లో – కపిలమునిగా, పర్వతాల్లో – మేరుపర్వతంగా, నక్షత్రాలలో –చంద్రుడిగా, ఆయుధాల్లో – వజ్రాయుధంగా కొలువై ఉన్నాడు.

వ్రతాల్లో – సత్యనారాయణ వ్రతంగా, భోగుల్లో – అనంతుడుగా, సేనాపతుల్లో – కుమారస్వామిగా, ఆశ్రమాలలో – గృహస్థాశ్రమంగా, ఈశ్వరుల్లో – మహేశ్వరుడుగా, కల్పాలలో – మహాకల్పంగా, యుగాల్లో – కృతయుగంగా, యక్షుల్లో – కుబేరుడిగా, గణేశ్వరుల్లో – వీరకుడిగా, ప్రజాపతుల్లో – దక్షుడిగా, రాక్షసుల్లో – నిర్రృతిగా, బలవంతుల్లో – వాయుదేవుడుగా, ద్వీపాలలో – పుష్కరద్వీపంగా, మృగరాజుల్లో – సింహంగా, యంత్రాలలో – ధనువుగా, వేదాల్లో – సామవేదంగా, యజుర్మంత్రాలలో – శతరుద్రీయంగా, మంత్రాలలో – సావిత్రీ (గాయత్రీ) మంత్రంగా, రహస్యాలలో – ఓంకారంగా, సూక్తాలలో – పురుష సూక్తంగా, సామాలలో – జ్యేష్ఠసామంగా, వేదార్థం తెలిసినవారిలో – స్వాయంభువ మనువుగా, దేశాలలో – బ్రహ్మావర్తంగా, క్షేత్రాలలో – అవిముక్త క్షేత్రంగా కొలువై వున్నాడు.

విద్యల్లో – ఆత్మవిద్యగా, జ్ఞానాలలో – పరమేశ్వర జ్ఞానంగా, పంచభూతాలలో – ఆకాశంగా, సత్వాలలో –మృత్యువుగా, పాశాలలో – మాయాపాశంగా, సంహరించే వాటిలో – కాలంగా, ఉత్తమగతుల్లో – మోక్షంగా, ఉత్తములందరితో పరమేశ్వరుడు కొలువై వున్నాడు.

ఈ సంసారంలో ఉన్న ఆత్మలన్నీ (జీవాత్మలు) పశువులని చెప్పబడ్డాయి. అలాంటి పశువులందరికీ పతి కాబట్టి పరమేశ్వరుడు పశుపతి అయ్యాడు.

## గురువులు

ఉపాధ్యాయః పితాజ్యేష్ఠో భ్రాతా చైవమహీపతిః ।
మాతుల శ్వశురస్త్రాతా మాతామహ పితామహౌ ॥

వర్ణజ్యేష్టః పితృవ్యశ్చ పుంసోఽత్ర గురవః స్మృతాః ।
మాతా మాతామహీ గుర్వీ పితుర్మాతుశ్చ సోదరాః ॥

శ్వశ్రూః పితామహీ జ్యేష్ఠా ధాత్రీ చ గురువః స్త్రియః ।
ఇత్యుక్తో గురువర్గోఽయం మాతృతః పితృతో ద్విజాః ।
అనువర్తనమే తేషాం మనోవాక్కాయ కర్మభిః ॥

*(శ్లో॥26-28,అధ్యా-12,ఉ)*

ఉపాధ్యాయుడు, తండ్రి, పెద్దన్నయ్య, రాజు, మేనమామ, పిల్లనిచ్చిన మామ, రక్షకుడు, తల్లితండ్రి (మాతామహుడు), తండ్రి తండ్రి (పితామహుడు), జ్యేష్ఠ వర్ణుడు, పెదనాన్న, పినతండ్రి వీరంతా గురువులు. అలాగే తల్లి తల్లి (అమ్మమ్మ), తండ్రి తల్లి (నాయనమ్మ), గురుపత్ని, పినతల్లి (పిన్ని) మేనత్త, అత్త, పెద్దమ్మ, పెద్దక్క, పోషించిన స్త్రీ - వీరు కూడా గురువులుగా చెప్పబడ్డారు. గురుస్థానంలో ఉన్న వీరందర్నీ మనోవాక్కాయ కర్మలతో సేవించాలి. వీరిని గౌరవించి గురువులుగా పూజించాలి.

గురుందృష్ట్వా సముత్తిష్ఠే దభివాద్య కృతాంజలిః ।
నైతైరుపవిశేత్ సార్ధం వివదేన్నాత్మకారణాత్ ॥

జీవితార్థమపిద్వేషాత్ గురభిర్నైవ భాషణమ్ ।
ఉదితోఽపి గుణై రన్యై ర్గురుద్వేషీ పతత్యధః ॥

*(శ్లో॥29-30,అధ్యా-12,ఉ)*

గురువు కనపడిన వెంటనే కూర్చున్న ఆసనం నుంచి లేచి రెండు చేతులూ జోడించి విధిగా నమస్కరించాలి. గురువుతో కలిసి ఒకే ఆసనం మీద ఎప్పుడూ కూర్చోకూడదు. తనకోసం గానీ, బ్రతుకుతెరువు కోసం గానీ గురువుతో ఎప్పుడూ వాదన చేయకూడదు. గురువుతో ఆగ్రహంగా,

ద్వేషపూరితంగా ప్రసంగించకూడదు. గురువు దగ్గర అవగుణాలున్నప్పటికీ గురువుని ద్వేషించకూడదు. అలా ద్వేషించిన వాడు పతితుడవుతాడు.

గురుణామపి సర్వేషాం పూజ్యాః పంచ విశేషతః ।
తేషామాద్యా స్త్రయశ్రేష్ఠా స్తేషాం మాతా సుపూజితా ॥
యో భావయతి యాసూతే యేన విద్యోపదిశ్యతే ।
జ్యేష్ఠోభ్రాతా చ భర్తా చ పంచైతే గురవస్మృతాః ॥
ఆత్మనస్సర్వయత్నేన ప్రాణత్యాగేన వా పునః ।
పూజనీయా విశేషేణ పంచైతే భూతమిచ్ఛతా ॥

*(శ్లో॥31-33,అధ్యా-12,ఉ)*

గురువులందరిలో విశేషంగా, పూజ్యులుగా చెప్పబడిన వారు ఐదుగురు. 1.తల్లి 2.తండ్రి 3.విద్యని ఉపదేశించినవాడు 4.పెద్దసోదరుడు 5.భర్త. వీరిలో మొదటి ముగ్గురూ ఉత్తమ గురువులు. వీరిని అన్ని ప్రయత్నాలూ చేసి, చివరికి ప్రాణాలు సమర్పించైనా సరే విశేషంగా సేవించాలి.

పుత్రుల గుణాలు మంచివైతే తల్లితండ్రులు సంతోషిస్తారు. వారు గనుక సంతోషిస్తే ఆ పుత్రుడు అన్ని ధర్మాలు పాటించి వాటి ఫలితాలు కూడా పొందుతాడు. "నాస్తి మాతృసమం దైవం నాస్తి పితా సమోగురు" – తల్లి కన్నా దైవం లేదు. తండ్రి కన్నా మించిన గురువు లేడు. ఎంత కష్టపడ్డా వారికి ప్రత్యుపకారాన్ని మనం చేయలేం. ఇక పెద్దసోదరుడు తండ్రితో సమానమైనవాడు. అలాంటి వాడిని అవమానిస్తే ఘోరమైన నరకానికి వెళతారు.

ఉత్తములైన పుత్రులు త్రికరణ శుద్ధిగా తల్లి తండ్రులకి ప్రీతి కలిగించే పనులే చేయాలి. వారి అనుమతి లేకుండా ఇతర ధర్మాల్ని, ఆచారాల్ని ఆచరించకూడదు. తల్లితండ్రుల సేవ ఇహపరసాధకం. గురువుని చక్కగా ఆరాధించి ఆయన ఆజ్ఞని పాటించిన శిష్యుడు ఇహలోకంలో ఉన్నత విద్యాఫలాన్ని, పరలోకంలో తాను ఆచరించిన ధర్మ ఫలాన్ని సంపూర్ణంగా అనుభవిస్తాడు.

# ఉత్తమ ధర్మాలు

★ ఉత్తమ ధర్మాన్ని ఆచరించాలనుకునే పురుషుడు తనని భరించి పోషించిన దాతని సర్వదా పూజించాలి. తనకి ఉపకారం చేసిన వాడికి ప్రత్యుపకారంగా ప్రాణాల్నైనా అర్పించగలగాలి. అలా చేసినవాడు అక్షయలోకాలకి వెళతాడు.

★ మేనమామలు, పినతండ్రులు, ఋత్విజులు వచ్చినప్పుడు ఎదురుగా వెళ్ళి నమస్కరించి ఆహ్వానించాలి.

★ వయసులో తనకన్నా చిన్నవాడైనప్పటికీ యజ్ఞదీక్షితుడైన వాడిని పేరుపెట్టి పిలవకూడదు.

★ సంపదలు కావాలనుకునే క్షత్రియులు నిత్యం ఆదరంతో బ్రాహ్మణులకి నమస్కరించి పూజించాలి.

★ బ్రాహ్మణుడు క్షత్రియాది వర్ణాలవారికి ఎప్పుడూ నమస్కరించకూడదు. ఆ క్షత్రియులు ఎంతగొప్పవారైనా ఎన్నో శాస్త్రాలు అభ్యసించినవారైనప్పటికీ నమస్కరించకూడదు.

★ బ్రాహ్మణుడికి అగ్ని గురువు. స్త్రీలకి భర్త గురువు. అభ్యాగతుడు అందరికీ గురువు.

★ విద్య, కర్మ, వయసు, బంధుత్వం, ధనం అనే ఈ అయిదూ పూజస్థానాలు. వీటిలో చివరినుంచీ ఒకదాన్నికన్నా ఒకటి గొప్పది. ఈ అయిదు గుణాలున్న పురుషుడు శూద్రుడైనప్పటికీ, చిన్నవాడైనప్పటికీ పూజనీయుడే.

★ విప్రుడికి, స్త్రీకి, రాజుకి, కళ్ళులేనివాడికి, వృద్ధుడికి, బరువులు మోస్తున్న వాడికి, రోగికి, బలహీనుడికి దారి ఇవ్వాలి.

★ తల్లిని, తన పినతల్లిని, సోదరిని, తనని ఎప్పుడూ అవమానించని స్త్రీ నుంచే వటువు మొదటి భిక్షని స్వీకరించాలి.

★ బ్రహ్మచారి ప్రతిరోజూ శిష్టాచారాన్ని పాటించేవారి ఇంటికి భిక్షాటనకు వెళ్ళి ఆ భిక్షను తెచ్చి మొదటిగా గురువుకి నివేదించి, ఆయన ఆజ్ఞతో తాను భుజించాలి.

★బ్రహ్మచారి యజ్ఞాలు లోపించని చోట, ధర్మాల్ని ఆచరించేవారి ఇంట ప్రయత్న పూర్వకంగా భిక్షాటన చేయాలి.

★గురువుల ఇళ్ళలో, జ్ఞాతుల ఇళ్ళలో, బంధువుల ఇళ్ళలో భిక్షాటన చేయకూడదు.

పూజయే దశనం నిత్యం అద్యాచ్చైత దకుత్సయన్ ।
దృష్ట్వా హృష్యేత్ ప్రసీదేచ్ఛ ప్రతి సందేచ్ఛ సర్వశః ॥
అనారోగ్య మనాయుష్య మస్వర్గ్యం చాతిభోజనమ్ ।
అపుణ్యంలోక విద్విష్టం తస్మాత్త త్పరివర్జయేత్ ॥

*(శ్లో॥61-62,అధ్యా-13,ఉ)*

అన్నాన్ని ఎప్పుడూ పూజించాలి. అన్నాన్ని ఎప్పుడూ నిందించకూడదు. అన్నాన్ని చూసి సంతోషించాలి. అన్నం తిని ప్రసన్నుడు కావాలి. అన్నాన్ని త్రికరణ శుద్ధిగా గౌరవించాలి. అతిగా భోజనం చేయటం వల్ల అనారోగ్యం, ఆయుష్షు తగ్గిపోవటం, నరకానికి వెళ్ళటం జరుగుతుంది. అతిగా భోజనం చేసేవాడు లోకులచేత నిందించబడతాడు. కనుక అతిభోజనాన్ని ఎప్పుడూ విడిచిపెట్టాలి.

ప్రాజ్ముఖో౽ న్నాని భుంజీత సూర్యాభిముఖఏవవా ।
నాద్యాదుదన్ముఖో నిత్యం విధిరేష సనాతనః ।
ప్రక్షాళ్యపాణి పాదేచ భుంజానోద్విరుపస్పృశేత్ ।
శుచేదేశే సమాసీనో భుక్త్వాచ ద్విరుప స్పృశేత్ ॥

*(శ్లో॥63-64,ఉధ్యా-13,ఉ)*

భోజనాన్ని చేసేవాడు తూర్పుముఖంగా కానీ సూర్యాభిముఖంగా కానీ కూర్చుని భుజించాలి. ఉత్తరదిశవైపు ముఖంపెట్టి భుజించకూడదు. ఇది సనాతన ధర్మం. భోజనం చేయటానికి ముందు కాళ్ళు చేతులు కడుక్కుని రెండుసార్లు ఆచమనం చేసి పరిశుభ్రమైన ప్రదేశంలో కూర్చుని భుజించాలి. భోజనం చేసిన తరువాత తిరిగి రెండుసార్లు ఆచమనం చేయాలి.

**ఆచమన విధి :** భోజనం చేసి, మంచినీళ్ళు త్రాగి, నిద్రపోయి లేచి, దారిలో నడిచి, స్త్రీలని చుంబించినప్పుడు, వస్త్రాలు ధరించినప్పుడు, మూత్రం, రేతస్సు, పురీషం విడిచినప్పుడు, నాలుగు దారుల కూడలిలో నడిచినప్పుడు, స్మశానాన్ని చేరినప్పుడు, ఉభయసంధ్యా సమయాలలో ఆచమనం చేయాలి.

ఛండాలురతో, మ్లేచ్ఛులతో మాట్లాడినప్పుడు, స్త్రీలతో, శూద్రులతో, ఎంగిలి ముఖం ఉన్నవారితో మాట్లాడినప్పుడు, ఎంగిలి అన్నాన్ని తాకినప్పుడు, కన్నీరు, రక్తం స్రవించినప్పుడు ఆచమనం చేయాలి.

అగ్నిని, ఆవుని, తాకినప్పుడు, బాగా శ్రమచేస్తున్నవాడిని, స్త్రీని తాకినప్పుడు, తనను తాను అనవసరమైన ప్రదేశాల్లో తాకినప్పుడు, కటి వస్త్రం ధరించినప్పుడు, తన జుట్టుని తాకినప్పుడు, ఉతకని వస్త్రాలు తాకినప్పుడు, నీళ్ళని గానీ, గడ్డిని కానీ, భూమిని కానీ తాకాలి.

హృద్గాభిః పూయతే విప్రః కంఠ్యాభిః క్షత్రియ శ్శుచిః ।
ప్రాశితాభిస్తథావైశ్యః స్త్రీ శూద్రే స్పర్శతోఽంతతః ॥

*(శ్లో॥15,అధ్యా-13,ఉ)*

అచమనం మనిషిని పవిత్రం చేస్తుంది. ఆ ఆచమన జలం హృదయం దాకా చేరగానే బ్రాహ్మణుడు పవిత్రుడవుతాడు. కంఠందాకా ఆ ఆచమన జలం చేరితే చాలు క్షత్రియుడు పవిత్రుడవుతాడు. ఆచమన జలం నోట్లో పడగానే వైశ్యుడు, చేతితో తాకితే చాలు స్త్రీలు పవిత్రులవుతారు. కనుక ఆచమనాన్ని శ్రద్ధగా విధిగా అందరూ చేయాలి.

## వ్యాసుడు చెప్పిన ధర్మాలు

నహింస్యాత్ సర్వభూతాని నానృతం వావదేత్క్వచిత్ ।
నాహితం నా ప్రియం వాక్యం నస్తేన స్స్యాత్ కదాచన ॥

*(శ్లో॥1,అధ్యా-16,ఉ)*

★ మానవుడు ఏ ప్రాణినీ హింసించకూడదు.

★ ఎప్పుడూ ఎక్కడా అబద్ధం చెప్పకూడదు.

★ అహితాన్ని అప్రియాన్ని కలిగించే మాటలు చెప్పరాదు.

★ దొంగతనం చేయకూడదు.

★ ఇతరుల వస్తువులు గడ్డికానీ, కూరలు కానీ, నీళ్ళుగానీ ఏదీ అపహరించకూడదు. అపహరిస్తే నరకం ప్రాప్తిస్తుంది.

★ రాజునుంచి, శూద్రుడి నుంచి, పతితుడి నుంచి దానం స్వీకరించకూడదు.

★ ప్రతిరోజూ యాచించకూడదు. ఒకే వ్యక్తిని రెండుసార్లు యాచించకూడదు.

★ దేవతలకి సంబంధించిన ద్రవ్యాలని అపహరించకూడదు.

★ ఎంత ఆపదవచ్చినా బ్రాహ్మణ ద్రవ్యం అపహరించకూడదు.

★ విషం విషం కాదు. బ్రాహ్మణుడి సొమ్మే అసలు విషం.

★ పాపాలు చేసి ధర్మం అనే పేరుతో వ్రతాలు నోములు చేయకూడదు.

★ వ్రతాలతో, దీక్షలతో తాము చేసిన పాపాల్ని కప్పిపుచ్చి స్త్రీలని శూద్రుల్ని మోసగించినవాడు, బ్రహ్మజ్ఞులతో నిందించబడతాడు. కపటంతో చేసే వ్రత ఫలం సరాసరి రాక్షసులకే చేరుతుంది.

★ దైవద్రోహం కన్నా గురుద్రోహం కోటిరెట్లు అధికమైన పాపాల్ని కలిగిస్తుంది.

★ గురుద్రోహం కన్నా వేదాల్ని నిందించటం, నాస్తికభావాల్ని ప్రచారం చెయ్యటం కోటిరెట్లు అధికపాపాన్నిస్తుంది.

★ శ్రోత్రియులు కానివారికి, వేదవిహిత ఆచారాల్ని పాటించని వారికి చేసిన దానం నిష్ఫలం.

★ పుణ్యనదులు ప్రవహించేచోట విప్రులు నివసించాలి.

★ నదీతీరం నుంచి ఒక మైలు దూరం లోపే విప్రుడు నివసించాలి. అంత్యజుల గ్రామ సమీపంలో నివసించకూడదు.

★ సూతకం ఉన్నవారితో మాట్లాడకూడదు.

★ ఎదుటివారు తమకు చెప్పిన రహస్యాలని బయటపెట్టి వారికి సంతాపం కలిగించకూడదు.

★ రజస్వలా స్త్రీతో మాట్లాడకూడదు.

★ దేవతలకి, గురువులకి, విప్రులకి, చేసే దానాన్ని ఆటంకరపచకూడదు.

★ అవసరం లేకుండా ఉదయించే సూర్యుణ్ణిగానీ, చంద్రుణ్ణిగానీ అలాగే అస్తమించే సూర్య-చంద్రుల్నిగానీ, నీళ్ళలో ప్రతిబింబంలా, గ్రహణంలో పట్టి ఉన్నప్పుడు, ఆకాశం మధ్యలో ఉన్నప్పుడు వారిని దర్శించకూడదు.

★ నగ్నంగా ఉన్న స్త్రీనిగాని, పురుషుణ్ణిగానీ చూడకూడదు.

★ మలమూత్ర విసర్జన చేస్తున్నవాణ్ణి, మిథునంమీద ఆసక్తి ఉన్నవాణ్ణి చూడకూడదు.

★ మైలతో ఉన్నప్పుడు, సూర్యచంద్ర గ్రహణాలని చూడకూడదు.

★ తుమ్ముతున్నప్పుడు, ఆవులిస్తున్నప్పుడు సుఖాసనం మీద ఉన్నప్పుడు భార్యను చూడకూడదు.

★ నీళ్ళలో తన ప్రతిబింబాన్ని చూడకూడదు.

★ మూత్రాన్ని దాటకూడదు. మూత్రం మీద కూర్చోకూడదు.

★ నువ్వులు, అన్నం, పాయసం, పెరుగు, తేనె, నేయి, కృష్ణాజినం, హవిస్సు వీటిని శూద్రుడికి ఇవ్వకూడదు.

★ గోళ్ళతో నేలమీద రాయకూడదు.

★ ఒక నది దగ్గర మరొక నది గురించి ఒక పర్వతం దగ్గర మరొక పర్వతం గురించి మాట్లాడకూడదు.

★ తన ఇంటికి, తనతో భోజనానికి కలిసి వచ్చేవాడిని విడిచిపెట్టకూడదు.

★ నగ్నంగా నీళ్ళలో దిగి స్నానం చేయకూడదు. అగ్నిని దాటకూడదు.

★ తలపై రాయగా మిగిలిన నూనెని వంటిమీద రాసుకోకూడదు.

★ సర్పాలతో శస్త్రాలతో ఆటలాటరాదు.

★ తన అవయవాలని అకారణంగా తాకరాదు.

★ గుప్తావయవాలని, రోమాలని స్పృశించకూడదు.

★ శిశ్న, ఉదర, కర్ణ చాపల్యాన్ని ప్రదర్శించకూడదు.

★ దోసిలితో నీరు త్రాగకూడదు.

★ కాళ్ళతో, చేతులతో నీళ్ళని కొట్టకూడదు.

★ ఇటుకలతో పండ్లని రాలగొట్టకూడదు.

★ గోళ్ళతో చీల్చటం, తుంచటం, కోయటం, వ్రాయటం, మర్దించటం చేయకూడదు.

★ పళ్ళెం ఒడిలో పెట్టుకుని భుజించకూడదు.

★ నాట్యం, వాద్యం, గానం వీటిని కాలనియమం లేకుండా ఎప్పుడూ చేయకూడదు.

★ తలను రెండు చేతులతో గోకరాదు.

★ లౌకిక స్తోత్రాలతో దేవుళ్ళని స్తుతించకూడదు.

★ పాచికలు ఆట కూడదు. అకారణంగా పరుగెత్తకూడదు.

★ నీళ్ళలో మల మూత్రాలు విసర్జించకూడదు.

★ ఎంగిలి నోటితో ఉండరాదు.

★ నగ్నంగా స్నానం చేయకూడదు, నగ్నంగా నడవకూడదు. నగ్నంగా ఉన్నప్పుడు పుస్తకాలు చదవకూడదు.

★ దంతాలతో, గోళ్ళతో వెంట్రుకల్ని పీకకూడదు.

★ నిద్రపోతున్నవారిని అకారణంగా లేపకూడదు.

★ ఎవరూ లేని ఇంట్లో ఒక్కడే నిద్రపోకూడదు.

★ తన పాదరక్షలు తానే పట్టుకుని వెళ్ళకూడదు.

★ అకారణంగా పదే పదే ఉమ్మకూడదు.

★ కాళ్ళతో రుద్దుతూ కాళ్ళని కడగకూడదు.

★ నిప్పుతో కాళ్ళని కాచరాదు. రాగిపాత్రలో కాళ్ళు కడగకూడదు.

★ దేవతలు, బ్రాహ్మణులు, గోవులు వున్నవైపు కాళ్ళు చాచకూడదు.

★ ఉభయ సంధ్యల్లో, మధ్యాహ్న సమయాల్లో నిద్రపోకూడదు.

★ ఆసనాన్ని పాదాలతో తాకరాదు.

★ అపవిత్రుడిగా (మైలలో) ఉన్నప్పుడు అగ్నిని ఉపాసించకూడదు.

★ ఎడమ చేత్తో నీళ్ళని తీసుకుని త్రాగకూడదు.

★ నీటిలో రేతస్సు విడవకూడదు.

★ వేగంగా ప్రవహించే నదిని ఎట్టి పరిస్థితుల్లో దాటరాదు.

★ నీళ్ళలో ఉండి సంభోగం చేయకూడదు.

★ రావి చెట్టును ఎప్పుడూ ఖండించకూడదు.

★ నీళ్ళలో ఉమ్మి వేయకూడదు.

★ ఎముకలు, కపాలం, బూడిద, వెంట్రుకలు, ముళ్ళకంపలు, ఊక, బంగారం, బొగ్గులమీద, పిడకల మీద కూర్చోకూడదు.

★ నిప్పుని నోటితో ఊదకూడదు.

★ బావిలోకి దిగరాదు.

★ అగ్నిని అగ్నిలో పడవేయకూడదు.

★ అగ్నిని (యాగాగ్ని) నీళ్ళతో చల్లార్చకూడదు.

★ మిత్రుడి మరణాన్ని, దుఃఖాన్ని తనకి తానుగా ఇతరులకి చెప్పకూడదు.

★ అమ్మకూడని వస్తువుల్ని, మోసం చేసి సంపాదించిన వస్తువుల్ని ఇతరులకి అమ్మకూడదు.

★ చేసిన ప్రతిజ్ఞని ఎప్పుడూ విడిచిపెట్టకూడదు.

★ పశువుల్ని పక్షుల్ని, సర్పాల్ని పరస్పరం యుద్ధానికి ఉసిగొల్పకూడదు.

★ తనకి అవసరమైన అన్ని పనుల్నీ చేయించుకుని చివరికి ఆ పనులు చేసిన వాడిని వంచించ కూడదు.

★ సాయంత్రంపూట, ప్రాతఃకాలంలో భిక్షాటన కోసం గృహస్థుల తలుపులు తట్టకూడదు.

★ ఇతరులు ఉపయోగించిన గంధాన్ని, పూలమాలల్ని గ్రహించకూడదు.

★ విప్రుడు భోజనం చేస్తున్నప్పుడు, అది పూర్తికాకుండా మధ్యలో లేవకూడదు. నవ్వుతూ, తుళ్ళుతూ మాట్లాడరాదు.

★ అగ్నిని చేత్తో తాకరాదు. నీళ్ళలో ఎక్కువసేపు నిలుచోకూడదు.

న పక్షకేణోపధమేత్ న శూర్పేణ న పాణినా ।
ముఖేన నదమేదగ్నిం ముఖాదగ్ని రజాయత ॥ *(శ్లో॥84,అధ్యా-17)*

అగ్నిని విసనకర్రతో కానీ, చేత్తో కానీ, విసరకూడదు. నోటితో ఊదకూడదు. ఎందుకంటే 'అగ్ని' అనేది ముఖం నుంచే పుట్టింది కనుక.

★ పరస్త్రీలతో మాట్లాడకూడదు.

★ యజ్ఞార్హత లేనివారితో యజ్ఞాలు చేయించకూడదు.

★ ఒంటరిగా సభలోకి ప్రవేశించకూడదు.

★ అప్రదక్షిణంగా దేవాలయంలోకి ప్రవేశించరాదు.

★ వస్త్రాలతో దేవుళ్ళకి వీచకూడదు. ఒంటరిగా దారిలో నడవకూడదు. వ్యాధిగ్రస్తులతో, పతితులతో కలిసి నడవకూడదు. పాదరక్షలు లేకుండా నడవకూడదు. అగ్ని, గోవు, బ్రాహ్మణుల మధ్యనుంచి నడవకూడదు.

★ యోగుల్ని, సిద్ధుల్ని, యతుల్ని నిందించకూడదు.

★ దేవాలయం నీడని, దేవతల విగ్రహాల నీడని, యజ్ఞదీక్షితుల నీడని, గో, బ్రాహ్మణుల నీడని దాటకూడదు.

★ చల్లుకున్న నీళ్ళని, స్నానంచేయగా మిగిలిన నీళ్ళని, స్నానం చేయటానికి ఉపయోగించిన వస్త్రాన్ని విడిచిపెట్టాలి.

★ మోహంతో బ్రాహ్మణుడు శూద్రుల అన్నాన్ని భక్షించకూడదు.

★ పాయసం, నేతితో వండిన పదార్థాలు, పాలు, పెరుగు, వెన్న, నెయ్యి సత్తుపిండి, తెలకపిండి శూద్రుల నుంచి తీసుకోవచ్చు.

★ శ్రోత్రియులు వంకాయ, అవిశపువ్వు, ఉల్లి, వెల్లుల్లి, చెట్టుబెరడు, పుట్టగొడుగులు, జున్ను, విరిగినపాలు, గురివింద, మోదుగ, తంగేడు, మేడి అల్లనేరేడు వీటిని భుజించకూడదు.

★ పరమాత్మకి నివేదనచేయని నువ్వుల పొంగలి, పాయసం, ఆవుపాలు, దేవతలకి బలిగా సమర్పించిన అన్నం, పురోడాశాది హవ్య పదార్థం, గంజి, కుడితి, కదంబం, వెలగ, జువ్వి – వీటిని స్వీకరించకూడదు.

★ నెయ్యి ద్వారా తయారు చేసిన పదార్థాలు, దేవధాన్యం, నువ్వులతో చేసిన పదార్థాలు, తెలకపిండి, పెరుగు రాత్రిపూట తినకూడదు.

★ పాలు మజ్జిగ కలిపి త్రాగకూడదు.

★ విత్తనాలని అమ్మకూడదు. ★ తిరిగి వేడిచేసిన అన్నం తినకూడదు.

★ దూడలేని ఆవుపాలు, ఒంటెపాలు, ప్రసవించిన పదిరోజులలోపు ఆవుపాలు, గొఱ్ఱెపాలు, గర్భంతో ఉన్న ఆవుపాలు త్రాగకూడదు.

★ కొంగ, హంస, చిలుక, చకోరం, కోకిల, కాకి, కాటుకపిట్ట, డేగ, గ్రద్ధ, గుడ్లగూబ, చక్రవాకం, పావురం, తాబేలు, ఊరకోడి, పెద్దపులి, పిల్లి, కుక్క పంది, నక్క, కోతి, గాడిద మాంసాలని తినకూడదు.

★ చేపలు, మాంసము, నెమలి, లేడి–వీటి మాంసాలని పరిశుద్ధం చేసి తినవచ్చు.

★ విప్రులకి మద్యం ఇవ్వకూడదు. వారు మద్యాన్ని త్రాగకూడదు, చూడకూడదు, తాకకూడదు.

## బ్రాహ్మణులు ఆచరించాల్సిన ధర్మాలు

**స్నానవిధి :** విప్రులు బ్రాహ్మీముహూర్తంలోనే నిద్రలేచి శౌచాది కార్యక్రమాలు ముగించుకుని ప్రాతఃకాల స్నానాన్ని చేయాలి. దీనివల్ల పాపాలు నశిస్తాయి. ఋషిత్వం సిద్ధిస్తుంది. నిద్రపోయి లేచిన వాడి నోటినుంచి, చొంగ కారుతుంది. అలా ఉండగా నిత్య కర్మలు ఆచరించకూడదు, కనుక ప్రాతఃకాల స్నానాన్ని ఆచరించాలి, ప్రాతః కాలస్నానం వల్ల దారిద్ర్యం, కాంతిహీనత,

దుఃస్వప్నాలు, తొలగిపోతాయి. మానవులకి స్నానం లేకుండా జపం, తపం, హోమం ఎలాంటి ఫలితాల్ని ఈయవు. ఒకవేళ పూర్తిగా స్నానం చేయటానికి (శిరఃస్నానం) అనారోగ్యరీత్యా వీలులేనివారు కంఠస్నానమైనా ఆచరించాలి. దానికి కూడా తగిన శక్తిలేకపోతే తడిగుడ్డతో వళ్ళంతా శుభ్రంగా తుడుచుకోవాలి. దీన్ని కపిల స్నానం అంటారు.

బ్రహ్మ మాగ్నేయముద్దిష్టం వాయవ్యం దివ్యమేన వా ।
వారుణం యౌగికం తద్వత్ షోఢా స్నానం ప్రకీర్తితమ్ ॥

*(శ్లో॥12,అధ్యా-18,ఉ)*

పండితులు స్నానం అనేది ఆరువిధాలుగా ఉంటుందని చెబుతారు. 1. బ్రహ్మ స్నానం 2.ఆగ్నేయ స్నానం 3.వాయవ్య స్నానం 4.దివ్య స్నానం 5.వారుణ స్నానం 6.యౌగిక స్నానం అని.

**1. బ్రహ్మ స్నానం :** మంత్రాలు చెబుతూ దర్భలతో నీళ్ళని చల్లుకోవటం.

**2. ఆగ్నేయ స్నానం :** పాదాల నుంచి తలదాకా భస్మాన్ని రాసుకోవటం.

**3. వాయవ్య స్నానం :** గోధూళితో శరీరాన్ని అలుముకోవటం.

**4. దివ్య స్నానం :** ఎండలో వానలో తడవటం.

**5. వారుణ స్నానం :** నదుల్లో, సముద్రాల్లో చెఱువుల్లో చేసే స్నానం.

**6. యౌగిక స్నానం :** ఆత్మ తత్త్వాన్ని ధ్యానించటం, బ్రహ్మజ్ఞానులైనవారు ఎక్కువగా యోగస్నానాన్నే ఆచరిస్తారు. ఈ స్నానాన్ని ఆత్మతీర్థం అంటారు. ఇది మానవుల్ని పవిత్రం చేస్తుంది.

**- దంతధావన విధి -**

★ స్నానానికి ముందు దంతకాష్ఠం (పళ్ళు తోమే పుల్ల)తో దంతాల్ని శుభ్రం చేసుకోవాలి.

★ దంతధావనం చేసిన తరువాత ఆచమనం చేసి ఆ తరువాతే స్నానం చేయాలి.

★ దంతకాష్ఠం మధ్య వేలంత లావుతో, 12 అంగుళాల పొడవుండాలి. అదీ చెట్టు బెరడుతోనే ఆ పుల్ల ఉండాలి.

★ పాలుకారే చెట్టు, మాలతీవృక్షసంబంధమైన కాష్ఠాలైతే మంచిది. అలాగే ఉత్తరేణి, కరవీరం, బిల్వం–వీటి పుల్లలు కూడా పళ్ళు తోమటానికి ఉపయోగిస్తాయి.

★ వేలితో పళ్ళని తోమకూడదు.

★ పళ్ళు తోమిన తరువాత ఆ పుల్లని విరిచి పవిత్రమైన ప్రదేశంలో పడేయాలి.

## సంధ్యావిధి

★ స్నానానంతరం విప్రుడు దేవతలకి, ఋషులకి, పితృదేవతలకి తర్పణాలు సమర్పించాలి. తిరిగి ఆచమనం చేసి, 'అపోహిష్ఠామయోభువ' అనే మంత్రాన్ని పఠిస్తూ దర్భలతో నీళ్ళు తీసుకుని గాయత్రీ వ్యాహృతులతో ప్రోక్షించుకోవాలి.

★ ఓంకారంతో కూడిన వ్యాహృతులతో వేదమాత గాయత్రీ మంత్రాన్ని జపించి సూర్యుడికి అర్ఘ్యాలు సమర్పించాలి

★ తూర్పువైపు తిరిగి కూర్చుని మూడుసార్లు ప్రాణాయామం చేసి సంధ్యా వందనాన్ని ఆచరించాలి.

యా సంధ్యా సాజగత్సూతి ర్మాయాతీతాహి నిష్కళా ।
ఐశ్వరీతు పరాశక్తి స్తత్త్వత్రయ సముద్భవా ॥ *(శ్లో॥26,అధ్యా-18)*

ఈ సంధ్యాదేవి జగత్తుని సృష్టిస్తోంది. సంధ్యాదేవి మాయాతీతమైనది, నిర్వికల్పమైనది. పరమేశ్వరుడి పరాశక్తే సంధ్యాదేవి. మూడు తత్త్వాల నుంచి పుట్టినదే సంధ్య. ఈ విధంగా సూర్యమండలంలో ఉన్న సంధ్యాదేవిని ధ్యానించి, ఎప్పుడూ తూర్పు దిశగానే కూర్చుని సంధ్యోపాసన చేయాలి.

★ సంధ్యావందనం చేయనివాడు అపవిత్రుడవుతాడు.

★ సంధ్యావిధిని ఆచరించని వాడు ఏ కర్మలకీ అర్హుడుకాడు.

★ సంధ్యావందనం చేయకుండా ఏ పనిచేసినా ఫలించదు.

★ పూర్వం ఎంతోమంది పండితులు ఈ విషయాన్ని తెలుసుకుని సంధ్యావిధిని శ్రద్ధగా ఆచరించి ఉత్తమ ఫలితాలు పొందారు.

★ సంధ్యావందనాన్ని వదిలిపెట్టి ఇతర ధర్మాల్ని ఆచరించేవారు నరకానికి వెళతారు.

★ సంధ్యోపాసన చేసినందువల్ల యోగస్వరూపుడైన పరమాత్మని పూజించిన ఫలితం లభిస్తుంది.

★ తూర్పుముఖంగా నుంచొని ఏకాగ్రమైన మనసుతో 1000 లేక 108 లేక 11 సార్లు గాయత్రీ మంత్రాన్ని జపించాలి. తరువాత సూర్యోపస్థానాన్ని చేయాలి. యోగస్వరూపుడైన సూర్యభగవానుడికి నమస్కరిస్తూ ఈ స్తవంతో భక్తిగా స్తుతించాలి.

## సూర్యహృదయ స్తవం

త్వ మేవ విశ్వం బహుధా జాతం య జ్జాయతే చ యత్ ।
నమో రుద్రాయ సూర్యాయ త్వామహం శరణం గతః ॥ 1

ప్రచేతసే నమ స్తుభ్యం నమో మీఢుష్టమాయ చ ।
నమో నమస్తే రుద్రాయ త్వా మహం శరణం గతః ॥ 2

హిరణ్యబాహవే తుభ్యం హిరణ్యపతయే నమః ।
అంబికాపతయే తుభ్యం ఉమాధిపతయే నమః ॥ 3

నమోస్తు నీల గ్రీవాయ నమస్తుభ్యం పినాకినే ।
విలోహితాయ భర్గాయ సహస్రాక్షాయ తే నమః ॥ 4

తమో పహాయ తే నిత్యం ఆదిత్యాయ నమోఽస్తుతే ।
నమస్తే వజ్ర హస్తాయ త్ర్యంబకాయ నమోనమః ॥ 5

ప్రపద్యే త్వా విరూపాక్షం మహాంతం పరమేశ్వరమ్ ।
హిరణ్మయే గృహే గుప్తం ఆత్మానం సర్వ దేహినామ్ ॥ 6

నమస్యామి పరం జ్యోతి ర్బ్రహ్మాణం త్వాం పరామృతమ్ ।
విశ్వం పశుపతిం భీమం నరనారీ శరీరణమ్ ।
నమః సూర్యాయ రుద్రాయ భాస్వతే పరమేష్ఠినే ॥ 7

*(శ్లో॥35-45,అధ్యా-18,ఉ)*

"ఓ సూర్యభగవానుడా! ఆకాశంలో, ఇంద్రియాలలో ఆత్మరూపంగా, లోపలా బైటా వ్యాపించి శాంతుడుగా, మనసుని, బుద్ధిని అహంకారాన్ని క్రియాశీలంగా చేసే నీకు నమస్కరిస్తున్నాను. నన్ను నేను సమర్పించు కుంటున్నాను. జ్ఞాన స్వరూపుడివైన నీకు నమస్కారం. రుద్రరూపుడవైన నిన్ను నేను శరణు పొందాను.నీవు హిరణ్య బాహుడివి. హిరణ్యపతివి. అంబికాపతివీ, ఉమాపతివి. అలాంటి నీకు నమస్కరిస్తున్నాను. ఉగ్రుడివి, అందరిచేతా సేవించబడే వాడివి అయిన నిన్ను, సర్వకాల సర్వావస్థలలో శరణు వేడుకుంటున్నాను".

ఈ విధంగా ఉత్తమమైన సూర్యహృదయ స్తవంతో ఉదయం - మధ్యాహ్నం సూర్యుడికి నమస్కరించాలి. ఈ సూర్య హృదయస్తవం అన్ని పాపాలనీ నశింపచేస్తుంది. ఇది వేదాల నుంచి ఆవిర్భవించింది. వేదసారంగా కీర్తించబడింది. పూర్వం ఎందరో ఋషులు, సిద్ధులు దీన్ని పఠించి గొప్ప ఫలితాలు పొందారు. బ్రాహ్మణులకి ఇది ఎంతో హితాన్ని కలిగిస్తుంది.

## - అగ్నికార్యం -

సంధ్యావిధిని ముగించిన తరువాత విప్రుడు యథావిధిగా అగ్నికార్యం చేయాలి. ఒకవేళ అతడు అగ్నికార్యాన్ని చేయలేకపోతే అతడి ప్రతినిధిగా పత్ని, ఋత్విజుడు, శిష్యుడు, పుత్రుడు, సోదరుడు హోమం చేయవచ్చు.

★ హోమం చేసేవాడు తెల్లటి వస్త్రాలు ధరించి, ఏకాగ్రమనసుతో ఇంద్రియనిగ్రహాన్ని పాటించి అగ్నిలో హోమం చేయాలి.

★ దర్భలు లేకుండా యజ్ఞోపవీతం లేకుండా చేసే కర్మ అంతా రాక్షసకర్మ అవుతుంది. కనుక ఈ రెండూ తప్పక ధరించాలి.

★ ద్విజుడు, నిత్యం ఉత్తమ ద్రవ్యాలతో భగవంతుణ్ణి అర్చించాలి.

★ తన శక్తికొద్దీ అతిథి అభ్యాగతుల్ని ఆదరించాలి.

★ పంచయజ్ఞాలు (దేవ - ఋషి - పితృ - భూత - మనుష్య) చేయకుండా భుజించకూడదు.

★ బద్ధకంతోగానీ, మోహంతోకానీ దేవతార్చన చేయకుండా ద్విజుడు భుజించకూడదు. అలాగనుక చేస్తే పంది జన్మని పొందుతాడు

## దానాలు - వాటి ఫలితాలు

పూర్వం చతుర్ముఖ బ్రహ్మ, బ్రహ్మవాదులకి దానం గొప్పతనాన్ని, ఏ దానం చేస్తే ఎలాంటి ఫలితం కలుగుతుంది? దానం ఎవరికి ఇవ్వాలి అనే విషయాలు ఇలా వివరంగా ప్రబోధించాడు.

★ సంపాదించిన ధనాన్ని వేదవేదాంగాలు పఠించిన సత్పాత్రుడికి శ్రద్ధా పూర్వకంగా సమర్పించటమే దానం.

★ దానం భోగ మోక్షాలు రెండిటినీ ప్రసాదిస్తుంది.

★ ఎంతో శ్రద్ధగా ఉన్నతమైన వారికి సమర్పించిన విత్తమే దానం అని చెప్పబడుతోంది.

★ దానం నిత్యం-నైమిత్తికం-కామ్యం-విమలం అని నాలుగు విధాలుగా ఉంటుంది.

1. **నిత్యదానం :** తనకి ఎలాంటి ఉపకారం చేయకపోయినా ఎటువంటి ఫలాపేక్ష లేకుండా చేసేది.
2. **నైమిత్తికం :** తాను చేసిన పాపాల పరిహారం కోసం పండితులకి చేసే దానాన్ని నైమిత్తిక దానం అంటారు.
3. **కామ్యదానం :** సంతానం కలగటం కోసం, సంపదలు పెంపొందటం కోసం, వ్యాపారాభివృద్ధికోసం చేసే దానం.
4. **విమలదానం :** పరమేశ్వర ప్రీత్యర్థం బ్రాహ్మణులకి ధర్మబుద్ధితో సమర్పించే దానం. ఇది సకల శుభప్రదం.

★ తన కుటుంబానికి సరిపోయినంత ఉంచుకుని ఆ మిగిలిన దాన్నే దానం చేయాలి.

★ నిత్యాగ్ని హోత్రుడైన విప్రుడికి భూదానం చేసినవాడికి పునర్జన్మ ఉండదు.

★ భూదానం – అన్నదానాన్ని మించినవి మరొకటి లేవు.

★ యోగ్యుడైన విప్రుడికి విద్యాదానం చేసినవాడు బ్రహ్మలోకానికి వెళతాడు.

★ బ్రహ్మచారికి శ్రద్ధగా ప్రతీరోజూ భోజనం పెట్టేవాడు అన్ని పాపాల్ని తొలగించుకుని బ్రహ్మలోకాన్ని చేరుకుంటాడు

★ గృహస్థుడైన బ్రాహ్మణుడికి చేసిన అన్నదానం గొప్ప ఫలితాన్నిస్తుంది. అయితే గృహస్థుడికి కేవలం వండుకోవటానికి తగిన ఆహారపదార్థాలనే ఇవ్వాలి గానీ, వండినది దానంగా ఇవ్వకూడదు

★ వైశాఖ శుద్ధ పూర్ణిమనాడు తాను ఉపవాసం ఉండి ఏడుగురు మంది యోగ్యులైన విప్రుల్ని భక్తిగా పూజించి "ప్రీయ తాం ధర్మరాజః" అని సంకల్పం చెప్పి వారికి సమృద్ధిగా భోజనం పెట్టాలి. అలా చేసిన వాడికి జీవితకాలంలో చేసిన పాపాలు నశిస్తాయి.

★ జింకచర్మాన్ని, నువ్వుల్ని, బంగారాన్ని, తేనెని విప్రుడికి శ్రద్ధగా దానం చేస్తే పాపాలు నశిస్తాయి.

★ వైశాఖ పూర్ణిమనాడు వండిన అన్నాన్ని, నీళ్ళకుండని విప్రుడికి దానం చేస్తే అన్ని రకాల భయాలూ తొలగిపోతాయి.

★ మాఘశుద్ధ ద్వాదశినాడు బంగారాన్ని, నువ్వులతో కూడిన జలకుంభాన్ని (నీటికుండ) 5గురు లేక 7 గురికి దానం చేస్తే బ్రహ్మహత్యాది పాపాలు సైతం తొలగిపోతాయి

★ అమావాస్యనాడు పండితుడైన బ్రాహ్మణుణ్ణి శివస్వరూపుడిగా భావించి "సోమఃప్రీయతాం" అని సంకల్పం చెప్పుకుని ఏ వస్తువుల్ని దానం చేసినా ఏడుజన్మల్లో చేసిన పాపాలు నశిస్తాయి.

★ కృష్ణపక్ష చతుర్దశినాడు స్నానంచేసి, యోగ్యుడైన విప్రుణ్ణి శంకరుడిగా భావించి, ఆరాధించినవాడికి పునర్జన్మ ఉండదు

★ కృష్ణపక్ష అష్టమినాడు ధార్మికుడైన బ్రాహ్మణుడికి పాదప్రక్షాళన చేసి విశేషంగా అర్చించి "మహాదేవః ప్రీయతాం" అని సంకల్పం చెప్పుకుని,

యథాశక్తి ద్రవ్యాన్ని (ధనం) దానం చేయాలి. అలా చేసిన వాడికి ఉత్తమ గతులు కలుగుతాయి.

★ బ్రాహ్మణులైన వారు విశేషంగా కృష్ణపక్ష చతుర్దశి, కృష్ణపక్ష అష్టమి, అమావాస్య తిథుల్లో శంకరుణ్ణి పూజించాలి.

★ ఏకాదశినాడు ఉపవసించి, ద్వాదశినాడు బ్రాహ్మణుణ్ణి నారాయణ స్వరూపుడుగా పూజించినవాడు పరమపదాన్ని పొందుతాడు.

★ శుక్లపక్ష ద్వాదశి శ్రీవిష్ణువుకి ప్రీతికరమైన తిథి కనుక, ఆ తిథినాడు ప్రయత్న పూర్వకంగా నారాయణుణ్ణి అర్చించాలి.

## దేవతలు - పూజాఫలం

విభూతికామః సతతం పూజయేద్వై పురందరమ్ ।
బ్రహ్మవర్చస కామస్తు బ్రహ్మాణం బ్రహ్మకాముకః ॥ 1
ఆరోగ్యకామోఽథ రవిం ధేనుకామో హుతాశనమ్ ।
కర్మణాం సిద్ధికామస్తు పూజయే ద్వై వినాయకమ్ ॥ 2
భోగకామస్తు శశినం బలకామః సమీరణమ్ ।
ముముక్షుః సర్వసంసారా త్ప్రయత్నేనార్చయే ద్ధరిమ్ ॥ 3
యస్తు యోగం తథా మోక్ష మిచ్ఛేత్వా జ్ఞానమైశ్వర్యమ్ ।
సోఽర్చయే ద్వై విరూపాక్షం ప్రయత్నేన మహేశ్వరమ్ ॥ 4
యో వాంఛతి మహాయోగాత్ జ్ఞానాని చ మహేశ్వరమ్ ।
తే పూజయంతి భూతేశం కేశవం చాపి భోగినః ॥ 5

*(శ్లో॥38-42,అధ్యా-36)*

★ ఐశ్వర్యాన్ని కోరుకునేవాడు ఇంద్రుణ్ణి పూజించాలి.

★ బ్రహ్మతేజస్సు కావాలనుకునేవాడు బ్రహ్మని ఆరాధించాలి.

★ ఆరోగ్యాన్ని కోరుకునేవాడు సూర్యభగవానుణ్ణి అర్చించాలి.

★ ధనాన్ని కోరుకునేవాడు అగ్నిని ఆరాధించాలి.

★ కర్మసిద్ధి కావాలనుకునేవాడు గణపతిని పూజించాలి.

★ భోగాలు అనుభవించాలనుకునేవాడు చంద్రుణ్ణి సేవించాలి.

★ బలాన్ని పొందాలని కోరుకునేవాడు శ్రీహరిని పూజించాలి.

★ సంసారవిముక్తి కావాలనుకునేవాడు వాయువుని ఆరాధించాలి.

★ యోగాన్ని, మోక్షాన్ని ఆశించేవాడు పరమేశ్వరుణ్ణి అర్చించాలి.

★ మహాయోగాన్ని, మహాజ్ఞానాన్ని కావాలనుకునేవారు శివకేశవుల్ని పూజించాలి.

## దానం - ఫలం

వారిదస్తృప్తి మాప్నోతి సుఖ మక్షయ్య మన్నదః ।
తిలప్రదః ప్రజామిష్టాం దీపద శ్చక్షు రుత్తమమ్ ॥ 1

భూమిదః సర్వమాప్నోతి దీర్ఘమాయు ర్హిరణ్యదః ।
గృహదోఽగ్ర్యాణి వేశ్మాని రూప్యదో రూప ముత్తమమ్ ॥ 2

వాసోద శ్చంద్రసాలోక్య మశ్విసాలోక్య మశ్వదః ।
అనడుద్దఃశ్రియం పుష్టాం గోదః బ్రధ్నస్య విష్టపమ్ ॥ 3

యాన శయ్యాప్రదో భార్యా మైశ్వర్య మభయప్రదః ।
ధాన్యదః శాశ్వతం సౌఖ్యం బ్రహ్మదో బ్రహ్మసాత్మ్యతామ్ ॥ 4

ధాన్యాన్యపి యథాశక్తి విప్రేషు ప్రతిపాదయేత్ ।
వేదవిత్సు విశిష్టేషు ప్రేత్య స్వర్గం సమశ్నుతే ॥ 5

గవాం వా సంప్రదానేన సర్వపాపైః ప్రముచ్యతే ।
ఇంధనానాం ప్రదానేన దీప్తాగ్ని ర్జాయతే నరః ॥ 6

ఫలమూలాని శాకాని భోజ్యాని వివిధాని చ ।
ప్రదద్యా ద్బ్రాహ్మణేభ్యస్తు ముదా యుక్తః స్వయం భవేత్ ॥ 7

ఔషధం స్నేహ మాహారం రోగిణే రోగశాంతయే ।
దదానో రోగరహితః సుఖీ దీర్ఘాయు రేవ చ ॥ 8

అసిపత్రవనం మార్గం క్షురధారాసమన్వితమ్ ।
తీవ్రతాపం చ తరతి ఛత్రోపానత్ప్రదో నరః ॥ 9

యద్వా దిష్టతమం లోకే య చ్చాపి దయితం గృహే ।
తత్త ద్గుణవతే దేయం తదేవాక్షయ మిచ్ఛతా ॥ 10

*(శ్లో॥43-52)*

★ జలదానం చేసినవాడు ఎంతో సంతృప్తిని ఫలంగా పొందుతాడు.

★ అన్నదానం చేసినవాడికి అక్షయసుఖాలు ప్రాప్తిస్తాయి.

★ తిలలు (నువ్వులు) దానం చేయటం వల్ల ఇష్టసంతానం కలుగుతుంది.

★ దీపదానం చేయటం వల్ల నేత్రాలకి శక్తి పెంపొందుతుంది.

★ భూదానం వల్ల సకల కోరికలూ తీరుతాయి.

★ బంగారం దానం చేయటం వల్ల దీర్ఘాయుర్దాయం కలుగుతుంది.

★ ఇంటిని నిర్మించి దానం చేస్తే మంచి భవనాలు లభిస్తాయి.

★ వెండి వస్తువుల దానం వల్ల సౌందర్యం పెంపొందుతుంది.

★ నూతన వస్త్రాల్ని దానం చేయటం వల్ల చంద్రలోక ప్రాప్తి కలుగుతుంది.

★ అశ్వాల్ని (గుర్రాలు) దానం చేయటం వల్ల అశ్వినీదేవతల అనుగ్రహం కలుగుతుంది.

★ వృషభాల్ని దానం చేస్తే పుష్టి- సంపదలు కలుగుతాయి.

★ గోదానం వల్ల బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది.

★ వాహనాన్ని శయ్యని దానం చేస్తే అందమైన భార్య లభిస్తుంది.

★ ఆపదలో ఉన్నవారికి అభయాన్నిస్తే ఐశ్వర్యం పెంపొందుతుంది.

★ ఉత్తములైన వేదపండితులకి దానం చేస్తే స్వర్గలోక ప్రాప్తి కలుగుతుంది.

★ ఆవులకి గడ్డిని దానం చేస్తే సకల పాపాలనుంచీ విముక్తి కలుగుతుంది.

★ ఫలాలు, కూరలు, భోజనపదార్థాలు దానం చేస్తే సంతోషం లభిస్తుంది.

★ రోగికి ఔషధాన్ని, ఆహారాన్ని, తైలాన్ని ఇచ్చినవాడు రోగరహితుడై దీర్ఘకాలం జీవిస్తాడు.

★ గొడుగు, పాదరక్షలు దానం చేస్తే నరకం నుంచి విముక్తి కలుగుతుంది.

★ తనకి ఏది ఇష్టమో దాన్ని ఇతరులకి దానం చేస్తే అక్షయఫలాలు పొందుతారు.

## దానానికి శుభ సమయాలు

★ ఉత్తరాయణ దక్షిణాయన పుణ్యకాలాలలో, మేష తులా సంక్రమణాలలో, చంద్రసూర్య గ్రహణాలలో చేసే దానం అక్షయఫలితాలనిస్తుంది.

★ ప్రయాగాది పుణ్యక్షేత్రాలలో, ఇతర పుణ్యనదీతీరాలలో చేసిన దానం గొప్ప పుణ్యాన్ని ప్రసాదిస్తుంది.

★ మానవులకి దానాన్ని మించిన ధర్మం లేదు.

★ స్వర్గాన్ని, ఐశ్వర్యాన్ని, పాపవినాశనాన్ని, మోక్షాన్ని కోరుకునేవారు ప్రతిరోజూ యథాశక్తి ఏదో ఒక దానం చేయాలి.

## బ్రహ్మ గర్వభంగం

పూర్వం ఒకనాడు ఋషులందరూ మేరుపర్వత శిఖరం మీద కొలువున్న బ్రహ్మ దగ్గరకి వెళ్ళారు. ఆయనకి నమస్కరించి పితామహా! పంచముఖా! సకల జగత్తుకీ కారణమైనవాడు ఎవరు? ఎవరు దీన్ని ధరిస్తున్నారు? అని ప్రశ్నించారు. అప్పుడు బ్రహ్మదేవుడు మాయా మోహితుడై ఎంతో గర్వంగా "ఋషులారా! వేరే ఎవరో లేదు. నేనే ఈ సకల జగత్తుకీ కారకుణ్ణి. నేనే ఈ జగత్తునంతా భరిస్తున్నాను. స్వయం భువుడిని, అద్వితీయుణ్ణి, ఈశ్వరుణ్ణి కూడా నేనే. ఈ లోకంలో నాకన్నా గొప్పవాడు ఎవడూ లేదు" అని పలికాడు.

బ్రహ్మమాటలు విని ఋషులతోపాటు వచ్చిన నారాయణుడు కోపంగా "ఓయీ బ్రహ్మా! నీ మాటలు చాలించు. ఎంత అజ్ఞానంతో ఉన్నావు. నీకు నీవే సర్వస్వం అని ప్రకటించుకుంటున్నావు. ఇది నీకు తగదు. నీవు కాదు నేనే ఈ లోకాలన్నిటినీ భరించేవాడిని. యజ్ఞస్వరూపుడైన, నారాయణుణ్ణి. నేను లేకుండా

ఈ ప్రపంచమే లేదు. నా ప్రేరణతోనే నీవీ ప్రపంచాన్ని సృష్టించావు. అది తెలుసుకో" అని వాదించాడు.

ఇలా బ్రహ్మకేశవులు పరస్పరం వాదించుకుంటుండగా నాలుగువేదాలు పురుషాకారాల్ని ధరించి వారిదగ్గర కొచ్చాయి. ఆ వేద పురుషులు ఎంతో ఆవేదనతో బ్రహ్మకేశవులతో ఇలా అన్నారు.

**1. ఋగ్వేదపురుషుడు :-**

బ్రహ్మ–కేశవులారా! సకల ప్రాణుల్నీ తనలో నిలుపుకునేవాడు, ఈ చరాచర జగత్తుని ప్రవర్తింపచేసేవాడు, పరతత్త్వంగా ప్రసిద్ధిచెందినవాడు ఆ పరమేశ్వరుడే అని తెలుసుకోండి.

**2. యజుర్వేద పురుషుడు :-**

సకల యజ్ఞాలతో, యాగాలతో, పూజలతో అర్చించ బడేవాడు 'ఈశ్వరుడు' అని అందరిచేతా పిలవబడేవాడు శంకరుడు ఒక్కడే.

**3. సామవేద పురుషుడు :-**

కేశవ బ్రహ్మలారా! ఈ సకల సృష్టినీ ప్రవర్తింప చేసేవాడు, పరమాకాశం లాంటివాడు, యోగుల చేత తెలియబడే పరత్త్వం, మహాదేవుడైన ఆ పరమేశ్వరుడే.

**4. అధర్వవేద పురుషుడు :-**

దేవతలారా! ఎన్నో యజ్ఞాలు యాగాలు చేసిన మునులు – మహర్షులు సాక్షాత్కరించుకునేది భవుడైన ఆ రుద్రుణ్ణే.

ఈ విధంగా వేదపురుషులు పలికిన మాటలు విన్నప్పటికీ, మోహంలో ఉన్న బ్రహ్మదేవుడికి అహం వీడలేదు. వారితో పరిహాసంగా "వేదపురుషులారా! నిజంగా మీరు చెప్పినట్టు మహాదేవుడు పరబ్రహ్మే గనుక అయితే, సర్వసంగవర్జితుడే అయితే, గర్వంతో సంచరించే ఆ ప్రమథగణాలతో, పార్వతీదేవితో ఎలా కలిసి ఉంటున్నాడు" అని ప్రశ్నించాడు.

బ్రహ్మ మాటలు వినగానే కోపం వచ్చిన ఓంకారం తాను కూడా ఆకారాన్ని ధరించి "బ్రహ్మదేవా! శంకరుడు ఆత్మారాముడు. ఆయన స్వయం

ప్రకాశుడు, పార్వతి వేరే శరీరం కాదు. ఆమె అతని ఆత్మ. ఆయనలో ఉన్న ఆనందమే పార్వతిగా రూపం ధరించింది తప్ప పార్వతి అనేది ప్రత్యేకమైన శక్తి కాదు" అని ఓంకారుడు పరమేశ్వరుడి గొప్పతనాన్ని వివరించి చెప్పినప్పటికీ బ్రహ్మకి అహంకారం తగ్గలేదు.

అంతలో ఆకాశంలో ఒక దివ్యతేజో మండలం ఆవిర్భవించింది. ఆ దివ్య జ్యోతిలో బ్రహ్మదేవుడి అయిదోతల, తన ముఖాన్ని తానే ప్రతిబింబంలా చూసుకుంది. ఆ తేజస్సు చూసి అజ్ఞానంతో నిండిన బ్రహ్మ ముఖం కోపంతో ఎరుపెక్కింది. ఒక్క క్షణకాలం గడవగానే ఆ తేజో పుంజంలోనించి నీలలోహితుడు, నాగయజ్ఞోపవీతాన్ని, త్రిశూలాన్ని ధరించిన మహాదేవుడు ఆవిర్భవించాడు. మహాతేజస్సుతో వెలిగిపోతున్న ఆ నీలలోహితుణ్ణి చూసిన బ్రహ్మ "ఓహో! నీవేనా మహాదేవుడంటే! ఓయీ రుద్రా! పూర్వం నీవు నా లలాటం నుంచి పుట్టావు. గుర్తుకురాలేదా! నేను నీ తండ్రిని, నన్ను శరణు వేడుకో!" అని అవివేకంతో పలికాడు.

బ్రహ్మ మాట్లాడిన గర్వపు వాక్యాలు విని శంకరుడికి ఆగ్రహం కలిగింది. వెంటనే సకలలోకాల్నీ దహించే కాలభైరవుణ్ణి పిలిచి ఆయన మీదకి పంపాడు. శివాజ్ఞతో వచ్చిన భైరవుడు బ్రహ్మతో యుద్ధం చేసి ఆయన అయిదో తలని ఖండించేసాడు.

ఈ విధంగా కాలభైరవుడి ద్వారా తల ఖండిచబడ్డ బ్రహ్మ తిరిగి ఈశ్వరుడి అనుగ్రహంతో జీవించాడు. అప్పుడాయనకి జ్ఞానోదయమైంది. అహంకారంతో నిండిన తన అయిదో తల తెగిపోగానే, ఈశ్వరతత్త్వం సంపూర్ణంగా అవగతమయ్యింది. దివ్యతేజో మండలంలో పార్వతీసమేతుడైన పరమేశ్వరుణ్ణి మనసారా దర్శించాడు. సకల ఋషి, ముని, గణాలతో స్తుతించబడుతున్న ఆ ఆదిదంపతుల్ని దర్శించి, తన్మయత్వంతో నిండిపోయాడు. తనలో ఉన్న అహంకారం నశించిపోగా చంద్రరేఖా విభూషణుడు, పార్వతీసహితుడైన పరమేశ్వరుణ్ణి ఎంతో భక్తితో ఇలా స్తుతించాడు.

## బ్రహ్మ చేసిన సోమాష్టకం

నమో దేవాయ మహతే మహాదేవ్యై నమో నమః ।
నమః శివాయ శాంతాయ శివాయై సతతం నమః ॥ 1

ఓం నమో బ్రహ్మణే తుభ్యం విద్యాయై తే నమో నమః ।
మహేశాయ నమస్తుభ్యం మూలప్రకృతయే నమః ॥ 2

నమో విజ్ఞానదేహాయ చింతాయై తే నమో నమః ।
నమోఽస్తు కాలకాలాయ ఈశ్వరాయ నమో నమః ॥ 3

నమో నమోఽస్తు రుద్రాయ రుద్రాణ్యై తే నమో నమః ।
నమో నమస్తే కాలాయ మాయాయై తే నమో నమః ॥ 4

నియంత్రే సర్వకార్యాణాం క్షోభికాయై నమో నమః ।
నమోఽస్తుతే ప్రకృతయే నమో నారాయణాయ చ ॥ 5

ఓంకారమూర్తయే తుభ్యం తదంతః సంస్థితాయ చ ।
నమస్తే వ్యోమసంస్థాయ వ్యోమశక్త్యై నమో నమః ॥ 6

ఇతి సోమాష్టకే నేశం ప్రణిపత్య పితామహః ।
పపాత దండవ ద్భూమౌ గృణన్వై శతరుద్రియమ్ ॥ 7

అథ దేవో మహాదేవః ప్రణాతార్తిహరో హరః ।
ప్రోవాచోత్థాప్య హస్తాభ్యాం ప్రీతోఽస్మి తవ సాంప్రతమ్ ॥ 8

*(శ్లో॥49-53,అధ్యా-31)*

"మహాదేవుడికి నమస్కారం. మహాదేవికి నమస్కారం. శాంతుడైన పరమేశ్వరుడికి నమస్కారం. శివుడికి నమస్కారం. బ్రహ్మ స్వరూపుడికి నమస్కారం. మహేశ్వరుడికి, సరస్వతీరూపుడికి, మూలప్రకృతికి, విజ్ఞాన దేహుడికి, చింతారూపుడికి, కాలకాలుడికి, ఈశ్వరుడికి, రుద్రుడికి, రుద్రాణికి, మాయారూపుడికి, సకల కార్యాలనీ నిర్వహించేవాడికి, అన్నిటినీ క్షోభింప చేసేవాడికి, నారాయణుడికి, యోగాన్నిచ్చేవాడికి, యోగగురువుకి, నిత్యానందుడికి,

ఆనందమూర్తికి, విశ్వప్రకృతికి, ఓంకారస్వరూపుడికి, ఓంకారంలో నివసించేవాడికి, వ్యోమస్థితుడికి, వ్యోమశక్తికి నమస్కారం.

ఈ విధంగా సోమాష్టకంతో ఈశ్వరుణ్ణి స్తుతించిన బ్రహ్మదేవుడు శతరుద్రీయాన్ని కూడా పఠిస్తూ ఒక్కసారిగా ఆయన పాదాల మీద పడిపోయాడు. అలా బ్రహ్మదేవుడికి పరమేశ్వరుడి ద్వారా గర్వభంగమయ్యింది.

## సుప్రసిద్ధ తీర్థాలు

సూతమహర్షి నైమిశారణ్యంలో శౌనకాది మహామునులందరి కోరిక ననుసరించి వారికి భూలోకంలో ఉన్న దివ్యతీర్థాలు వాటి మహాత్మ్యాలు గురించి సవివరంగా ఇలా చెప్పాడు.

1. **ప్రయాగ తీర్థం :** పరమేష్ఠి చతుర్ముఖ బ్రహ్మకి సంబంధించిన తీర్థంగా ప్రసిద్ధికెక్కిన తీర్థం ప్రయాగ. ఇది అయిదు యోజనాల విస్తీర్ణంతో వుంటుంది.

2. **కురు క్షేత్రం :** ఇది కూడా పరమపవిత్రమైన దివ్యతీర్థం. ఇక్కడే ఎందరో మునులు, ఋషులు, ఆశ్రమాలు నిర్మించుకుని తపస్సు చేసుకుంటున్నారు. ఇక్కడి తీర్థంలో స్నానం చేస్తే సకల పాపాలూ హరిస్తాయి. ఈ క్షేత్రంలో చేసిన తపస్సు, దానం, పూజ, వ్రతం అనంతమైన ఫలితాలనిస్తుంది.

3. **గయా తీర్థం :** పితృదేవతలకి అత్యంత ప్రీతిపాత్రమైనదీ తీర్థం. ఇక్కడ పితరులకి పిండప్రదానం చేస్తే వారికి అక్షయలోకాలు లభిస్తాయి. జీవితంలో కనీసం ఒక్కసారన్నా గయాక్షేత్రంలో శ్రాద్ధకర్మచేయాలి. రుద్రుడు తన పాదముద్రల్ని గయాక్షేత్రంలో ఉంచాడు. వెళ్ళగలిగిన శక్తి ఉన్నప్పటికీ గయకువెళ్ళి పిండప్రదానం చేయని పుత్రుణ్ణి చూసి, పితృదేవతలు ఎంతో దుఃఖిస్తారు. అలా వెళ్ళనివాడు చేసే ధార్మిక కార్యకలాపాలన్నీ వ్యర్థమైపోతాయి. గయాక్షేత్రంలో పిండప్రదానం చేసే మానవులు ఎంతో ధన్యులు. వారలా చేయటం వల్ల, వారి తల్లితండ్రుల వంశంలో ఏడుతరాల వారూ తరిస్తారు. చేసినవాడు స్వయంగా ఉత్తమగతిని పొందుతాడు.

**4. ప్రభాస తీర్థం :** భూలోకంలో ఉన్న తీర్థాలలో ఉత్తమమైనది ప్రభాసతీర్థం. అది సిద్ధపురుషులు నివసించే ప్రదేశం. ఇక్కడ పరమేశ్వరుడు స్వయంగా కొలువై ఉన్నాడు. ఈ క్షేత్రంలో స్నానం, తపం, జపం, శ్రాద్ధం, బ్రాహ్మణులకి అన్నసంతర్పణ చేసినవారు శాశ్వతంగా ఉత్తమమైన బ్రహ్మలోకాన్ని పొందుతారు.

**5. త్ర్యంబక తీర్థం :** ఇది సర్వదేవతల చేతా పూజించబడే తీర్థం. ఆ తీర్థంలో వున్న శివుణ్ణి పూజించినవాడు, జ్యోతిష్టోమఫలితాన్ని పొందుతాడు. బంగారు రంగుతో మెరిసిపోయే త్ర్యంబకేశ్వరుణ్ణి అర్చించి విప్రులకి అన్నదానం చేసినవాడు గణాధిపత్యం పొందుతాడు.

**6. సోమేశ్వర తీర్థం :** ఇది శివుడి అనుగ్రహాన్ని ప్రసాదించే ఉత్తమ తీర్థం. ఈ తీర్థంలో స్నానం చేసి స్వామిని దర్శించటం వల్ల సకల వ్యాధులూ నివారించబడతాయి. ఇది రుద్రలోక ప్రాప్తిని కలిగించే ఉత్తమ తీర్థం.

**7. విజయనామ తీర్థం :** ఈ తీర్థంలో కొలువైన శివుడి పేరు "విజయుడు". ఈ విజయలింగం దగ్గర ఆరునెలలు నియతాహారంతో, బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ నిత్యం శివధ్యానం చేసేవాడు శివలోకాన్ని చేరుకుంటాడు.

**8. ఏకామ్ర తీర్థం :** పరమేశ్వరుడు కొలువున్న ఈ తీర్థం మహిమాన్వితమైనది. ఇక్కడ శివభక్తులకి ఏ కొంచెం దానం చేసినా, అది అఖండమైన ఫలితాన్నిస్తుంది. ఇక్కడ భూదానం చేసినవాడికి రాజ్యాధికారం వస్తుంది. ఈ తీర్థంలోనే మహానది ప్రవహిస్తోంది. పవిత్రమైన గ్రహణ కాలాలలో ఆ నదిలో స్నానం చేసి జపతపాలు ఆచరించినవాడు, సకల పాపాలనుంచీ విముక్తి పొందుతాడు.

**9. విరజా తీర్థం :** ముల్లోకాల్లో ఎంతో ప్రసిద్ధి పొందింది ఈ తీర్థం. ఇక్కడి తీర్థంలో స్నానం చేసిన విప్రుడు బ్రహ్మలోకాన్ని చేరుకుంటాడు.

**10. పురుషోత్తమ తీర్థం :** ఇది నారాయణుడు కొలువున్నచోటు. ఈ తీర్థంలో స్నానంచేసి అక్కడి నారాయణుణ్ణి పూజించి బ్రాహ్మణులకి అన్నదానం చేసినవాడు విష్ణులోకాన్ని చేరుకుంటాడు.

**11. గోకర్ణతీర్థం :** తీర్థాలలో విశేషమైనది, శంకరుడి నిత్యనివాస స్థానం ఈ గోకర్ణ తీర్థం. ఇది సకలపాపహరం గోకర్ణక్షేత్రంలో కొలువైన గోకర్ణేశ్వర లింగాన్ని దర్శించినవాడికి సకలాభీష్టాలు నెరవేరుతాయి. అతడు రుద్రుడికి అత్యంత ప్రీతిపాత్రుడవుతాడు. ఉత్తర గోకర్ణం అనే మరోక్షేత్రం కూడా దానికి సమీపంలోనే ఉంది. అక్కడ త్రిశూలధారి అయిన శివలింగం పూజలందుకుంటోంది. ఆ దివ్యలింగాన్ని అర్చించినవారు శివసాయుజ్యాన్ని పొందుతారు. ఈ శివలింగానికి స్థాణువు అని పేరు. ఆయన్ని దర్శిస్తే చాలు. పాపాలు తక్షణమే నశిస్తాయి.

**12. కుబ్జామ్ర తీర్థం :** ఇది శ్రీమన్నారాయణుడు నివసించే దివ్యక్షేత్రం. ఇక్కడి శ్రీహరిని పూజించినవాడు శ్వేతదీపాన్ని చేరుకుంటాడు. ఈ తీర్థంలోనే పూర్వం త్రిపురారి అయిన పరమేశ్వరుడు దక్షయజ్ఞాన్ని విధ్వంసం చేసి, దక్షుణ్ణి సంహరించిన పాపం కారణంగా, శ్రీమన్నారాయణుణ్ణి స్వయంగా ప్రతిష్ఠించాడు. ఈ క్షేత్రంలో ఒక యోజనం వరకూ సిద్ధులు, మునులు నివసిస్తూ శ్రీహరిని నిత్యం సేవిస్తూ ఉంటారు

**13. సాలగ్రామ తీర్థం :** శ్రీహరికి అత్యంత ప్రీతిపాత్రమైనది ఈ క్షేత్రం. పరమ పవిత్రమైన ఈ క్షేత్రం సిద్ధులకి నివాసస్థానం. ఈ దివ్య క్షేత్రంలో శ్రీహరి హయశిరుడు అనే పేరుతో విరాజిల్లుతున్నాడు.

**14. బ్రహ్మ తీర్థం :** పితామహుడైన బ్రహ్మదేవుడు స్వయంగా కొలువున్న ఈ తీర్థం పుష్కర క్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. ఇక్కడ మరణించిన వారికి బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది. ఈ పుష్కర తీర్థాన్ని మనసులో స్మరించినా చాలు పాపాలు నశిస్తాయి. సిద్ధులు, గంధర్వులు, యక్షులు ఈ తీర్థానికి వచ్చి బ్రహ్మదేవుణ్ణి సేవిస్తూ ఉంటారు.

**15. సప్తసారస్వత తీర్థం :** దివ్యతీర్థాలలో విశిష్ఠమైనది ఈ సప్తసారస్వత తీర్థం. బ్రహ్మాది దేవతలు నిత్యం ఈ తీర్థాన్ని సేవిస్తూ ఉంటారు. ఈ క్షేత్రాన్ని దర్శించి ఇక్కడి పరమేశ్వరుణ్ణి పూజిస్తే అశ్వమేధయాగ ఫలాన్ని పొందుతారు.

## - మంకణముని వృత్తాంతం -

పూర్వం ఈ క్షేత్రంలోనే 'మంకణకుడు' అనే ముని ప్రణవ పంచాక్షరీ మహామంత్రాన్ని జపిస్తూ శివుణ్ణి ఉపాసించాడు. కొంతకాలానికి మంకణముని చేసిన కఠోరతపస్సుకి మెచ్చి శివుడు ప్రత్యక్షమయ్యాడు. రుద్రుణ్ణి ఒక్కసారిగా చూడగానే మంకణ మునికి తీవ్రమైన భావోద్వేగం కలిగింది. వెంటనే పైకి లేచి ఆనందంతో నృత్యం చేయటం ప్రారంభించాడు. క్రమక్రమంగా ఆ నృత్యాన్ని కొనసాగిస్తున్నాడు. ఎంతసేపటికీ ఆపటం లేదు. శివుడికి కొంత అసహనం కలిగింది. "మంకణా! నృత్యం చేసింది చాలు ఆపవయ్యా! నీకేం కావాలో కోరుకో' అన్నాడు. అయినా శివుడి మాటలు పట్టించుకోకుండా అతడు నృత్యం చేస్తూనే ఉన్నాడు. తన మాటని కూడా లెక్కచేయక పోవటంలో శివుడికి అసహనం స్థానంలో ఆగ్రహం వచ్చింది. "ఓయీ! దురహంకారీ! నా మాటనే ధిక్కరిస్తావా! నీవొక్కడివే తపస్సంపన్నుడను కుంటున్నావా! నీకన్నా ఎంతో మంది తపోధనులున్నారు తెలుసా!"అని గట్టిగా పలికి 'చూడు నా తాండవాన్ని' అని ప్రళయ భీకరంగా నృత్యం చేయటం ప్రారంభించాడు శివుడు.

ఒక్కసారిగా సహస్రశీర్షుడు, సహస్రపాదుడు, దంష్ట్రా కరాళవదనుడు, జ్వాలామాలి అయిన శివుడు భయంకరంగా మారిపోయాడు. విరాట్ రూపాన్ని ధరించాడు. ఆయన ప్రక్కనే చిరునవ్వులు చిందిస్తూ కోటి సూర్యుల కాంతితో ప్రకాశించే పార్వతీదేవి వచ్చి చేరింది. మంకణమునికి శివుడి విశ్వరూపం చూసే సరికి భయం వేసింది. ఎలాగోలా తేరుకుని తన తప్పుని తెలుసుకుని, మనస్సు నిగ్రహించి, రుద్రాధ్యాయాన్ని జపిస్తూ వినయంగా శివుడికి నమస్కరించాడు.

మంకణుడి గర్వం అణగిపోయిందని గ్రహించిన శివుడు తిరిగి తన యధా స్వరూపాన్ని ధరించాడు. ఆయనతో పాటు వచ్చిన పార్వతీదేవి మాత్రం అదృశ్యమైపోయింది. శివుడు మంకణుణ్ణి ఆశీర్వదించి 'నాయనా! నీవేమీ భయపడవద్దు' నీకేం కావాలో కోరుకో" అన్నాడు. శివుడి సాత్త్వీక వచనాలు విన్నాక ఎంతో ధైర్యం కలిగిన మంకణుడు "స్వామీ! నా అపరాధాన్ని మన్నించు.

తన్మయత్వంతో నీ మాటలు వినిపించుకోలేదు. మహాదేవా! నమస్కారం. నీ భయంకరమైన రూపాన్ని చూడలేక పోయాను. సకల జగత్తు మొత్తం వ్యాపించిన నీ ఘోర రూపం స్వభావం ఏమిటి? నీ పక్కన ప్రత్యక్షమైన దేవి ఎవరు? ఆమె ఎందుకు అంతర్ధానమయ్యింది?" అని వినయంగా ప్రశ్నించాడు. అప్పుడు శివుడు తన ఆత్మయోగ స్వరూపం గురించి, పార్వతీదేవిని గురించి అతడికి ఇలా తెలియచేసాడు.

## మహేశ్వరుడి స్వ స్వరూపం

అహం సహస్ర నయనః సర్వాత్మా సర్వతోముఖః ।
దాహకః సర్వపాపానాం కాలః కాలకరో హరః ॥ 1
మయ్యైవ ప్రేర్యతే కృత్స్నం చేతనాచేతనాత్మకమ్ ।
సోఽంతర్యామీ స పురుషో హ్యయం వై పురుషోత్తమః ॥ 2
తస్య సా పరమా మాయా ప్రకృతి స్త్రిగుణాత్మికా ।
ప్రోచ్యతే మునిభిః శక్తి ర్జగద్యోనిః సనాతనీ ॥ 3
స ఏష మాయయా విశ్వం వ్యామోహయతి విశ్వవిత్ ।
నారాయణః పరోఽవ్యక్తో మాయారూప ఇతి శ్రుతిః ॥ 4
ఏవ మేత జ్జగత్ సర్వం సర్వదా స్థాపయా మ్యహమ్ ।
యోజయామి ప్రకృత్యాఽహం పురుషం పంచవింశకమ్ ॥ 5

*(శ్లో॥62-66,అధ్యా-34)*

మంకణమునీ! నేను సహస్రనేత్రుడిని, సర్వరూపుడిని, సర్వతోముఖుణ్ణి, సకల పాపాలనీ దహించే వాడిని, కాలాన్ని సృష్టించేవాణ్ణి, చేతనాచేత నాత్మకమైన ఈ ప్రపంచమంతా నా వల్లనే ప్రేరేపించబడుతోంది. సృష్టిలో వున్న అందరు జీవుల్లోని అంతరాత్మని నేనే. పురుషోత్తముణ్ణి కూడా నేనే. నా పరమరూపమే ఈ త్రిగుణాత్మకమైన ప్రకృతి. ఈ మాయా స్వరూపిణినే ఋషులందరూ 'శక్తి' అని, 'జగద్యోని' అని 'సనాతని' అని అంటారు. నేనే నా మాయద్వారా సకల జగత్తునీ మోహింపచేస్తున్నాను. నన్నే వేదాలన్నీ నారాయణుడని, అవ్యక్తుడని,

మాయారూపుడని అంటాయి. ఈ ప్రపంచాన్నంతా ఎప్పుడూ నేనిలానే నిలుపుతాను. ఈ ప్రకృతితో పురుషుణ్ణి కలిపేది కూడా నేనే.

మంకణా!, ఈశ్వరుడునైన నాకన్నా భిన్నమైన తత్త్వం మరొకటి లేదు. నాకు సంబంధించిన మరో శక్తినే విద్య అంటారు. నీవు నా పక్కన చూసింది ఆ విద్యా దేవినే. ఆమె నాలో నుంచే వచ్చింది. తిరిగి నాలోకే వెళ్ళిపోయింది. నా స్వరూపాన్ని నీకు సంపూర్ణంగా తెలియచేసాను.అంతా తెలుసుకున్న నీవు భక్తి యోగాన్ని ఆశ్రయించి, నన్ను శ్రద్ధగా పూజించు" అని చెప్పి అదృశ్యమయ్యాడు.

మంకణముని శివుడు బోధించిన విధంగా ఆ క్షేత్రంలోనే నివసిస్తూ భక్తి యోగంతో రుద్రుణ్ణి ఆరాధించి ముక్తిని పొందాడు. ఈ దివ్యతీర్థాన్ని సేవించిన వారికి పాపవిముక్తి కలుగుతుంది.

**16. రుద్రకోటి తీర్థం :** ముల్లోకాల్లో ఎంతో ప్రసిద్ధి చెందిన శివతీర్థాలలో విశిష్టమైనది రుద్రకోటి తీర్థం. పూర్వం దేవదేవుడైన శంకరుణ్ణి దర్శించాలనుకుని కోటిమంది బ్రహ్మర్షులు, పరమనిష్ఠా గరిష్ఠులు ఈ క్షేత్రానికి వచ్చారు. పరమేశ్వరుణ్ణి నేను చూస్తానంటే నేను ముందు చూస్తానని వారంతా ఘర్షణ పడ్డారు. దాంతో పెద్ద వివాదం చెలరేగింది. వారంతా తన దర్శనం కోసం తపించటాన్ని చూసి ఎంతో ఆనందించిన శివుడు కోటి రూపాల్ని ధరించి అందరికీ విడివిడిగా దర్శనమిచ్చాడు. ఆ విధంగా శివుడు కోటిరూపాలు ధరించిన కారణంగా, ఈ తీర్థానికి కోటి రుద్రతీర్థం అనే పేరు వచ్చింది. ఈశ్వరుడు స్వయంగా నిలిచిన ఈ క్షేత్రదర్శనం ముక్తి దాయకం.

**17. మధువనం :** మధువనమనే ఈ దివ్యతీర్థాన్ని సేవించిన వాడు ఇంద్రుడి అర్ధసింహాసనాన్ని పొందుతాడు.

**18. పుష్పనగరి :** ఈ పుణ్యస్థలాన్ని దర్శించి అక్కడ పితృదేవతలకి పిండ ప్రదానాలు చేస్తే నూరుతరాల వారు తరిస్తారు.

**19. కాలంజర క్షేత్రం :** భూలోకంలోని సుప్రసిద్ధ క్షేత్రాల్లో ఒకటి కాలంజర క్షేత్రం. ఇక్కడ పరమేశ్వరుడు కాలుడిని జీర్ణించుకున్నాడు. పూర్వం శ్వేతుడనే రాజర్షి పరమేశ్వరుణ్ణీ ధ్యానిస్తూ సర్వకాల సర్వావస్థల్లో ఆయన మీదే మనసు లగ్నం చేసి కాలం గడపసాగాడు. ఒకనాడు భయంకరమైన రూపంతో తేజోరూపుడైన కాలుడు (యముడు), అతన్ని యమలోకానికి తీసుకెళ్ళటానికి వచ్చాడు.

మహాభయంకరమైన కాలుణ్ణి చూసి భయపడ్డ శ్వేతకేతుడు, తాను పూజిస్తున్న శివలింగాన్ని పట్టుకుని, "స్వామీ! శరణు నీవే నన్ను రక్షించాలి అని ప్రార్థిస్తూ శతరుద్రీయాన్ని జపించటం ప్రారంభించాడు. యముడికి కోపం వచ్చింది. వెంటనే తన పాశాన్ని శ్వేతకేతుడి మీదకి విసిరేసాడు. యమపాశం తనని తాకినప్పటికీ ఏమాత్రం చలించని శ్వేతకేతుడు తిరిగి ఇలా దీనంగా శివుణ్ణి ప్రార్థించాడు.

### శ్వేతమహర్షి చేసిన శివస్తుతి

నిరీక్ష్య దేవ మీశ్వరం ప్రహృష్టమానసో హరం ।
ననామ సాంబ మవ్యయం స రాజపుంగవస్తదా ॥ 1

నమో భవాయ హేతవే హరాయ విశ్వశంభవే ।
నమః శివాయ ధీమతే నమోఽ పవర్గదాయినే ॥ 2

నమో నమో నమోస్తు తే మహావిభూతయే నమః ।
విభాగహీనరూపిణే నమో నరాధిపాయ తే ॥ 3

నమోస్తు తే గణేశ్వర ప్రపన్నదుఃఖనాశన ।
అనాదినిత్య భూతయే వరాహశృఙ్గధారిణే ॥ 4

నమో వృషధ్వజాయ తే కపాలమాలినే నమః ।
నమో మహానటాయ తే నమో వృషధ్వజాయ తే ॥ 5

*(శ్లో॥28-32,అధ్యా-35)*

జగద్హేతువుకి నమస్కారం. భవుడికి, జగత్స్రష్టికి, హరుడికి, జ్ఞానరూపుడైన శివుడికి, అపవర్గదాయికి, మహావిభూతికి, అఖండరూపుడికి, నరాధిపుడికి, గణాధిపుడికి, పపన్న దుఃఖనాశకుడికి, అనాది నిత్యవిభూతికి, వరాహశృంగధారికి, వృషధ్వజుడికి, కపాలమాలికి, మహానటుడికి నమస్కారం."

ఈ విధంగా తనని శరణు వేడుకున్న శ్వేత మహర్షిని అనుగ్రహించి అక్కడ ప్రత్యక్షమైన శివుడు, తనని సైతం ధిక్కరించి తన భక్తుడి ప్రాణాలు తీయబోతున్న కాలుణ్ణి, తన పాదంతో ఒక్క తన్ను తన్నాడు. ఆ దెబ్బకి కాలుడు మరణించాడు. ఈ విషయం తెలిసిన బ్రహ్మదేవుడు వెంటనే అక్కడికి వచ్చి కాలుణ్ణి బ్రతికించమని శివుణ్ణి కోరగా, ఆయన తిరిగి కాలుణ్ణి బ్రతికించాడు.

ఈ కాలంజర తీర్థంలోనే ఈ మహిమాన్విత సంఘటన జరిగింది. పరమేశ్వరుడి చేత శ్వేతకేతుడు మృత్యుంజయుడయ్యే వరాన్ని కూడా పొందాడు. అంతేకాదు శ్వేతకేతు భక్తికి మెచ్చి ఆయన్ని తన గణాలలో ఒకడిగా చేర్చుకున్నాడు. ఇంతటి గొప్ప తీర్థాన్ని దర్శించినవాడు శివానుగ్రహాన్ని సంపూర్ణంగా పొంది శివలోకాన్ని చేరుకుంటాడు.

**20. మహాలయ తీర్థం :** భూలోకంలో ఉన్న శివతీర్థాలలో మహిమాన్వితమైనది మహాలయ తీర్థం. తన ఉనికికి నిదర్శనంగా పరమేశ్వరుడు ఇక్కడి శిలలో తన పాదముద్రని ఉంచాడు. ఇది నాస్తికులకి కనువిప్పు కలిగిస్తుంది. ఈ దివ్యక్షేత్రంలో భస్మాన్ని వంటినిండా పూసుకున్న పాశుపత శైవభక్తులు మహాదేవుణ్ణి శ్రద్ధగా ఉపాసిస్తుంటారు. ఈ దివ్యతీర్థంలో ఉన్న పుష్కరిణిలో స్నానం చేసి శివదర్శనం చేసుకున్నవారు రుద్రలోకాన్ని చేరుకుంటారు.

**21. ప్లక్షావతరణం :** శ్రీమన్నారాయణుడు కొలువున్న దివ్యక్షేత్రం ప్లక్షావతరణం. ఇక్కడి శ్రీహరిని సేవించినవాడు వైకుంఠధామాన్ని చేరుకుంటాడు.

**22. కేదార తీర్థం :** పరమేశ్వరుడి దివ్యతీర్థాలలో గొప్పది. కేదార తీర్థం. ఇది సర్వశుభంకరమైనది. సిద్ధులకి నివాసస్థానం. ఈ తీర్థంలో ఉన్న పవిత్రజలాన్ని స్వీకరించినవారికి శివగణాధిపత్యం లభిస్తుంది.

**23. శ్రీపర్వత తీర్థం :** దివ్యమైన ఈ తీర్థంలో పరమేశ్వరుడు పార్వతీదేవితో కలిసి నివసిస్తుంటాడు. ఇక్కడ చేసిన స్నానం, దానం, పిండప్రదానం లాంటి కర్మలు, అక్షయమైన పుణ్యాన్ని ప్రసాదిస్తాయి.

**24. గోదావరీ తీర్థం :** ఇది పరమపవిత్రమైనది. ఇందులో స్నానం చేసిన వారికి సకల పాపాలూ నశిస్తాయి. ఈ తీర్థంలో పితృదేవతలకి పిండప్రదానం చేస్తే నూర తరాల వారు తరిస్తారు. సహస్రగోవుల్ని దానం చేసిన ఫలం ఈ తీర్థంలో స్నానంచేసిన వారికి లభిస్తుంది.

**25. కావేరీ తీర్థం :** పరమపావనమైన తీర్థాలలో ఒకటి కావేరీ తీర్థం. ఈ నదీ జలాలలో స్నానంచేసి, మూడు రాత్రులు లేక ఒక్కరాత్రి గానీ ఉపవాసం వుండి, తర్పణాలు విడిచిన మానవుడికి సకల పాపాలనుంచీ విముక్తి లభిస్తుంది.

**26. స్వామి తీర్థం :** ఇది దేవసేనా నాయకుడైన కుమారస్వామి కొలువైన తీర్థం. ఆ స్వామి ఇక్కడ నిత్యం నివసిస్తుంటాడు. ఈ తీర్థం దగ్గరే కుమారధార వుంది. ఆధార క్రింద స్నానం చేసి, షణ్ముఖుణ్ణి భక్తిగా ఆరాధించినవాడు, మరణానంతరం స్కందలోకానికి చేరుకుంటాడు.

**27. మానస సరోవర తీర్థం :** భూలోకంలో ఉన్న సకల తీర్థాలలో ఉత్తమమైనది. సాక్షాత్తు పరమేశ్వరుడి కైలాస శిఖరం సన్నిధిలో ఉన్నది, హిమాలయాలకే అలంకారంగా వెలుగొందుతున్నదీ ఈ మానస సరోవరం. ఈ దివ్య సరస్సులో స్నానం చేసినవారు ఇంద్రుడి అర్ధసింహాసనాన్ని అధిష్ఠిస్తారు. స్వర్గ లోకంలో సుఖాలనుభవిస్తారు. చివరికి మోక్షాన్ని పొందుతారు.

ఈ తెలిపిన తీర్థాలతో పాటు మానవుల్ని తరింపచేసే తామ్రపర్ణి తీర్థం, చంద్రతీర్థం, వృషతీర్థం, దశాశ్వమేధ తీర్థం, పుండరీక మహాతీర్థం, బ్రహ్మతీర్థం, వ్యాసతీర్థం, యమునా తీర్థం, గంధకాళీతీర్థం, కుబేరతుంగతీర్థం, ఉమాతుంగ తీర్థం, భృగుతుంగ తీర్థం, కాలసర్పితీర్థం, దశార్ణతీర్థం, కురుజాంగల తీర్థం, వైతరిణీ మహాతీర్థం, స్వర్ణవేదీ తీర్థం, ధర్మపృష్ఠ తీర్థం, భరతాశ్రమ తీర్థం, శ్రాద్ధవటం,

మహాహ్రద తీర్థం, ముంజపృష్ఠతీర్థం, కనకనందన తీర్థం అనేవి ఎన్నో వున్నాయి. వీటిలో స్నానంచేసి, దైవాన్ని దర్శించినవారికి ఐహికాముష్మిక ఫలాలు లభిస్తాయి.

## బదరికాశ్రమ క్షేత్రం

బదర్యాశ్రమమాసాద్య ముచ్యతే కలికల్మషాత్ ।
తత్ర నారాయణోదేవో నరేణాస్తే సనాతనః ॥

అక్షయ్యం తత్రదానం స్యాత్ జాప్యం వాపి తథావిధం ।
మహాదేవ ప్రియం తీర్థం పావనం తత్ విశేషతః ।
తారయేచ్ఛ పితౄనే సర్వాన్ దత్వా శ్రాద్ధం సమాహితః ॥

*(శ్లో॥47-48,అధ్యా-36)*

పరమపావనమైన నారాయణ క్షేత్రం బదరికాశ్రమం. శ్రీమన్నారాయణుడు నారాయణ మునిగా నరుడితో కలిసి నివసిస్తున్న తపోక్షేత్రం అది. ఆ దివ్యక్షేత్రాన్ని దర్శించినవాడికి కలిదోషాలు తొలగిపోతాయి. ఈ దివ్య తీర్థంలో ఇచ్చిన దానం, చేసిన జపం అక్షయమైన ఫలితాలనిస్తుంది. ఈ బదరీ క్షేత్రం మహాదేవుడైన పరమేశ్వరుడికి కూడా ఎంతో ప్రీతి పాత్రమైనది. ఈ తీర్థంలో శ్రాద్ధ కర్మలు ఆచరించి, పితరులకి పిండప్రదానం చేసినవాడు, తన పూర్వీకులందర్నీ తరింపచేస్తాడు.

సిద్ధ గంధర్వుల చేత నిత్యం సేవించబడే దేవదారువనం అక్కడే ఉంది. భక్తవత్సలుడైన శివుడిచేత వరమివ్వబడిందీ క్షేత్రం. పూర్వం మునులందర్నీ మోహింపచేసిన, శివుడు తిరిగి వారందరి చేతా పూజించబడి వారిని అనుగ్రహించాడు. ఆ మునులతో “మీరంతా రమ్యమైన బదరికాశ్రమానికి వెళ్ళి తపస్సుచేసి తరించండి. ధర్మాన్ని అనుష్ఠించేవారు ఎవరైతే నన్ను ఈ క్షేత్రంలో అర్చిస్తారో వారికి పరమపదాన్ని, గాణాపత్యాన్ని ప్రసాదిస్తాను. శ్రీమన్నారాయణుడితో సహా ఈ దివ్యక్షేత్రంలో నేను నివసిస్తాను. ఇక్కడ ప్రాణాలు కోల్పోయిన వాడికి పునర్జన్మ ఉండదు. పరమపావనమైన ఈ తీర్థాన్ని స్వయంగా దర్శించలేనివారు కనీసం బదరీక్షేత్రాన్ని స్మరించినా చాలు అక్షయ పుణ్యం లభిస్తుంది అని ప్రబోధించాడు.

## పాతివ్రత్య మాహాత్మ్యం

భర్తని త్రికరణశుద్ధిగా సేవించే స్త్రీకి ఎలాంటి పాపం అంటారు. స్త్రీలకి పాతివ్రత్యమే అన్ని పాపాలకీ ప్రాతుశ్చిత్తం. పాతివ్రత్య ధర్మాన్ని నిరంతరం ఆచరించే స్త్రీ సాక్షాత్తు పార్వతీదేవి స్వరూపమే. అందుకు ఎలాంటి సందేహం లేదు. సాక్షాత్తు దేవతలే దిగివచ్చి వారిని ఆపదల్లో కాపాడతారు.

పూర్వం శ్రీరాముడు సీతాసమేతంగా వనవాసం చేస్తున్న సమయంలో, శూర్పణఖ ద్వారా సీతాదేవి అందచందాల గురించి తెలుసుకున్న రావణుడు ఎలాగైనా ఆమెని సొంతం చేసుకోవాలనుకున్నాడు. వెంటనే మాయా సన్యాస వేషాన్ని ధరించి ఒంటరిగా ఉన్న సీత దగ్గరకి వచ్చాడు. 'భవతీ భిక్షాందేహి' అని అనగానే కుటీరంలో ఉన్న సీతాదేవి వచ్చిన సన్న్యాసి అసురుడని గ్రహించింది. వెంటనే శ్రీరామచంద్రుణ్ణి స్మరించి, తన పాతివ్రత్య ధర్మం నిలబడాలని కోరుతూ గార్హపత్యాగ్నిని ఇలా శరణు వేడుకుంది.

మహా యోగస్వరూపుడు, పరమగహనుడు, కృతాంతుడు, సకల భూతదాహకుడు, కాలరూపుడు ఈశ్వరుడు అయిన అగ్నికి నమస్కరిస్తున్నాను. విశ్వతోముఖుడు, సకల సాక్షి అయిన పావకుడికి నమస్కారం. సకలజీవుల హృదయాలలో కొలువుండేవాడు, ప్రకాశించే దివ్యదేహం కలిగినవాడు, ఆత్మస్వరూపుడు, బ్రాహ్మరూపి, బ్రాహ్మణప్రియుడు అయిన అగ్నిదేవుణ్ణి వేడుకుంటున్నాను. చర్మవసనుడు, భూతపతి శరణ్యుడు, పరమపర స్వరూపుడు అయిన అగ్నిని శరణు వేడుకుంటున్నాను.

జగద్యోని, సకల తేజస్సులకీ కారణభూతుడు, మహా యోగేశ్వరేశ్వరుడు, ఆదిత్యుడు, పరమేష్ఠి స్వరూపుడు అయిన అగ్నికి నమస్కరిస్తున్నాను. మహాగ్రాసుడు, త్రిశూలి, భోగమోక్ష ఫలప్రదుడు, యోగేశుడు, రుద్రుడు, కాలాగ్ని రూపుడు అయిన అగ్నిని శరణు వేడుకుంటున్నాను. వ్యాహృతి రూపుడిని, విరూపాక్షుణ్ణి, హిరణ్మయ (బంగారు) గృహంలో నివసించేవాడిని శరణు వేడుతున్నాను. సకల ప్రాణుల్లో వున్న వైశ్వానరాగ్నిని శరణు వేడుకుంటున్నాను. జ్యోతిస్వరూపుడైన అగ్నిని శరణు కోరుతున్నాను. ఓ హవ్యవాహనా! నన్ను కాపాడు.

ఈవిధంగా సీతాదేవి గార్హపత్యాగ్నిని ప్రార్థించగానే అగ్నిదేవుడు దివ్యతేజస్సుతో జ్యోతిస్వరూపుడుగా ఆవిర్భవించాడు. పరమ పతివ్రత సీతాదేవిని రావణుడి బారినుంచి రక్షించాలని భావించి, అక్కడొక మాయాసీతని సృష్టించి, నిజమైన సీతను అక్కణ్ణుంచి తీసుకెళ్ళి జగన్మాత పార్వతీదేవి దగ్గరకి చేర్చాడు.

ఇక్కడ మాయసీత కుటీరంలోంచి బైటకి వచ్చింది. ఆమె నిజమైన సీతనుకొని రావణుడు అపహరించి లంకలో బంధించాడు. తరువాత రామలక్ష్మణులు వానర సైన్యంతో లంకమీదకి దండెత్తి రావణుణ్ణి వధించి, సీత చెర విడిపించారు. చెర నుంచి బైటికొచ్చిన సీతను తిరిగి తన భార్యగా స్వీకరించటానికి రాముడు సందేహిస్తుంటే, సీతాదేవి అది గ్రహించి, తన పాతివ్రత్యాన్ని నిరూపించుకోవాలని అగ్నిప్రవేశం చేసింది.

అగ్నిదేవుడు తనలో ప్రవేశించిన మాయాసీతని దహించి అసలైన సీతను తెచ్చి రాముడికందించాడు. పూర్వం జరిగిన విషయమంతా రాముడితో "శ్రీరామా! మిథిలా నగరాధిపతి జనకుడు పార్వతీదేవిని ఎంతోకాలం ఆరాధించి, ఆమెకి అత్యంత ప్రీతిపాత్రురాలైన సీతాదేవిని పుత్రికగా పొందాడు. దుష్టరావణుడు, మీరు కుటీరంలో లేని సమయం చూసి, మాయవేషంలో సీతని అపహరించాలని వచ్చాడు. అప్పుడు సీతాదేవి నన్ను ప్రార్థించింది. నేను వెంటనే వెళ్ళి మాయాసీతను అక్కడుంచి, నీ నిజమైన సీతను తీసుకెళ్ళి పార్వతీదేవి దగ్గరుంచాను. ఎందుకంటే రావణాసురుడు నీ చేతిలో సంహరించబడాలి కనుక. ఇదిగో ఈమే నీ భార్య సీతాదేవి. పరమసాధ్వి, మహాపతివ్రత, పరిశుద్ధురాలైన ఈమెని నీవు గ్రహించు" అని సీతను అప్పగించి రాముడి పాదారవిందాలకి నమస్కరించి అంతర్ధానమయ్యాడు.

పతివ్రతల మాహాత్మ్యం ఇంత గొప్పదని ఈ ఇతివృత్తం అందరికీ తెలియచేస్తుంది. సీతలాగానే సతీసుమతి, సతీ అరుంధతి, సతీ సావిత్రి లాంటి మహాపతివ్రతలు ఎందరో పాతివ్రత్య మాహాత్మ్యాన్ని నిరూపించారు.

## సన్యాసి ధర్మాలు

సన్యాసి కావాలనుకునేవాడు తన ఆయుర్ధాయంలో మూడోభాగాన్ని వానప్రస్థాశ్రమంలో గడిపి, నాలుగోభాగాన్ని సన్యాసదీక్షతో నడపాలి. అగ్నుల్ని తనలో ఆరోపించుకుని సన్యసించాలి. సన్యాసి అయినవాడు నిరంతరం యోగాభ్యాసరతుడు, శాంతచిత్తుడు, బ్రహ్మవిద్యాల పరాయణుడు కావాలి. మనసులో అన్నిరకాల కోరికల మీదా సంపూర్ణంగా విరక్తి కలిగితేనే సన్యసించాలి కానీ, విరక్తి కలగకుండా సన్యసిస్తే పతితుడవుతాడు. ఇంద్రియ నిగ్రహాన్ని, పరిపూర్ణంగా వైరాగ్యాన్ని కలిగినప్పుడే సన్యాసదీక్ష స్వీకరించాలి.

జ్ఞాన సంన్యాసినః కేచిద్వేద సంన్యాసినః పరే ।
కర్మ సంన్యాసినః స్త్వన్యే త్రివిధాః ప్రకీర్తితాః ॥ *(శ్లో॥5,అధ్యా-34,ఉ.భా.)*

సన్యాసులు మూడురకాలుగా ఉంటారు. 1.జ్ఞాన సన్యాసులు 2.వేద సన్యాసులు 3.కర్మ సన్యాసులు అని.

1. **జ్ఞాన సన్యాసి :** సర్వసంగ నిర్ముక్తుడై, శీతోష్ణాలని సహిస్తూ, ఎలాంటి భయాలూ లేకుండా, ఆత్మరతుడై (బ్రహ్మ నిష్ఠుడై) ఉండేవాడు జ్ఞానసన్యాసి.
2. **వేద సన్యాసి :** ఎలాంటి ఆశలూ లేకుండా, ఎవరి నుంచి దానాల్ని స్వీకరించకుండా, ఇంద్రియ నిగ్రహంతో, ఎప్పుడూ మోక్షం మీదే దృష్టిని ఉంచి వేదాన్ని మాత్రమే అభ్యసించేవాడు వేదసన్యాసి.
3. **కర్మ సన్యాసి :** అగ్నుల్ని తనలో ఆరోపించుకుని, తానుచేసే అన్నిరకాల పనుల్నీ బ్రహ్మార్పణం చేస్తూ, నిరంతరం మహాయజ్ఞాల్ని ఆచరించేవాడు కర్మసన్యాసి.

ఈ మూడురకాల సన్యాసుల్లో జ్ఞాన సన్యాసి గొప్పవాడు. ఈ జ్ఞానసన్యాసి ఎలాంటి మమకారాలు లేకుండా, జీర్ణమైన కౌపీనాన్ని (పాత గోచీని) ధరించిగానీ, నగ్నంగాకానీ ఉండవచ్చు. అయితే నిరంతరం ధ్యానతత్పరుడై ఉండాలి.

## సన్యాసి అయిన బ్రహ్మచారి ధర్మాలు

❊ బ్రహ్మచారి ఎప్పుడూ మితంగానే భోజనం చేయాలి.

❊ గ్రామం నుంచి అన్నాన్ని భిక్షగా తెచ్చుకోవాలి.

❋ నిరంతరం ఆధ్యాత్మిక భావాల్ని కలిగి, శాకాహారాన్ని భుజించాలి.

❋ ఇతరుల సాయం కోరకుండా తన పనులు తానే చేసుకోవాలి.

❋ జనన మరణాలని అభినందించకూడదు. కాలం కోసం ఎదురుచూడాలి.

❋ గురువు ఆదేశాన్ని పాటించాలి. గురుశుశ్రూష చేయాలి.

❋ ఒంటి వస్త్రంతోకానీ, కౌపీనంతో కానీ ఉండాలి.

❋ శిరోముండనం చేయించుకుని, కాషాయ వస్త్రాలు ధరించి, శిఖని ధరించి ఎప్పుడూ ధ్యానయోగ పరాయణుడిగానే ఉండాలి.

❋ బ్రహ్మచారి ఊరిచివర చెట్టుక్రిందకానీ, దేవాలయ ప్రాంగణంలోకానీ నివసించాలి.

❋ శత్రువులతో, మిత్రులతో, మానావమానాలలో సమానదృష్టితో ఉండాలి.

❋ ఎప్పుడూ ఒకరి అన్నాన్నే తినకూడదు. పలువురి ఇళ్ళలో భిక్షని స్వీకరించాలి.

❋ ఎలాంటి రాగద్వేషాలు లేకుండా, బంగారాన్ని మట్టిని ఒకేవిధంగా చూడగలగాలి. ❋నిత్యం స్నానాన్ని ఆచరిస్తూ కమండలాన్ని ధరించాలి.

❋ జాగ్రత్తగా నడవాలి. వడకట్టిన నీళ్ళనే త్రాగాలి. మౌనాన్ని పాటించాలి. సత్యాన్నే పలకాలి. వర్షాకాలం తప్ప ఇతర కాలాల్లో ఒకే ప్రదేశంలో ఉండకూడదు. ❋బ్రహ్మచర్యాన్ని త్రికరణశుద్ధిగా పాటించాలి.

అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యం తపః పరమ్ ।
క్షమా దయా చ సంతోషా వ్రతాన్యస్య విశేషతః ॥
వేదాంతాజ్ఞాన నిష్ఠోవా పంచయజ్ఞా సమాహితః ।
జ్ఞానధ్యాన సమాయుక్తో భిక్షార్థేనైవ తేనహి ॥

*(శ్లో॥27-28,అధ్యా-28)*

అహింస, అస్తేయం, బ్రహ్మచర్యం, తపస్సు, క్షమ, దయ, సంతోషం అనేవి. సన్యాసి పాటించాల్సిన ప్రధాన వ్రతాలు. సన్యాసి వేదాంత జ్ఞాన నిష్ఠుడు కావాలి. సావధానంగా పంచయజ్ఞాలు ఆచరించాలి. ప్రతిరోజూ మూడు సార్లు స్నానం చేయాలి. భిక్షాన్నంతోనే యాగాలు చేయాలి. ఆయా కాలాలకి

అనుగుణంగా హోమమంత్రాలు పఠించాలి. ప్రతిరోజూ వేదాధ్యయనం, రెండు పూటలా గాయత్రీ మంత్రం జపం చేయాలి. ఏకాంతంగా పరమేశ్వరుణ్ణి స్మరించాలి. కామక్రోధాల్ని విడిచిపెట్టాలి.

## నైమిశారణ్య తీర్థ మాహాత్మ్యం

ఇదం త్రైలోక్య విఖ్యాతం తీర్థం నైమిశ ముత్తమమ్ ।
మహాదేవ ప్రియకరం మహాపాతక నాశనమ్ ॥

మహాదేవం దిదృక్షూణాం మృషీణాం పరమేష్ఠినామ్ ।
బ్రాహ్మణానిర్మితం స్థానం తపస్తప్తుం ద్విజోత్తమాః ॥ *(శ్లో॥1-2,అధ్యా-41)*

భూలోకంలో ఉన్న క్షేత్రాల్లో ఎంతో గొప్పది నైమిశారణ్యం. ఇది మహాపాతక నాశనమైన క్షేత్రం. పరమేశ్వరుడికి ఎంతో ప్రీతి పాత్రమైనది. పరమ నిష్ఠాగరిష్ఠులైన మహర్షులు తపస్సు ద్వారా పరమేశ్వర దర్శనం పొందటం కోసం బ్రహ్మదేవుడు ఏర్పర్చిన స్థానం.

పూర్వం బ్రహ్మ, అత్రి, వశిష్ఠ, క్రతు, అంగిర, వంశాలలో పుట్టిన మహర్షులందరూ బ్రహ్మదేవుడు దగ్గరకొచ్చి "పితామహా! పరమేశ్వర సాక్షాత్కారాన్ని కలిగించే క్షేత్రం ఏది?" అని ప్రశ్నించారు. అప్పుడు బ్రహ్మ తన దైవ శక్తితో ఒక చక్రాన్ని సృష్టించి వారితో "మహర్షులారా! నేనీ చక్రాన్ని విడిచిపెడుతున్నా ఈ చక్రాన్ని అనుసరించి మీరు వెళ్ళండి. దీని నేమి ఎక్కడైతే శీర్ణమౌతుందో, ఆ స్థానమే దివ్య భూమి, తపోభూమి. ఆ ప్రదేశం గొప్ప క్షేత్రం అక్కడ మీరు తపస్సు చేస్తే ఈశ్వర సాక్షత్కారం లభిస్తుంది." అని చెప్పి చక్రాన్ని వదిలిపెట్టాడు. మహర్షులంతా చక్రాన్ని అనుసరిస్తూ వెళ్ళి అది అగిన ప్రదేశాన్ని 'నైమిశారణ్య క్షేత్రంగా' కీర్తించారు. ఆ దివ్య క్షేత్రంలోనే తపస్సు చేసి ఈశ్వర దర్శనాన్ని పొందారు. ఆ తరువాత ఎందరో మునులు, మహర్షులు ఆ దివ్య స్థలంలో తపస్సులు, దీర్ఘసత్రయాగాలు నిర్వహించారు.

అత్రదానం తపస్తప్తం స్థానం జప్యాదికం చయత్ ।
ఏకైకం పావయేత్ పాపం సప్తజన్మకృతం ద్విజాః ॥

అత్రదేవో మహేశానో రుద్రాణ్యాకిల విశ్వకృత్ ।
రమతేఽద్యాపి భగవాన్ ప్రమధైః పరివారతః ॥ *(శ్లో॥1-2,అధ్యా-41)*

ఈ దివ్యక్షేత్రంలో చేసిన తపస్సు, దానం, యజ్ఞం, జపం అనేవి ఒక్కొక్కటీ ఏడుజన్మల పాపాల్ని నశింపచేస్తాయి. ఇక్కడే మహాదేవుడైన పరమేశ్వరుడు పార్వతీదేవితో, ప్రమధగణాలతో కలిసి ఇప్పటికీ ఆనందంగా విహరిస్తున్నాడు.

## కూర్మ పురాణం ఫలశ్రుతి

జగత్కళ్యాణ కారకుడైన శ్రీహరి కూర్మరూపాన్ని ధరించి స్వయంగా చెప్పిన దివ్యపురాణం ఇది.

యః పఠేత్ సతతం మర్త్యోనియమేన సమాహితః ।
సర్వపాప వినిర్ముక్తో బ్రహ్మలోకే మహీయతే ॥ 1

లిఖిత్వా చైవ యోదద్యాత్ వైశాఖేమాసి సువ్రతః ।
విప్రాయ వేద విదుషే తస్యపుణ్యం నిబోధత ॥ 2

సర్వపాప వినిర్ముక్తః సర్వైశ్వర్య సమన్వితః ।
భుక్త్వావ చ విపులాన్ స్వర్గే భోగానే దివ్యాన్ సుశోభనాన్ ॥ 3

*(శ్లో॥123-125,అధ్యా-44)*

నియమంగా ఈ కూర్మ పురాణాన్ని పఠించిన వాడు, సకలపాపాల నుంచీ విముక్తుడై బ్రహ్మలోకంలో నివసిస్తాడు. వైశాఖమాసంలో ఈ పురాణాన్ని వ్రాసి (లేదా కొని) వేదవిదుడైన బ్రాహ్మణుడికి దానం చేస్తే సకల పాపాలూ తొలగి, సకలైశ్వర్యాలూ కలిగి, స్వర్గంలో దివ్యభోగాలు అనుభవిస్తారు. యజ్ఞసమాప్తి సమయంలో ఈ పురాణాన్ని పఠిస్తే సర్వదోషాలూ తొలగిపోతాయి. మోక్షాన్ని కోరుకునేవారు ఈ పురాణాన్ని శ్రద్ధగా పఠించాలి లేదా శ్రవణం చేయాలి.

**స్వస్తి**

**సర్వేజనాః సుఖినోభవన్తు**



